శివానుభవ గ్రంథమాల : ద్వాదశ బిల్వము



# అక్కమహాదేవి వచనములు

అనువాదము
రేకళిగె మఠం వీరయ్య
(ఉంబాబజారు, హైదరాబాద - ఆం. ప్ర)






ప్రకాశకులు
**శివానుభవ సమితి, హైదరాబాద.**
4-7-947, ఇసామియా బజారు, హైదరాబాద - 500 027 (ఆం. ప్ర.)
1982

ప్రథమ ముద్రణ. 1982
ప్రతులు. 1,000

మూల్యము

సభ్యులకు 7-50

ఇతరులకు 10-00

(ఈ మూల్యము మరొక పుస్తకమున కనుకూలము)

ముద్రణ

నాగలక్ష్మి ఆర్ట్ ప్రింటర్స్,

బషీర్‌బాగ్, హైదరాబాద్-29.

# శివానుభవ సమితి హైదరాబాద

4-7-947, ఇసామియాబజారు

హైదరాబాద-500 027 - (ఆం. ప్ర.)

## సంచాలక వర్గము

సంచాలకులు

రవికోటి మఠము వీరభద్రయ్య

(ఆయుర్వేద భూషణ)

ఉప సంచాలకులు

హిరేమఠము కందగల్ విరూపాక్షయ్య

B. A., L L. B.,

సభ్యులు

రేకళిగె మఠము వీరయ్య

వి. శంకరప్ప (B.A.,BEd,Rtd., D.E.O.)

హేరూరు రాచప్ప వర్తకులు

కె. చంద్రమౌళి (ఉపాధ్యాయులు)

# శివానుభవ సమితి, హైద్రాబాద-27.

## దాతలు

ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమివారు హైద్రాబాద

రూ. 2, 000-00

శ్రీమతి, సౌ॥ హేరూరు సావిత్రమ్మగారు రూ. 1, 111-00

శ్రీ రేకళిగె మఠం వీరయ్యగారు (హైద్రాబాద) రూ. 1, 100-00

శ్రీ బంటారం రాచప్పగారు తాండూరు, రూ. 511-00

శ్రీ చామకూర సిద్దన్నగారు (,,) రూ. 201-00

శ్రీ పత్తి సిద్దప్పగారు (,,) రూ. 200-00

శ్రీ ధరిమిది రాచప్పగారు (,,) రూ. 151-00

శ్రీ కర్ణకోట రాచప్పగారు (,,) రూ. 101-00

శ్రీ Y. D. రామలింగప్పగారు (,,) రూ. 101-00

శ్రీ బసవంతరావు పటేలుగారు (,,) రూ. 101-00

శ్రీ గూడా శంకరప్పగారు సికింద్రాబాద, రూ. 50-00
(సమితి మహాపోషకులు)

శ్రీ గురుబసవలింగాయనమః

# ప్రకాశకుల మనవి

శివశ్రీ రేకళిగెమఠం వీరయ్యగారిని; వారు, శివానుభవసమితి యందు మొదటినుండియు సభ్యులుగానుండి, చేయుచున్న ధార్మిక సాహిత్య సేవను, ముఖ్యముగా శివశరణుల వచన సాహిత్యాంధ్రీ కరణమును ఎరుంగని వారు ఉండరు. ప్రస్తుతము వారికున్న కౌటుంబిక చిక్కులను లెక్క చేయక, ఈ వృద్ధాప్యమునందును శివశరణుల వచన సాహిత్య ప్రచార మునకై వారు శ్రమించు చుండుటవలన, వారుతమ మిగత జీవితమును అందుకు అర్పితముగా చేసినట్లు తెలియుచున్నది.

బసవేశ్వరుని చెన్నబసవేశ్వరుని కొన్నికొన్ని వచనములకు వారొనరించిన అనువాదములు పుస్తకముల రూపమున ఇంతకు పూర్వమే, శివానుభవ గ్రంథమాలయందు ప్రకటింపబడినవి అందరికిని విదితమే. అక్కమహాదేవి వచనములు, సిద్ధరామేశ్వరుని వచనములు, శివలెంక మంచన్న వచనములు, కొన్ని కొన్నింటి అనువాదములు, 'శ్రీశైలప్రభ' 'భారతి', మాసపత్రికలయందు; మరియు బసవేశ్వరుని గురించిన, అక్క మహాదేవి గురించిన వ్యాసములు స్థానీయ దినపత్రికలయందు ప్రకటింపబడి నవియు అందరకు తెలిసినవిషయమే. వారు బసవేశ్వరుని అన్నివచనము లను, మరికొందరు శివశరణుల వచనములనుకూడ అనువదించియున్నారు.

ప్రస్తుతము అక్కమహాదేవి అన్నివచనములను అనువదించి, "అక్కమహాదేవి గురించి" అను పరిచయవ్యాసముతో, శివానుభవ గ్రంథ

మాలయందు ద్వాదశ బి-ల్వముగా ప్రకటించుటకు, శివానుభవ సమితికి సమర్పించియున్నారు. ఈపుస్తకప్రకటన గురించి వారు రు. ౧౧౦౦-౦౦ విరాళమును కూడ నొసగియున్నారు. వారి ఈ శరణ సాహిత్యాభిమానము అత్యంతప్రశంసనీయము. పరమేశ్వరుడు వారికి ఆయురారోగ్యముల ప్రసాదించి, శరణసాహిత్యసేవ చేయుటకు, తగు పటుత్వము ననుగ్రహించునటులు ప్రార్థించుచు, "అక్కమహాదేవి వచనములు", అను వారి అనువాదపుస్తకమును, శివానుభవ గ్రంథమాలయందు "ద్వాదశ బిల్వము"గా ప్రకటించుటకు సంతసించుచున్నాను.

శ్రీ వీరయ్యగారి మనవిని మన్నించి, ఆంధ్రప్రదేశ సాహిత్యఅకాదమి వారు, ఈ పుస్తకప్రకటనగురించి రు. ౨౦౦౦-౦౦ (రెండువేల రూపాయలు) విరాళమును దయతోనొసగి ప్రోత్సహించి యున్నారు. సాహిత్య అకాదమివారికి. నాపరముగను శివానుభవసమితి పరముగను, హృదయపూర్వక కృతజ్ఞతలను తెలుపుచున్నాను. ఈ విరాళమును మా మిత్రులు, వచన సాహిత్యాభిమానులు, శ్రీ హేరూరు రాచప్పగారి నివాసము (హైద్రాబాద) నందు, ఒకరోజు తెలిపి, ప్రస్తుత పుస్తక ప్రకటనకు ఇంకను కొంత విరాళము అవసరమని నేనును శ్రీ వీరయ్యగారును ఆలోచించుచుండగా, మేము చేయుచున్న సాహిత్యసేవకు సంతసించి, అచ్చటనున్న కుంకుమశోభిత, సౌ॥ సావిత్రమ్మగారు, (శ్రీ హేరూరు రాచప్పగారి ధర్మపత్ని), మహాయోగిని మాతా మాణిక్యమ్మగారిచే తాము బొందిన సద్బోధ సంస్మరణార్థము, అక్కమహాదేవికి తమ భక్తి కానుకగా రూ. ౧౧౧౧-౦౦ (వెయ్యిన్నినూట పదకొండు రూపాయలు) విరాళము నిచ్చెదనసిరి. అదేప్రకారము వారు తేది 28-8-81 నాడు మా కరువునను ఆహ్వానించి, మృష్టాన్న భోజనము చేయించి, భూరిసంభావన తోడుతు తమువిరాళము రు. ౧౧౧౧-౦౦నొసంగిరి. వారి ఈ ఔదార్యము

వలన, శరణ సాహిత్యప్రచారమునందు వారికి గల శ్రద్ధ, ఉత్సాహము తెలియుచున్నది. సౌ. సావిత్రమ్మగారి ఈ యుదారము వలన, శరణ సాహిత్య ప్రచారము నందు పురుషులకు వెనుదీయని దానగుణముగల మహిళలు కూడ మనయందుగలరని తెలియుచున్నది. హేరూరు సతీమణి యొక్క ఈ యుదారము మాకు మరింత ఉత్తేజనము కలిగించినది. వారికి మా హార్దిక కృతజ్ఞతలను తెలుపుచున్నాము.

ఈసందర్భమున సౌ. సావిత్రమ్మగారి జీవనవిశేషములనుకొన్నింటిని తెలుపుట సముచితమని తలంచెదను. వారు హుబ్లియందలి సామాన్య కుటుంబమునందు జన్మించినను, చిన్ననాటనుండియే, గురుజంగమముల ఎడల భక్తి గలిగి, శివాచారిణిగా పెంపొందిరి. తాండూరు నందలి సుప్రసిద్ధ సంపన్నులగు శ్రీ హేరూరురాచప్పగారితో వివాహమై గృహస్థ జీవనమును గడుపుచున్నపుడు; వారియందలిశివాచారము శివభక్తిమరింత పెరిగినది. ఒక కుమారుడు, ఇరువురు కుమార్తెలు కలుగగానే వారికి సంసార జీవనమునందు, విముఖత కలుగ నారంభించినది, అదే సమయమునందు యానగొందిమాణిక్యమ్మగరి యోగసాధన, తపస్సిద్ధి. ఆప్రాంతమందు ఇంటింటి ముచ్చటగా ప్రసిద్ధిచెందియుండెను. అదివిని సౌ॥సావిత్రమ్మగారు, తనభర్త, పిల్లలతో అమ్మగారిధర్శనార్థము (1956)లో యానగొంది వెళ్లిరి. అప్పుడు సావిత్రమ్మగారి వయస్సు 24 సంవత్సరములు మాత్రమే. ఆ ప్రాయమునందే, వారు అమ్మగారియందలి బ్రహ్మతేజస్సు వలనను, అమ్మగారి సదుపదేశము వలనను, ప్రభావితులై మూడు రోజులుండి వచ్చెదనని పోయినవారు మూడు సంవత్సరముల వరకు (1956–59) అచ్చటనే ఉండిపోయిరి. ఆ సందర్భముననే, అమ్మగారి ఆదేశానుసారము అచ్చట ఒక సంవత్సరమువరకు, బసవపురాణ శ్రవణము, "త్రిషష్టిపురాతనులపూజ" అన్నదాసోహ సమారంభము భారీయెత్తున జరిగినది. ఆ సమారంభమునందు వేలాది జనులు, పురాణశ్రవణము వలనను

ప్రసాదానుభవమువలనను, పునీతులైరి. అమ్మగారి ప్రభావము నలుదిక్కుల వ్యాపించినది.

ఈ సమారంభము వలన భక్తి భరితయైన సౌ. సావిత్రమ్మగారు సంతానప్రాప్తియైన తదుపరి, వైవాహిక జీవన కర్తవ్యము నెరవేరినదని తలంచి, అమ్మగారి కృపాదృష్టియందే తమ మిగత జీవనమును గడుప దలచిరి. ఈ అభిప్రాయమును అమ్మగారు గ్రహించి, "పిల్లలను కనిన తర్వాత గృహిణి బాధ్యతలు తరుగక పెరుగుననియు, పిల్లల ఎడలగల కర్తవ్యములను నెరవేర్చి, కొడుకుకు కోడలికి సంసార బాధ్యతను అప్పగించి నిశ్చింతగా నా సేవయందుండవచ్చు" ననియు, సౌ॥ సావిత్రమ్మగారికి హితమును బోధించి, ఇంటికి పొమ్మనిరి. అమ్మగారి హితవచనములను కాదనలేక వారు తిరిగియింటికి వచ్చిరి.

వారికి విజయ కుమారుడను నొక కొడుకు, గిరిజ, శాంతలను ఇద్దరు కూతుళ్ళు గలరు. చి॥ విజయకుమారుడు సుప్రసిద్ధ తరుణ న్యాయవాది, ఉజ్జ్వల భవిష్యత్తుకలవారు. కుమార్తెలిద్దరును వివాహితలు. తమ తమ కుటుంబములయందు సదాచార సచ్ఛీలములతో సుఖజీవనముగడుపుచున్నారు. హేరూరు దంపతులు కుమారుని సంతానము వలనను, కుమార్తెల సంతానము వలనను, "తాత, అవ్వలు" కాగలిగిన సుఖజీవులు. పరమేశ్వరుడు హేరూరు కుటుంబ వ్యక్తులకు అష్టైశ్వర్యముల నొసగి; శరణసాహిత్యాభివృద్ధియందు సదా తోడుపడుచుండునటులు, హేరూరు దంపతులకు చిరాయురారోగ్యములను ప్రసాదించుగాకయని మా ప్రార్థన.

ఇంతకు పూర్వము చెన్నబసవేశ్వరుని వచనముల అనువాద పుస్తకము, సమితి గ్రంధమాలయందలిసష్టమబిల్వమును ప్రకటించుటకు శివశరణి మాతృశ్రీ హరెముత్తమువిరమ్మగారు శ్రీ ఎందగల్ హిరే మఠము

విరూపాక్షయ్యగారి మాతృమూర్తి) ముందుకువచ్చి, ఆ పుస్తకమును తమ ధనసహాయముతో అచ్చువేయించి, ప్రోత్సహించియున్నారు.

మాతృశ్రీ వీరమ్మగారివలె, మరియు సౌ॥ హేరూరు సావిత్రమ్మ గారి వలె, మహిళామణులు పురుషులతో బాటు శరణసాహిత్య ప్రచారమునందు ముందుకువచ్చి, ధనసహాయముతో సహకరించుచుండిన, శరణసాహిత్య ప్రచారము ఆంధ్రప్రదేశమునందు సునాయాసముగా జరుగగలదని విశ్వసించుచున్నాను. ఈ సందర్భమున తాండూరియందలి మిత్రులు కొందరు కూడ మా ఈ సాహిత్యసేవకు సంతసించి భూరి విరాళములతో సహకరించి ప్రోత్సహించినందులకు, వారందరికిని మాశుభా అభివందనలు (విరాళముల నొసంగిన వారి శుభనామములు వేరుగా ప్రకటింపబడినవి)

గ్రంథమాలయందు ఏకాదశబిల్వ ప్రచురణాంతగము ఇంతవరకు సమితి యందు చేరిన సభ్యులపేర్లు కృతజ్ఞతలతో వేరుగా ప్రకటింపబడినవి. ఇతర సోదర సోదరీమణులును, సమితియందు సభ్యులుగా చేరియో, విరాళముల నొసగియో సమితి ఉద్దేశసాధనయందు తోడుపడుచుందురని విశ్వసించుచున్నాను.

చివరకు ఈ పుస్తకమును మిక్కిలి చక్కగా అచ్చొత్తిచ్చిన సర్వశ్రీ నాగలక్ష్మి ఆర్టు ప్రింటర్స్‌వారికి నా కృతజ్ఞతలు తెలుపుచునాను

ఓం శాంతిః శాంతిః

తేది 1-10-1981 — శరణజనవిధేయుడు

4-7-947 ఇసామియాబజారు — ర. మ. వీరభద్రయ్య

(హైదాబాదు — 500027) — సంచాలకులు

# మున్నుడి

తపస్సంపన్నులు, మహావ్యక్తులు అయిన భారతీయ మహాను భావుల పరంపరలో కొందరు మహావనితలు గోచరిస్తారు. మహానుభావు రాండ్రైన ఈ వనితలు తమ ఆరాధ్యదైవములను గూర్చి భక్త్యావేశమున గాన మొనర్చిన పాటలు, తమ అనుభవములను బట్టి జగద్ధిత మేర్పడు నట్లు చెప్పిన సూక్తులు భారతీయ భాషా సారస్వతాలలో ప్రముఖ స్థాన మాక్రమించి ఉన్నవి. వారి పాటలచే, మాటలచే భారతీయ భాషా సార స్వతా కాశాన, అజరామరమైన స్థానమునంది, ధృవతారలై వెలుగొందెడి కొందరు మహావనితలలో తమిళదేశానికి చెందిన అవ్వయ్యార్, రాజస్థా నానికి చెందినమీరాబాయ్, కన్నడదేశానికి చెందిన అక్కమహాదేవి వెంటనే మనస్సునకు స్ఫురిస్తారు.

అక్కమహాదేవి కన్నడ సారస్వత చరిత్రలో క్రీ. శ. 1150 ప్రాంతంనుండి క్రీ. శ. 1400 వరకు విస్తరించివున్న బసవనయుగానికి చెందినది. విశిష్టమైనవ్యక్తిత్వంగల బసవన ప్రచారంతో వీరశైవం కన్నడదేశంలో అత్యున్నతస్థితినందింది. బసవన యొక్క, అతని అను యాయుల యొక్క బోధనలు నాటి సాంఘిక విధానానికొక నూతన రూపకల్పన, దృక్పథము సంతరించినాయి; ధార్మిక సాంఘిక విప్లవానికి దారితీసినాయి; కన్నడదేశంలో, కొంతవరకు ఆంధ్రదేశంలో, ఈధార్మిక సాంఘిక విప్లవప్రభావము మౌలికము, శాశ్వతము, చారిత్రకము అయిన మార్పులను తీసుకవచ్చింది.

మతపరంగా బసవని వీరశైవ సంప్రదాయానికి చెందినది అక్క-మహాదేవి. అక్కమహాదేవి'వచనములు' కన్నడ సారస్వతంలో సుప్రసిద్ధ ములు. "వచనా"లను రచించినస్త్రీలలో ఈమెఅగ్రగణ్యురాలు "వచన" మనేది ఒకసాహిత్య ప్రక్రియ. అటుగద్యము. ఇటు పద్యముగాని భావ గీతాలను "వచనా" లని పిలిచినారు. తెలుగులో కృష్ణమాచార్యుని "సింహ

గిరి వచనములు" సుప్రసిద్ధములు. కన్నడ భాషలో, ఆత్మభక్తి నివేదన కోసం, సామాజిక అన్యాయాల ఖండన కోసం శివకవులు సాధనంగా ఉపయోగించుకొన్న నూత్న సాహిత్యప్రక్రియ వచనం. బసవనియుగంలోనే "వచనా" లను రచించిన మరొక మహిళ ముక్తాయమ్మ. సాంఘిక కట్టుబొట్లను అధిగమించి, దిగంబరియై, తన ఆరాధ్యదైవమైన శ్రీశైల చెన్నమల్లికార్జునునితో భావైక్యం చెందిన అక్కమహాదేవి, ఇట్లే సాంఘిక మర్యాదలను అధిగమించి తన ఆరాధ్యదైవమైన నందనందనునితో భావైక్యం చెందిన మీరాబాయిని స్మరణకు తెస్తుంది.

అక్కమహాదేవి "వచనా" లలో సమాజ విమర్శకంటె ఆత్మవిశ్లేషణ, విమర్శ ఎక్కువ కనిపిస్తుంది. వేదన, నివేదన ఆమె కవిత్వంలోని ప్రధాన గుణాలని చెప్పవచ్చు. ప్రతి "వచనం" ఆమె అంతరంగంలోనుంచి పొంగి పొరలిన భావపయోధార. చిన్నతనంనుంచి తాను భర్తగా భావించుకొన్న శ్రీశైల చెన్నమల్లికార్జునుడే ఆమె వచనాలలో మకుటంగా వెలసినాడు.

కన్నడ సాహిత్యంలో సుప్రసిద్ధమైన అక్కమహాదేవి "వచనా" లను ఈ గ్రంథంలో, రేకళిగెమఠం వీరయ్యగారు చక్కని తెలుగు అనువాదం చేసినారు. వీరి అనువాదం తెలుగునుడికారపు సొంపుతో మనోహరంగా ఉన్నది. వీరయ్యగారు అక్కమహాదేవి జీవిత విశేషాలనుగూర్చి నాటి కాల పరిస్థితులను గూర్చి విమర్శనాత్మకమైన ఉపోద్ఘాతాన్ని రచించినారు. వివిధభాషా సారస్వతముల మధ్య సేతువులని చెప్ప దగ్గ ఇట్టి అనువాదాలు మిక్కిలి వాంఛనీయములు. ఆంధ్రులందరు ఈ గ్రంథమును చదివి ఆనందింపవలెనని కోరుచున్నాను.

నెల్లూరు — 3

బెజవాడ గోపాలరెడ్డి
16-2-83
ఆం. ప్ర. సాహిత్య అకాడమి అధ్యక్షులు

శివాయనమః

# అనువాదకుని విజ్ఞాపన

మహిళా శివ శరణులలో అగ్రగణ్యులగు, అక్కమహాదేవి గురించి, ప్రాచీనకవులు రచించిన కన్నడ తెలుగు కావ్యగ్రంథముల యందు ఆమె ప్రశంస యొనర్చియున్నారు. ఆకృతులను, ఆమె వచనము లను, ఆధారముగాగొని కొందరు ఆధునిక రచయితలు ఆమె చరిత్రను చిత్రించు ప్రయత్నమును చేసియున్నారు. అట్టివారిలో నొకరగు శివశ్రీ మా. నం. నంజప్పగారు (బెంగుళూరు) వ్రాసిన "తత్త్వజ్ఞ శిఖామణి అక్క మహాదేవి" ఆమె చరిత్రను దెలుపు చక్కని పుస్తము. అక్కమహాదేవి వివాహ విషయమునందు అభిప్రాయ భేదమున్నందున, ఆ విషయము తప్ప అక్కమహాదేవి గురించి ఇతర విషయములను తెలుసుకొనుటకు ఆ పుస్తకము మిక్కిలి ఉపకరించును. శ్రీ నంజప్పగారు తమ అభిప్రాయ మును బలపరుచుటకు తెలిపిన కారణములకు నాపరిచయవ్యాసమునందు సమాధానముల తెలుపు ప్రయత్నము చేసియున్నాను. ఆ పుస్తకమును శ్రీమతి పురాణం గిరిజమ్మగారు అనువదించి, మహాదేవి చరిత్రను తెలుసు కొను తెలుగువారికి ఉపకార మొనర్చియున్నారు. ఆ పుస్తకము శివాను భవ గ్రంథమాలయందు తృతీయ బిల్వముగా ప్రకటింపబడినది. గ్రంథ మాల పాఠకులకు విదితమే !

పూజ్యులు లింగానందస్వాములవారు (బెంగుళూరు) "అక్కన ప్రవ చన" మనుపేరుతో అక్కమహాదేవి గురించి వారు చేసిన ప్రవచనములను సమగ్రగ్రంథరూపమున ప్రకటించియున్నారు. అందు ఆమె వచనముల

తోడనే ఆమెచరిత్రను తెలుపు ప్రయత్నము నొనరించియున్నారు. ప్రవచనములందు వారుతెలిపిన సమాజసంస్కరణాత్మకవసరమగు విషయములను గూడ చేర్చియున్నారు. అందు అక్కమహాదేవి వచనములేగాక, విషయప్రతిపాదనకవసరమగు, ఇతర శివశరణుల వచనములనుగూడ చేర్చియున్నారు. అక్కమహాదేవిగురించిగాని, వీరశైవధర్మముగురించిగాని, తెలుసుకొనువారికి ఆ గ్రంథము మిక్కిలి ఉపయుక్తముగా నుండును. ఈ దిశయందు పూజ్యులుస్వాములవారి రచన మిక్కిలి స్తుతింప దగినది

ఈ సందర్భమున , ప్రియమిత్రులు డా. సిద్ధయ్యపురాణికగారు కర్ణాటక భాషయందు రచించిన "శరణ చరితామృతము" ప్రశంసనీయము. అందు వారు అనేకపురాతన, నూతన శివశరణుల చరిత్రలతోపాటు అక్కమహాదేవి చరిత్రనుగూడ తెలిపియున్నారు. శరణులు తమ తమ వచనములందు తెలిపిన తత్త్వజ్ఞానమును వివరముగా తెలిపియున్నారు. వారు గొప్ప మేధావులు. శరణసాహిత్య వేత్తలు. అనేక గ్రంథముల నవలోకించి అత్యంత పరిశ్రమతో వారు వ్రాసిన ఆ గ్రంథము, శరణుల తత్త్వమును, అనుభావజ్ఞానమును తెలుసుకొను వారికి మిక్కిలి వుపకరించును. పురాతన కవి పండితుల సాహిత్యగ్రంథముల నధ్యయనము చేయునోపిక లేనివారికి, వారి గ్రంథము శరణ్యమనవచ్చును. శరణుల చరిత్రలయందలి వివాదాస్పదములగు విషయములందు వారు సాధ్యమగునంతవరకు సామంజస్యమును కలిగించు నిష్పక్షనుగు ప్రయత్నము నేసియున్నారు. ఇది వారి గ్రంథమందలి విశేషము.

శివశరణుల వచనములయందలి ఘనతనుమచ్చునకైనను, ఆంధ్ర సోదరులకు అందజేయదలంచి, బసవేశ్వరుని కొన్ని వచనములను చెన్న బసవేశ్వరుని కొన్నివచనములకు నే నొనరించిన అనువాదపుస్తకములు శివానుభవ గ్రంథమాలయందు ప్రకటింపబడినవి. అటులనే అక్కమహా

దేవి కొన్ని వచనములకు లిం. గైక్యులు అక్కలయ్యదీక్షితులు అనువదించిన పుస్తకమును సర్వశ్రీ మా. నం. శివప్ప సహోదరులు (బెంగుళూరు) 1946లో ప్రకటించియున్నారు, శ్రీయుతులు కలుగోడు అశ్వత్థరావుగారు అక్కమహాదేవి "యోగాంగత్రివిధి"అను త్రిపదిని, ఆమె కొన్నివచనములను అనువదించియున్నారు. ఆ పుస్తకమును, లి. గైక్యుల బి జూ. ి.ప్ప గారి సంపాదకత్వమున 1971 నందు ప్రకటింపబడినది. ఐనను అక్కమహాదేవి వచనములందలి షట్స్థలసిద్ధాంతమును సమగ్రముగ తెలుపవలయునను తలంపుతో ఆమె అన్ని వచనములను అనువదించుటకు ప్రయత్నించి, నా ఈ కించిత్ సేవను, మహాతపస్విని, వీరవిరాగిణి, సాహిత్యనిధి, అక్కమహాదేవి పాదములకు భక్తితో సమర్పించుచున్నాను.

కర్ణాటక విశ్వవిద్యాలయము (ధార్వాడ) నుండి గౌ.డా॥ ఆర్.సి. హిరెమఠ (నివృత్త వైస్‌చాన్సలర్) గారి సంపాదకత్వమున వెలువడిన, 'మహాదేవిఅక్కన వచనగళు' అను పుస్తకము నాధారముగాగొని అందలి ఆమె వచనములను అనువదించితిని. కన్నడవచనములకు అధికృత అనువాదమును జేయునంతటి అర్హత నాకు లేకున్నను "శివశరణుల యందు భక్తి, వచనసాహిత్య ప్రచారమునందు ఆసక్తి" యున్నందున ఈ పనికి బూనుకొను సాహస మొనరించితిని. ఆమెవచనములందలి భావమునునేను తెలుగునందుస్థూలముగా అర్థము చేసుకొనినటుల అనువదించి యున్నాను. నా యనువాదమునందు అర్థవ్యత్యాసముగాని, భావవ్యత్యాసముగాని ఉండుట సహజము. ప్రాజ్ఞులు, అనుభావులు దయతో నాలోపదోషములను తెలిపిన కృతజ్ఞతతో ముందుకు సవరించుకొనియెద.

అక్కమహాదేవి జీవితవిశేషములను ఇదమిత్థమని తెలుపుటకు తాలినన్ని చారిత్రికాధారములు గానరావు. అందుకు ఆమె జీవితవిశేషము

లందు భిన్నాభిప్రాయము లేర్పడినవి. అందు ఆమె వివాహవిషయము ముఖ్యము గౌ. డా. ఆర్. సి. హిరెమఠగారి సంపాదకత్వమున వెలువడిన పుస్తకమునకు వారు వ్రాసిన ప్రస్తావనయందు వారు కనబరిచిన అభిప్రాయము సమంజసముగా నున్నట్లు తోచినది. పూజ్యులు లింగానంద స్వాములవారు "అక్కన ప్రవచన"మందు ఆమెజీవన చరిత్రయందలి ముఖ్య ఘట్టముం గురించి, తెలిపిన అభిప్రాయము మరియు డా. సిద్ధయ్యపురాణిక గారు 'శరణచరితామృత' మందు అక్కమహాదేవి వివాహ విషయము గురించి, తెలిపిన అభిప్రాయము గౌ. డా. హిరెమఠగారి అభిప్రాయముతో దాదాపు ఏకీభవించినట్లు తోచినది. వారందిరి అభిప్రాయములను ఆమె వచనములను ఆధారముగాగొని, "అక్కమహాదేవి గురించి",యను నా పరిచయవ్యాసమునందు ఆమె జీవితమందలి సన్నివేశమును తెలుపు ప్రయత్నమును జేసితిని. నా ప్రయత్నమునందు నే ననుసరించిన అన్ని గ్రంథముల రచయితలకును ప్రకాశకులకును నా సవినయ కృతజ్ఞతలను తెలుపుచున్నాను.

కదళీవనమును మరియు అక్కమహాదేవి బిలమును కనుగొనుటకు సిరిగెరె శివానుభవ ప్రవాస సమితి (అణ్ణన బళగము) వారు పరమ పూజ్యులు తరళబాళు జగద్గురువులు శ్రీ శ్రీ శ్రీ శివకుమార శివాచార్య మహాస్వాములవారి నేతృత్వమున శ్రీ శైలక్షేత్రారణ్యమునందు పరిశోధించి, తమ పరిశోధన ఫలితాంశములను 'వరది' రూపమున ప్రకటించి యాత్రికులకు మహోపకార మొనర్చియున్నారు. నా పరిచయ వ్యాసమునందు, కదళీవనము సంశోధనము, అను శీర్షిక క్రింద నేను వివరించిన వివరములకు ఆ వరదిని ఆధారముగా గొనినందు నకును,ఆ సందర్భమున వారు తీసిన వివిధ దృశ్యముల ఛాయాచిత్రములను దయతో పంపినందుకును పరమ పూజ్య తరళబాళు జగద్గురువులవారి సన్నిధియందు నా

సాష్టాంగ ప్రణామములను విన్నవించుచున్నాను మరియు ప్రవాససమితి (అణ్ణనబళగము) వారికి కృతజ్ఞతాపూర్వక శరణుల తెలపుచున్నాను.

ఈ పుస్తక ప్రకటనగురించి ఆర్థిక సహాయమును గోరుచు నేను చేసిన మనవినిమన్నించి, ఆంధ్ర ప్రదేశ సాహిత్య అకాడమి వారు దయతో రెండువేల రూపాయల విరాళమునొసగి నన్ను మా శివానుభవ సమితిని ప్రోత్సహించినందున సాహిత్య అకాడమివారికిని మరియు అకాడమి అధికారవర్గమువారికిని, నా పరముగను, మా శివానుభవసమితి పరముగను కృతజ్ఞతా పూర్వక. వందనములను విన్నవించుచున్నాను. ముందుకును వచనసాహిత్య ప్రచారమునందు వారు మా సమితికి తోడు పడుచుందురని విశ్వసించుచున్నాను. అకాడమివారి ఈ భూరి విరాళము వలన, ప్రభావితులై ఇతర దాతలును, ఉదారముతో విరాళములనొసంగి తోడుపడినందున. ఈ గ్రంథమును ప్రకటించుట సుసాధ్యముకాగలిగిన దనిన సత్యదూరముగాదు.

ఈ పుస్తము కొంత పెద్దదైనను శివానుభవ సమితివారు శ్రమ వహించి తమ గ్రంథమాలయందు ద్వాదశ బిల్వముగా ప్రకటించి ప్రోత్స హించినందున, వారికి నా హృదయ పూర్వక శరణుల తెలుసుచున్నాను.

పూజ్యమూర్తి రేకళిగె మఠం సిద్ధయ్య గారు, వారిమేనల్లుడు(మత్ పితృమూర్తి ) బసవయ్యగారి, తండ్రి శివైక్యమొందిన తదుపరి, వారిని తమ వద్దనుంచుకొని పెంచి ప్రబుద్ధులనొనరించి యుండిరి. సిద్ధయ్యగారు సంతానములేనందున, నన్నుదత్తపుత్రునిగా స్వీకరించి, పోషించి వివాహ మొనర్చిరి. కాని నా దురదృష్టవశాత్తున వారును అచిరకాలముననే శివై క్యమైరి. తమ జీవిత కాలమునందు, వారు అచరించుచుండిన ఆచార నియమముల గుర్తుకొంతయున్నందున, నాకును గురుజంగమముల యెడల

భక్తి, బసవాది శివశరణుల యెడల శ్రద్ధ అలవడినది. వారిపోషణయందు నాకు కలిగిన సంస్కారపరిణామమే, నన్ను వచన సాహిత్యానువాదమునకు ప్రోత్సహించుచున్నది. సాహిత్య రూపమున నేజేయుచున్న ఈ శరణసేవయే పరవాసమందున్న నాకు, మనశ్శాంతిని కలుగజేయుచున్నది. ఆ పరిణామ సంస్మరణ చిహ్నముగా, వారిచిత్రమును ఈ పుస్తకమునందు చేర్చి, వారికి నాశ్రద్ధాంజలిని, భక్త్యంజలిని తెలిపియున్నాను. ఇది మా స్వంత విషయమైనను, శివానుభవసమితి ప్రచురణయందు మావారి చిత్రములను చేర్చుటకు అంగీకరించినందులకు సమితి సంచాలకులకు నా కృతజ్ఞతా పూర్వక శరణులను తెలుపుచున్నాను.

చివరకు ఈ పుస్తకమును అచ్చువేసిన సర్వశ్రీ నాగలక్ష్మి ఆర్టు ప్రింటర్సు వారి సహకారమును స్మరించకుండిన నావిజ్ఞాపన అసంపూర్ణముగా నుండును ముఖ్యముగా ప్రెస్సు యజమానులు శివశ్రీ నందూరు చిదంబరరావుగారు నా వ్రాతప్రతి సవరణలతో కొంతచిక్కుగానున్నను, శ్రద్ధతో ప్రూఫులను సరిదిద్ది చక్కగా, అచ్చువేసి ఇచ్చినందుకు వారికిని వారికర్మచారులకును నా కృతజ్ఞతలను తెలుపుచున్నాను.

దుర్మతి-భాద్రపద,
శుద్ధ ౧౦ బుధవారము

శరణ చరణ ధూళి
రేకళిగె మఠం వీరయ్య

# అభివాదనము

వీరయోగిని అక్కమహాదేవి చరిత్రను మొదట తెలుగులో తెల్పిన మహాకవి పిడుపర్తిసోమనాథుడు. ఇతడు క్రి. శ. 1550 ప్రాంతము వాడు. చామరసను కన్నడకవి 2౦ సద్గతుల ప్రభులింగలీల యను అల్లమ ప్రభుని చరిత్రమును వ్రాయగా సోమనాథుడు పంచమాశ్వాసపరి మితముగా నా కన్నడకావ్యమును తెలుగులోనికి ద్విపద రూపమున తెచ్చి నాడు.[1] అందు అక్కమహాదేవి పార్వతీదేవి సాత్త్విక కళగా భూతలమున నవతరించినదని శివుడు పార్వతికి తెల్పు సందర్భమున వివరింపబడెను.

---

[1]ప్రభులింగలీల; పిడుపర్తిసోమనాథుడు. పరిష్కర్త శివశ్రీ బండారు తమ్మయ, ప్రకాశకురాలు శ్రీమతి చుక్కాకోటి వీరభద్రమ్మ, వల్లూరిపాలెం. ముద్రణ శ్రీపతిముద్రణాలయము కాకినాడ. 1963.

అక్కమహాదేవి చరిత్రమును బాలపాపాంబ యను కవయిత్రి యక్షగానముగా కూర్చినది దీనికి 'అక్కమహాదేవి బోధోల్లాసము' అను మరియొక పేరుకలదు. బాలపాపాంబ అష్టయోగాది విద్యాప్రవీణుడగు వీరవసంత వసుమతీశునకు ప్రథమపుత్రిక. ఈమె గ్రంథాంతమున మంగళహారతులను గూడా వ్రాసినది. వివరములకు చూడుడు "విస్మృత కవయిత్రి బాలపాపాంబ" ఆంధ్రమహిళ. అక్టోబరు 1954 వ్యాసకర్త నిడదవోలు వేంకటరావు.

తలిదండ్రులామెకు:—

కలికంఠుకామిని కళ గాన బడగ
తెలివ కిడిరి మహాదేవి యన్పేరు" (పుట 70).

మహాదేవి యనగా పార్వతి. వేరొకచోట ఈ మహాదేవి యను సమాసమును పిడుపర్తి సోమనాథుడు కథాసందర్భమున కనుకూలముగా కౌశికుడనెడి జైనరాజు దేవుల (రాణుల) కగ్రదేవిగా సమన్వయము చేసి యున్నాడు.

అంగ, కళింగ, వంగావంతి, మగధ
బంగాళ చోళ భూపాల పుత్రికలు
దేవులు రాజుకు దేవులకగ్ర
దేవివివగు మహాదేవి నామంబు
సార్థంబుగాగనీసకల సంపదలును (పుట77).

o o o

కౌశికుడు అక్కమహాదేవిచే నాకర్షితుడై తన కొలువులోని హెగ్గడి కత్తెలను మహాదేవి తలిదండ్రుల నివాసమునకంపి అక్కమహాదేవిని తనకు నిమ్మని కోరవలసినదని వారికి ఆజ్ఞాపించెను. దీనిని బట్టి అక్కమహాదేవి పార్వతీదేవి సాత్త్విక కళగా భూలోకమున నవతరించినదని, మహాదేవుని భార్య పార్వతి నామమునే "మహాదేవి" గా ప్రఖ్యాతి చెందినదవి స్పష్టము.

ఈమె కర్ణాటకములోని "ఉడుతడి" గ్రామమునకు చెందినదని పిడుపర్తికవి చెప్పుటయే కాక ఆతనికి 200 సంవత్సరముల ముందున్న పాల్కురికి సోమనాథుడు "ఉడుతడి మహాదేవి" యని పండితారాధ్య

చరిత్ర మహిమ ప్రకరణములో (పుట 88 1969 ఎడిషన్) పేర్కొని నాడు. ఉడుతడి శివమొగ్గ (షిమోగా) జిల్లాయందలి బల్లిగామ పవిత్ర స్థలమునకు నాలుగైదు మైళ్ళ దూరమున నున్నది.

ఉడుతడిని 12వ శతాబ్ది కాలమున కౌశికుడను జైనుడు గ్రామాధి కారిగా పాలించుచుండెను. కవులాతనిని మహారాజుగా చిత్రించియున్నారు అదే కాలమున కర్ణాటక కల్యాణ నగరమున బసవేశ్వరుని వీరశైవ శరణుల ధార్మిక బోధనలతో మారుమ్రోగు చుండెడిది. చెన్నబసవన్న, మడివాలు మాచయ్య, సిద్ధరామయ్య, తెలుగు జొమ్మయ మొదలగు అనన్య వీరశైవ భక్తాగ్రేసరులు బసవని మాహాత్మ్యమును కొనియాడుచుండెడివారు. శూన్యవాద సిద్ధమహాపురుషుడు గుహ్యేశలింగ అపరావతారుడు, నిరంతర యోగవంతుడు, వేదాంతవేద్యుండయిన అల్లమప్రభువు కల్యాణమున కొచ్చి బసవేశ మహిమల కొనియాడి శూన్య సింహాసనమధిష్ఠించెను.

జైనుడయిన కౌశికుడు ఆజన్మవీరశైవాచార సరణి జీవించు మహా దేవిని చూచి ఆమెను వివాహమాడ సంకల్పించెను. భవులతో పొత్తు పరమ పాతకము గావున మహాదేవి కౌశికుని వివాహమాడుటకు నిచ్చగిం చలేదు.

కౌశికుడంపిన హెగ్గడి కత్తెల రాయబారపు వాక్యములువిని, రాజుకోర్కెను తిరస్కరించినచో తనతలిదండ్రులకు ప్రమాదమొచ్చు నని వెరగుపడి, మనసులోనొక వ్యూహమును పన్ని కౌశికుని తనయిం టికి తోడితెమ్మని వారితో చెప్పగా వారు బిరాన నేగి యారాజును మహా దేవి ముందు బెట్టిరి. తనకోరిక చెల్లించెదనని మాటపట్టు ఇచ్చినచో అన్ని యు సమకూరుననియు, ఆమాటతప్పిననాడు తాను అంతఃపురమును విడిచి పోవుదుననియు కౌశికునితో మహాదేవి చెప్పగా నాతడు వల్లెయని

"మచ్చిక వలపించి మరికాని కూడనని" వాగ్దాన మొనర్చెను. అంత మహాదేవి కౌశికుని ముందుగా ననిపి పిదప తాను కౌశికుని యాగారమునకు బయలు వెడలెను. అట్లువచ్చిన మహాదేవికి అంతఃపురకాంతలు రాణివలె గౌరవమర్యాదలు జరిపి శృంగారవతిగాజేసిరి. శృంగారవతియైన మహాదేవికి కౌశికుడు కబురంపగా నామెవచ్చినది. కామాతురుడైన రాజు "రా మహాదేవి! చేరగళయ్యమీదికి" అని ఆమెను బట్టవచ్చెను. వెంటనే మహాదేవి తనకిచ్చినమాట చెల్లింపవలెనని చెప్పి, తనవలెశివభక్తి నడిపి ఏలుకొమ్మని కోరెను. కౌశికుదద్దానికి నిరాకరించెను. మహాదేవి భూషణాంబరములు డిగవిడిచి "అలకలుచీరగా నంగంబు గప్పి" (ప్ర లీ.పుట 80), "కరమున లింగంబు గట్టిగా పట్టి" వెడలి పోయెను.

ఈ విధముగా నిష్కల్మషశీలముతో, దృఢశివభక్తితో మహాదేవి వెడలిపోగా, ఆమెకు వివాహమయ్యెననియు, ఆమెయొంటిపై నన్న చీరను కౌశికుడు లాగుకొనెననియు అక్కమహాదేవి రగళియందు హరిహరుడు వ్రాసెను ఇది అసమంజసమని ప్రస్తుత అనువాదకులు శ్రీ వీరయ్యగారు తిరుగులేని ఉపయుక్తులతో ఖండించి అక్కమహాదేవి అవివాహితయని, వీరయోగినియని, నిరూపించియున్నారు. భక్తపరవశలై పరమాత్మనే తమ సర్వస్వముగా నమ్మిన మీరాబాయి మొదలయినవారి సచ్చరిత్రలను శ్రీ వీరయ్యగారు జోడించి హరిహరుడాపాదించినఅపకీర్తి పంకమును క్షాళనమొనర్చిరి.

ఇందుకొక ప్రబల నిదర్శనము గలదు ఇది శివ శ్రీ వీరయ్యగారివాదములను మరింత పరిపుష్ట మొనర్చును. కౌశికుని విడనాడి విరాగిణియై వెడలిపోవుచున్న మహాదేవిని తలిదండ్రులు చూచి ఆమెతో నిట్లనిరి.

నల్లవో ! మహాదేవి ! నలినాయ తాక్షి
సన్నుత వైరాగ్యసంపద మెఱసి
కన్నెర్క మింతయు గడమ కాకుండ
మావంశమున బుట్టి మలహరు భర్త
గావించుకొనగ భాగ్యము కాదె మాకు॥

(ప్ర. లీ. పు. 81)

దీనినిబట్టి రాజాంతఃపురమునుండి బయటికి వచ్చినఅక్కమహాదేవి శీలము స్వచ్ఛమై పవిత్రమై బల్పారినదని, ఈ సందర్భమున శ్రీ వీరయ్య గారు వ్రాసిన వాక్యములు పరమ ప్రామాణికములని చెప్పవచ్చును. పాల్కురికి సోమనాథుడు పండితారాధ్యచరిత్ర యందలి గురుభక్తాండారి కథలో అక్కమహాదేవి పురుష విరక్తయనియే వ్రాసినారు.

"తన్ను
గాదేవి నిది యాదిగా మగవారి
నాడట విల్వనేనని బాసపల్క
తక్కము నీ విప్డతి మహాదేవి
యక్కబోలెను విషయ భ్రాంతులొండె"

అని పురాతన ప్రకరణమున స్పష్ట పరిచియే యున్నాడు.

o o o

అక్కమహాదేవి "దిగంబర" యయ్యేనని వాడుకలోనున్నది. ఆ దిగంబరత్వము ఆమె నగ్న మూర్తిగా యయ్యేనేమోయని కొందరి తలపులో నుండవచ్చును. అది సరియైన దృక్పథము గాదు. ఆమెకు

నిడిపాటి కురులు కలవు. కురులతోనే దేహమంతయు కప్పుకొనినది. కావున ప్రభు లింగ లీలలో, "అలకలు చీరగా నంగంబు గప్పి'' (పుట 80) అని వ్రాయబడియున్నది.

అల్లమప్రభుని యాజ్ఞచే నామె కళ్యాణనగరమునుండి శ్రీశైల క్షేత్రమందలి కదళీ వనమునకరుదెంచినది. ఆమె శ్రీశైలమునకు వచ్చుటకు ముందో, లేదా ఆమె అచ్చట నివసించు కాలముననో ఆంధ్ర దేశములోని కొన్ని క్షేత్రములను దర్శించినట్లు ఈ క్రింది వచనము తెల్పుచున్నది.

"పృథ్విని గెలిచిన ఏలేశ్వరుని గంటి
భావభ్రమల గెలిచిన బ్రహ్మేశ్వరుని గంటి
సత్వ రజస్తమ త్రిగుణముల
గెలిచిన త్రిపురాంతకుని గంటి
అంతరంగమందలి ఆత్మజ్ఞానమువలన
జ్యోతి సిద్ధయ్యను గంటి''

ఇందు ఏలేశ్వరము కృష్ణానదీతీరమున నున్నది. ఇది ఇక్ష్వాకుల కాలమునుండి ప్రసిద్ధినొందిన పుణ్యక్షేత్రము. బ్రహ్మేశ్వరుడనగా మహబూబ్‌నగర మండలములోని అలంపురమున వెలసిన బ్రహ్మేశ్వర లింగము. ఇక్కడ నవ బ్రహ్మల ఆలయములు గలవు. త్రిపురాంతకము కర్నూలు జిల్లాలోని శైవక్షేత్రము. శ్రీశైలమునకు తూర్పువాకిలి జ్యోతి సిద్ధయ్యకడప జిల్లాయందలి సిద్ధవట జ్యోతి నాథుడు.

## అనువాదము

శ్రీ వీరయ్య గారికి ముందు లింగైక్యులు శ్రీ అక్కులయ్య దీక్షి

తులు శ్రీకలుగోడు అశ్వర్థ రావుగారును నాంధ్రీకరించిరి. పైఅనువాదములు ప్రసిద్ధములయినవే గాని అవి సంపూర్ణానువాదములుకావు. శ్రీ వీరయ్యగారిదే మొదటి సంపూర్ణానువాదమని చెప్పవచ్చును.

అనువాదమొక్కొక్క పట్టున మూలగ్రంథమేమో యన్నట్లు దలపించును. ఈ క్రిందివచనములు దయచేసి పరికింపుడు.

"చదువ చదువ వేదములు వాదములు దెచ్చె,
వినగ వినగ శాస్త్రములు సందేహమును దెచ్చె,
తెలిసె తెలిసె నని ఆగమము సగమై పోయె,
పూరించితి పూరించితి నని పురాణము,
పూర్యము దారికే పోయె,
నేనెక్కడ, తానెక్కడ,
బ్రహ్మ శూన్యము చెన్న మల్లికార్జునా (165 వచన)

వేదశాస్త్రాగమ పురాణము లెల్లను
వడ్లను దంచిన నూక తౌడు గనుడోయి,
వీనిని మరల దంచుటెందులకు,?
చెరుగుటెందులకు?
అటు ఇటు పారుమనుసును నిలపగలిగిన
అంత బట్టబయలు చెన్న మల్లికార్జునా!

శ్రీ రేకళిగె మఠం వీరయ్యగారు శుద్ధాంతః కరణతో పని చేయువారు. వృద్ధులయ్యును వారికి జరాభారమనునది లేదు. శివశరణుల ననుగూర్చి తెలుగువారికి తెలుపుటయందు వారు బద్ధవ్రతులై యున్నారు.

వారనేక శైవ గ్రంథములను హైదరాబాదు శివానుభవ గ్రంధమాల ద్వారా ప్రచురించి యున్నారు.

వారి శైలి తెలుగున నిండుదనము సంపాదించు కున్నది. ఏ యే తావులనెట్లు వ్రాసినచో రంజకముగా నుండునో వారికి బాగుగాతెలి యును. శ్రీ వీరయ్యగారి వచనానువాదము ప్రసన్నముగా, మూల విధేయముగా, నున్నది. లోగడ వెలసిన అనువాధముల కంటె మేల్తరముగా నున్నదనుటలో సందేహము లేదు. శివాను గ్రమమున వారి కృషినిరంతము కాన సాగుగాక !

ఇతిశివమ్

సంక్రాంతి
14-1-82
1-2-1137/5
న్యూనల్లకుంట
హైదరాబాద్-44

పరిశోధనపరమేశ్వర
కళాప్రపూర్ణ
నిడుదవోలు వెంకటరావు

**Dr. B. RAMA RAJU**
Professor
Department of Telugu

University College of Arts
Osmania University
Hyderabad.

కన్నడ సాహిత్యక్షేత్రమున భక్తితరువులకు జ్ఞానఫలములు పుష్కలముగా పండినవి. వానిని వచనములందురు. ఆపంటనంత సమృద్ధిగా పండించినవారు శివశరణులను మహాభక్తులు. వారిలో కారణజన్ములు బసవేశ్వరుడు, చెన్నబసవేశ్వరుడు, అల్లమప్రభువు, అక్కమహాదేవి మొదలగు మహానుభావులు. ఆ వచనఫలముల పరిమళమాధుర్యములకు పరమశివునికే నోరూరినది. శివార్పితమైన తత్ప్రసాదము నారగించిన కన్నడిగలు అమృతాంధసులు. ఆ యమృతమిప్పుడిప్పుడే పొరుగున నున్న తెలుగువారికిగూడా లభించుచున్నది. ఇది తెలుగు కన్నడభాషల సౌదర్యమునకు ఫలితము. డాక్టరు బాదాలరామయ్యగారి మూలముగా బసవేశ్వరుని వచనములు తెలుగువారికందినవి. ఇప్పుడు రేకళిగె మఠం వీరయ్యగారు అక్కమహాదేవి వచనములనువదించి మనకృతజ్ఞతకు పాత్రులైనారు.

అక్కమహాదేవి కన్నడిగల ఆడుబిడ్డ; తెలుగు వారికోడలు కన్నడ దేశమందలి శివమొగ్గజిల్లాలోని ఉడుతడి ఆమెపుట్టినిల్లు. ఆంధ్రదేశమందలి కందనోలు మండలము శ్రీశైల కదళీవనము ఆమె మెట్టినిల్లు. సుమతీ నిర్మలు లామెను గన్నపుణ్యాత్ములు; చెన్నమల్లికార్జున దేవుడు ఆమెను లోగొన్న యనాథనాథుడు. శతాబ్దములు కడచినను ఆమె కాపురమిల్లు కదళీవన మీనాటికి పచ్చపచ్చగా కళకళ లాడుచుండుట శ్రీశైల ప్రాంతారణ్య భూములలోని

భక్తిచేవ. ఉత్తరభారతమున గిరిధరనాగరుని ప్రేమించి దివ్యగీతము లాలపించి యాతనిలో లీనమైపోయిన మీరాబాయివలెనే, చెన్న మల్లికార్జునుని యందు రక్తికలిగి, రక్తిని భక్తిగా, భక్తిని భావముగా, భావమును మహాభావముగా మలచుకొని, ఆ పరమశివు ననుభావుని జేసికొని ఆయనలో లీనమై పోయి కడకు శివునియాభరణముగా మిగిలిపోయిన అక్కమహాదేవి చరిత్రమద్భుతము. ఆమెయనుభవ కవిత్వమంతకంటే నద్భుతము. పరిమళము సెడని, పరువముదప్పని, జగదేకమనోహరమైన అక్కమహాదేవి యనుభావప్రసూనములను తెలుగు విరిసరముగాకూర్చుటే గాక వీరయ్య గారు తమ పీఠికలో ఆయమ్మ పుట్టువుమొదలు కదలీవనములో శివైక్యమైన పర్యంతము సమస్తవిషయములతో చక్కని చారిత్రిక భూమిక సంతరించినారు.

అక్కమహాదేవి జీవితమారాధ్యమై, శీలమాదర్శమై, ఉపదేశము మంత్రమై, రక్తిసిగపూవై, భక్తిసందె దీపమై, వచనము నిర్వచనమై, తెలుగిండ్లు మనవలెనని కోరుచు, తెలుగువారికి యమృతము నా మెతవెట్టిన వీరయ్యగారి నభినందించుచున్నాను.

బి. రామరాజు
29-1-1982

# ఆ వా హ న

కవిత్వానికి ఆయువు పట్టు ఆవేశం. ఎద నిండిన భావావేశం కవిత్రీకరించబడి ఎన్నో ఎదల్ని కదిలిస్తుంది. తన శాశ్వతమైన ముద్రల్ని వేస్తుంది. అలాగే వీరశైవ వచనాలు కూడ ఆవేశ ప్రధానాలు.

వచనం కేవలం ఆధునిక మని చాలా మంది ఆధుని కాంధ్ర విమర్శకులు అభిప్రాయ పడుతున్నారు. అయితే "యజుర్వేదం" ఒక చక్కని వచన కవితా సమాహారం. దక్షిణాదిన "కృష్ణ యజుర్వేదం" వ్యాప్తిలో ఉంది. దీనిలో ఉండే పనసాలు అన్నీ వచనాల వంటివే. అందులోనూ క్లుప్తత ప్రధాన గుణంగా గల ఈ పనసాలు ఈ నాటి మినీ వచనాలను పోలి ఉన్నాయ్. అలాగే వీరశైవ శరణుల వచనాలు ఈనాటి అధునాతన కవితా ప్రక్రియగా వ్యవహరింప బడుతున్న "మినీకవిత"లకు మాతృకలనడానికి వీలున్నది. 12-16వ శతాబ్దాల నడుమ దక్షిణాదిన ఈ వీర శైవ వచనాలు అనేకంగా వెలువడి జనం నోళ్లలో గూళ్లు కట్టుకున్నాయ్. అయితే అందులో కన్నడ వచనాలు మాత్రమే లభ్యం కాగా తెలుగు వచనాలు కొన్ని చారిత్రిక కారణాల వల్ల అంతరించి పోయాయ్. అందుకే తెలుగు సారస్వతంలో ఉన్న ఈ లోటును పూర్తి చేయడానిగ్గాను శ్రీ రేకళిగె మఠం వీరయ్యగారు ఇప్పటికే "బసవేశ్వరుని వచనాలు" "చెన్న బసవేశ్వరుని వచనాలు" "వీర శైవ మహిళా శివశరణులు" అను గ్రంథాలను ప్రకటించి ఉన్నారు. అలాగే అక్క మహాదేవి వచనాలను ఆంధ్రీకరించి ఉద్రేకాన్ని పరాకాష్ఠనందించి వీర శైవ వచన వాఙ్మయ విస్తృతికి పూనుకోవడం ముదావహం.

కవిత్వం సుదీర్ఘమై, పాండితీ ప్రకర్షలకు లోనై ప్రజలకు దూరమైన వ్యవస్థను తొలగించి సరళ సుందరమైన సంక్షిప్త ప్రజా వచనాలను పలికించిన వారు వీర శైవ వచన కర్తలు. అందులోనూ అక్క మహాదేవికి ఒక విలక్షణమైన, విశిష్టమైన స్థానముంది. అందుకే చెన్న బసవేశ్వరుడు.

"ఆద్యుల అరవై వచనములకన్న
దండనాయకుని ఇరవై వచనములు
దండనాయకుని ఇరవై వచనములకన్న
ప్రభు దేవుని పదివచనములు
ప్రభు దేవుని పది వచనములకన్న
అజగన్నగారి ఆయిదు వచనములు
అజగన్నగారి అయిదు వచనములకన్న
కూడల చెన్న సంగయ్యయందు
మహాదేవి అక్కగారి ఒక్క వచనము
నిర్వచనము చూచితివా —సిద్ధరామన్నా"

అని కీర్తించాడు.

కాబట్టి ఆ చారిత్రిక దశల్లో మతాన్ని కవితా మయం చేశారా కవి కుమారులు. ఈనాటి సామాజిక చైతన్య రూపం రాజకీయంకాబట్టి ఆ ఎమోషన్ని, ఆ ఉద్వేగాన్ని సమకాలీన సాంఘిక జీవితానికి, రాజకీయాలకు ఉద్యమాలకు అన్వయిస్తే ప్రతిభావంతమైన మినీ వచనాలు వెలువడే అవకాశముంటుంది.

ఉదాహరణకి. . . .

''అంగ లింగ దొళగాయిత్తు మనలింగవ వేదిసి
మన లింగ దొళగాయిత్తు భావలింగవ వేదిసి
భావలింగ దొళగాయిత్తు చెన్న మల్లికార్జునా!
నిమ్మ ఒళుమెయ సంగ దల్లిద్దు స్వయ లింగవాయిత్తు"

అనే శైవ వచనాన్ని ప్రేరణగా తీసుకొని ప్రతిభావంతులైన ఆధునిక కవికుమారులు.

"విప్లవ కారుల్ని జైల్లో పెడతావా?
విప్లవ కావ్యాలనై అక్షర వృష్టిని కురిపిస్తాను
విప్లవ కావ్యాల్ని నిషేధించి వేస్తావా??
విప్లవ గీతాలనై ఆకలి డొక్కల్లో ప్రతిధ్వనిస్తాను
విప్లవ గీతాల గొంతు నులిమి వేస్తావా???
నేనే విప్లవాన్నై పోతాను"

వంటి మినీ వచనాలను విరబూయించే అవకాశముంది. ఆ ఉద్రేకం, ఆ ఆవేశం, ఆ సృజనాత్మక కవితా శక్తినే సమకాలీన జీవితానికి అన్వయిస్తే ఆవేశ ప్రధానమైన కవితా ఖండికలెన్నో పురుడు పోసుకుంటాయ్.

అన్యభాషా సాహిత్యాల ఆంధ్రీకరణం మన భాషను సుసంపన్నం చేయడానికి తప్పకుండా దోహదం చేస్తుంది. ఈ మార్గంలో శ్రీ వీరయ్యగారి ఈ అనువాదమొక మైలురాయి కావాలని కాంక్షిస్తున్నాను.

ఎస్వీ సత్యనారాయణ,
ఎం, ఏ., ఎం. ఫిల్,
తెలుగు ఉపన్యాసకులు,
డా. అంబేద్కర్ కళాశాల హైద్రాబాద్.

ఎస్వీ
27-2-1982

# ಎರಡು ಮಾತು

ಒಂದು ಭಾಷೆಯಿಂದು ಮತ್ತೊಂದು ಭಾಷೆಗೆ ಅನುವಾದ ಮಾಡು ವುದು ಅಷ್ಟೊಂದು ಸುಲಭವಾದ ಕೆಲಸವಲ್ಲ. ಉಭಯ ಭಾಷೆಗಳಮೇಲೂ ಸಾಕಷ್ಟು ಪ್ರಭುತ್ವ ವಿದ್ದರೇನೇ ಅನುವಾದವು ರಮ್ಯವೆನಿಸುವುದು, ಇದು ಪ್ರಪಂಚದ ಎಲ್ಲ ಭಾಷಾಂತರ ಕಾರರಿಗೂ ಅನ್ವಯಿಸುವ ಸೂತ್ರ.

ಹೈದರಾಬಾದು ನಗರ ಹಲವಾರು ಭಾಷೆ. ಸಂಸ್ಕೃತಿಗಳ ಕೂಪಲಿ. ಇಲ್ಲಿಯೇ ಬಹುಕಾಲದಿಂದಲೂ ಬಾಳಿ ಬದುಕಿದ ಶ್ರೀ ರೇಕಳಿಗೆ ಮಠಂ ವೀರಯ್ಯನವರು ಕನ್ನಡ, ತೆಲುಗು, ಉರುದು ಭಾಷೆಗಳನ್ನು ಚೆನ್ನಾಗಿಬಲ್ಲರು ಬಸವಣ್ಣನವರೆಂದರೆ ಅವರಿಗೆ ಭಕ್ತಿ ಹೆಚ್ಚು. ಕನ್ನಡದಲ್ಲಿದ್ದ ಶಿವಶರಣರ ಕಥೆಗಳನ್ನು, ವಚನಗಳನ್ನು ತೆಲುಗಿಗೆ ತರ್ಜುಮೆಮಾಡಿ, ಶಿವಶರಣರ ಸಂಸ್ಕೃತಿ ಯನ್ನು, ವಚನ ಸೌರಭವನ್ನು ತೆಲುಗಿನ ಜನರಿಗೆ ತಿಳಿಯಪಡಿಸ ಬೇಕೆಂಬುದು ಶ್ರೀ ವೀರಯ್ಯನವರ ಮಹತ್ವಾಕಾಂಕ್ಷೆ. ಆದ್ದರಿಂದಲೇ ಅವರು 1941 ರಲ್ಲಿ ಮೊಟ್ಟ ಮೊದಲನೆಯಸಲ ಬಸವಣ್ಣನವರ ವಚನಗಳಲ್ಲಿ 108ನ್ನು ಆಯ್ದು ತೆಲುಗಿಗೆ ಅನುವಾದ ಮಾಡಿ, ಪುಸ್ತಕರೂಪದಲ್ಲಿ ಹೊರ ತಂದರು. ಅಂದಿನಿಂದ ಇಂದಿನವರೆಗೂ ಅನುವಾದದಲ್ಲಿ ಅವರ ಕೃಷಿ. ಎಡೆ ಬಿಡದೆ ನಡೆದಿದೆ. 'ಇಷ್ಟಲಿಂಗ ವಿಜ್ಞಾನಮು' "ವೀರಶೈವ ಮಹಿಳಾ ಶಿವಶರಣುಲು" ಎಂಬ ಕೃತಿಗಳು ಇವರವೇ. ಕನ್ನಡದಿಂದ ತೆಲುಗಿಗೆ ಬಂದಿವೆ. ಇದೀಗ ಹೊರ ಬಂದಿರುವ ಈ ಕೃತಿ —"ಅಕ್ಕ ಮಹಾದೇವಿ ವಚನಮುಲು"- ವಿಶೇಷವಾದ ಶ್ರದ್ಧೆಯ ಪ್ರತೀಕವೆನ್ನಬಹುದು. ಅಕ್ಕನ ವಚನಗಳನ್ನು ಮೊದಲು ಓದಿ ಅರಗಿಸಿಕೊಳ್ಳುವುದೇ ಕಷ್ಟವಾಗಿರುವಾಗ, ಅವುಗಳ ಮೂಲಾರ್ಥಕ್ಕೆ ಬಾಧೆ ಬಾರದ ರೀತಿಯಲ್ಲಿ, ಶ್ರೀ ವೀರಯ್ಯನವರು ಸೊಗಸಾದ ರೀತಿಯಲ್ಲಿ ತೆಲು-ಗಿಗೆ ಅನುವಾದ ಮಾಡಿರುವುದು ಅವರ ಪರಿಣತಿಯನ್ನು ಎತ್ತಿ ತೋರಿಸುತ್ತದೆ ಮೇಲಾಗಿ ಕನ್ನಡದಲ್ಲಿ ಅಕ್ಕನ ಬಗ್ಗೆ ಬಂದ ಹಲವಾರು ಗ್ರಂಥಗಳನ್ನು ಪರಿ ಶೀಲಿಸಿ, ತೆಲುಗಿನಲ್ಲಿ ತಮ್ಮದೇ ಆದ ಶೈಲಿಯಲ್ಲಿ ಬರೆದ ಪೀಠಿಕೆಯನ್ನು ಓದಿದರೆ ಅವರ ಆಳವಾದ ಪಾಂಡಿತ್ಯದ ಪರಿಚಯವಾಗುವುದರಲ್ಲಿ ಸಂಶಯ ವಿಲ್ಲ. ವೀರಯ್ಯನವರದು ಆಡಂಬರದ ಸ್ವಭಾವವಲ್ಲ, ಸದ್ದಿಲ್ಲದೆ ಕೆಲಸ ಮಾಡುತ್ತಾರೆ. ಕನ್ನಡದ ಸೊಬಗನ್ನು ತೆಲುಗಿನವರಿಗೆ ತಿಳಿಯಪಡಿಸುತ್ತಿದ್ದಾರೆ.

ಮಹಾದೇವಿಯಕ್ಕನ ವಚನಗಳು ಅಮೋಘ. ಅವುಗಳಲ್ಲಿನ ಅಭಿವ್ಯಕ್ತಿ ಅತ್ಯಂತ ಮನೋಹರ. ಆ ವಚನಗಳಿಂದಲೆ ಅಕ್ಕನ ಜೀವನವನ್ನರಿಯುವುದು ಸುಲಭ. ಆದಿಯಿಂದಲೂ ಚೆನ್ನಮಲ್ಲಿಕಾರ್ಜುನನ್ನೇ ಗಂಡನನ್ನಾಗಿ ವರಿಸಿದ ಅಕ್ಕನ ಬಾಳಿನಲ್ಲಿ ವೈವಾಹಿಕ ಜೀವನ ಮಿಥ್ಯ ಎಂದು ಹಲವರವಾದ. ಅದನ್ನೆ ಎತ್ತಿ ಹಿಡಿದಿದ್ದಾರೆ ಶ್ರೀ ವೀರಯ್ಯನವರು. ಅದಕ್ಕೆ ತಕ್ಕ ಉತ್ತರವನ್ನು ಅಕ್ಕನ ವಚನಗಳಿಂದಲೆ ಎತ್ತಿನೀಡಿದ್ದಾರೆ. ಮಹಾದೇವಿಯಕ್ಕನ ವಚನಗಳನ್ನು ಆಮೂಲಾಗ್ರವಾಗಿ ಅಧ್ಯಯನ ಮಾಡಿದ ಯಾರಿಗಾದರೂ ಆಕೆ ಚೆನ್ನಮಲ್ಲಿಕಾರ್ಜುನನ್ನಲ್ಲದೆ, 'ಸಾವಕೆಡುವ ಗಂಡರ' ಕೂಡಲಿಲ್ಲವೆಂಬುದು ವೇದ್ಯವಾಗದಿರದು ಇಂಥ ಉದಾತ್ತ ವ್ಯಕ್ತಿತ್ವದ ನಾರೀಶಿರೋರತ್ನವೆನಿಸಿದ ಶಿವಶರಣೆ ಅಕ್ಕ ಮಹಾದೇವಿಯ ವಚನಗಳನ್ನು ಅರ್ಥಾಭಿವ್ಯಕ್ತಿಗೆ ಭಂಗ ಬಾರದಂತೆ ಶ್ರೀ ವೀರಯ್ಯನವರು ಸುಂದರವಾಗಿ ತೆಲುಗಿಗೆ ಅನುವಾದಮಾಡಿದ್ದಾರೆ.

ಅವರಿಂದ ಇಂಥ ಅನೇಕ ಉತ್ತಮ ಕೃತಿರತ್ನಗಳು ಕನ್ನಡದಿಂದ ಇನ್ನಷ್ಟು ತೆಲುಗಿಗೆ ಬರಲಿ. ಪರಶಿವನು ಅವರಿಗೆ ಆಯುರಾರೋಗ್ಯ ಐಶ್ವರ್ಯವನ್ನು ಕರುಣಿಸಲಿ ಎಂದು ಹಾರೈಸುವೆ.

ಕನ್ನಡ ಪ್ರಾಧ್ಯಾಪಕ,
ಉಸ್ಮಾನಿಯಾ ವಿಶ್ವವಿದ್ಯಾಲಯದ
ಮಹಿಳಾ ಕಲಾ ಶಾಲೆ,
ಹೈದರಾಬಾದು. 1.

—ಎಂ. ಎಸ್. ಮಹಾಂತಯ್ಯ
26-2-1982

---

## ಅಭಿಪ್ರಾಯ

ತೆಲುಗು ನಾಡಿನ ವೀರಶೈವ ನಾಡಸೇವಕರಲ್ಲಿ, ಸಾಹಿತ್ಯ-ಸಂಸ್ಕೃತಿಗಾಗಿ ತಮ್ಮನ್ನು ಅರ್ಪಿಸಿಕೊಂಡವರಲ್ಲಿ ಶಿವಶ್ರೀ ರೇಕಳಿಗೆ ಮಠದ ವೀರಯ್ಯನವರ ಹೆಸರು ಈಚೀಚೆಗ ಬೆಳಕಿಗೆ ಬರುತ್ತಿದೆ. ಹಿಂದಿನ ತಲೆಮಾರಿನಲ್ಲಿ ಹೆಸರಾಂತಿದ್ದ "ವಿಭೂತಿ" ಮಾಸಿಕದ ಸಂಪಾದಕರಾಗಿದ್ದ ಲಿಂಗೈಕ್ಯ ಚಿದರೆಮಠದ ವೀರಭದ್ರಶರ್ಮ (ಕಾಶಿಯ ವಿಶ್ವಾರಾಧ್ಯ ಪೀಠಾಧ್ಯಕ್ಷರು) ರು ವಿಮರ್ಶಾಗ್ರೇಸರ ಲಿಂಗೈಕ್ಯ ಬಂಡಾರು ತಮ್ಮಯ್ಯನವರು ಮತ್ತು

ವಿಮರ್ಶ ವಿಶಾರದಾ ಲಿಂ. ಅಕ್ಕುಲಯ್ಯ ದೀಕ್ಷಿತರ ತರುವಾಯ ಶ್ರೀ ರೇಕಳಿಗೆ ಯವರು ವೀರಶೈವ ಸಾಹಿತ್ಯದ ಹೊಲಬಿನಲ್ಲಿ ಗಣನೀಯವಾಗಿ ದುಡಿಯುಕ್ತಿರುವುದು ಸಂತೋಷದ ಸಂಗತಿ. ತೆಲುಗುನಾಡಿನ ರಾಜಧಾನಿ ಹೈದರಾಬಾದಿನಲ್ಲಿರುವ "ಶಿವಾನುಭವ ಸಮಿತಿ" ಯ ಸಕ್ರಿಯ ಸದಸ್ಯರಾದ ಶ್ರೀ ರೇಕಳಿಗೆಯವರು ಪ್ರಕಾಶಪಡಿಸುತ್ತಿರುವ, "ಇಷ್ಟಲಿಂಗ ವಿಜ್ಞಾನ" ವೀರಶೈವ ಮಹಿಳಾ ಶಿವಶರಣುಲು ಮುಂತಾದ ಗ್ರಂಥಗಳು ಇದಕ್ಕೆ ಜೀವಂತ ನಿದರ್ಶನಗಳು ಮಹಾದೇವಿ ಅಕ್ಕನ ವಚನಗಳನ್ನು ಮೊದಲು ಲಿಂ. ಪ. ಗು. ಹಳಕಟ್ಟಿಯ ೧೯೨೬, ೧೯೭೧ ಇಸವಿಗಳಲ್ಲಿ ಪ್ರಕಟಿಸಿದರು. ಆ ತರುವಾಯ ಪೂಜ್ಯರಾದ ಡಾ॥ ಜ. ಚ. ನಿ. ಯವರು, ಲಿಂ. ಜೆ. ಹೆಚ್. ಎಂ. ಸದಾಶಿವಯ್ಯನವರು (೧೯೬೦) ತೆಲುಗಿನಲ್ಲಿ, ಲಿಂ. ಅಕ್ಕುಲಯ್ಯ ದೀಕ್ಷಿತರು, ಅನಂತರ ಕರ್ನಾಟಕ ವಿಶ್ವವಿದ್ಯಾನಿಲಯದ ಡಾ॥ ಆರ್. ಸಿ. ಹಿರೇಮಠದವರಿಂದ ಪರಿಷ್ಕೃತವಾಗಿ ಅವು ಪ್ರಕಟಗೊಂಡಿವೆ. ಪ್ರಕೃತ ಶ್ರೀ ರೇಕಳಿಗೆಯವರು ಕರ್ನಾಟಕ ವಿಶ್ವ ವಿದ್ಯಾಲಯದ ಸಂಸ್ಕರಣವನ್ನೇ ತಮ್ಮ ಕೃತಿಗೆ ಆಧಾರವಾಗಿ ಸ್ವೀಕರಿಸಿರುವುದಾಗಿ ತಿಳಿದುಬಂದಿದೆ.

'ಅಕ್ಕ ಮಹಾದೇವಿ ವಚನಮುಲು' ಎಂಬ ಈ ಸಂಸ್ಕರಣದಲ್ಲಿ ಸುಮಾರು ೩೪೧ ವಚನಗಳು ತೆಲುಗಿಗೆ ಭಾಷಾಂತರಗೊಂಡಿವೆ. ವಚನಗಳ ತೆನುಗುಭಾಷೆ ಸರಳ ಮತ್ತು ಸುಂದರ ಶೈಲಿ, ಹೃದಯಂಗಮವಾಗಿದೆ. ಸಾಮಾನ್ಯ ಓದುಗನು ಅಕ್ಕನ ಹೃದಯದ ಆಶಯವನ್ನು ಸುಲಭವಾಗಿ ಎಟುಕಿಸಿ ಕೊಳ್ಳುವನೆಂಬ ಧೃಡ ವಿಶ್ವಾಸನನಗಿದೆ.

ಶಿವಶರಣರ ಕಾಲದಲ್ಲಿಯೇ ಮಹಾ ವಿದ್ವಾಂಸರೂ, ಅನುಭಾವಿಗಳೂ ಆದ ಚನ್ನಬಸವಣ್ಣನವರು ಈ ವಚನಗಳಿಗೆ ಶಿವಶರಣರ ವಚನಗಳನ್ನು ಒರೆ ಹಚ್ಚಿ, ಅವುಗಳಲ್ಲಿ ಅಕ್ಕನವಚನಗಳಿಗೆ. ಮಹಾದೇವಿ ಅಕ್ಕಗಳ ಒಂದು ವಚನ ನಿರ್ವಚನ' ವೆಂಬ ಪ್ರಶಸ್ತಿಯನ್ನು ನೀಡಿದ್ದಾರೆ.

ಎಂದಮೇಲೆ ಇಂಥ ವಚನಗಳ ಭಾಷಾಂತರ ಅಷ್ಟು ಸುಲಭದ ಮಾತಲ್ಲ ಆದರೂ ಶ್ರೀಯುತ ವೀರಯ್ಯನವರು ಅವುಗಳನ್ನು ಶ್ರಮ ವಹಿಸಿ ಸರಳಗೊಳಿಸಲು ಪ್ರಯತ್ನಿಸಿದ್ದಾರೆ. ಈ ದಿಸೆಯಲ್ಲಿ ಡಾ॥ ಬಾಡಾಲ ರಾಮಯ್ಯ

ನವರ " ಬಸವೇಶ್ವರ ವಚನಾಲು " ಬೃಹತ್ ಸಮೀಕ್ಷೆಯೊಡನೆ ಆಂಧ್ರ ಜಗತ್ತಿಗೆ ನೀಡಿದ ಒಂದು ಕೊಡುಗೆ. ಇವರಂತೆ ಚನ್ನಬಸವ, ಸಿದ್ಧರಾಮ. ಮತ್ತು ಅಲ್ಲಮ ಪ್ರಭುದೇವರ ವಚನಗಳು ಆಂಧ್ರೀಕರಿಸುವ ಹಾದಿಯಲ್ಲಿ ಶ್ರೀ ರೇಕಳಿಗೆ ಯವರ ಕೃತಿ. ನಿಲ್ಲತಕ್ಕದ್ದು.

ಈ ವಚನಗಳಿಗೆ "ಅಕ್ಕಮಹಾದೇವಿ ಗುರಿಂಚಿ" ಎಂಬ ಶಿರ್ಷಿಕೆಯಲ್ಲಿ ಬರೆದಿರುವ ಪ್ರಸ್ತಾವನೆ ವಿಚಾರ ಸರಿಪೂರ್ಣಕವಾಗಿದೆ. ಇಲ್ಲಿ ಬರುವ ಪೂರ್ವ ವಿಷಯ, ಜನನ. ಬಾಲ್ಯ ಯವ್ವನ, ಕೌಶಿಕುನಿ ಕನ್ಯ, ರಾಜಭವನಮುನಂದು ಮಹಾದೇವಿ, ಕಲ್ಯಾಣ ಪ್ರಯಾಣಮು, ಅನುಭವ ಮಂಟಪ ಪ್ರವೇಶಮು, ಪರೀಕ್ಷ, ಪ್ರಭು-ಮಹಾದೇವಿ ಸಂವಾದಮು, ವೀಡ್ಕೋಲು, ವಂದನ ಸಮರ್ಪಣಮು, ಕದಳೀವನ ಯಾತ್ರ ಮುಂತಾದ ಶೀರ್ಷಿಕೆಗಳು, ಅಕ್ಕನ ಉಜ್ವಲ ಜೀವನ ಘಟನೆಗಳನ್ನು ಉಲ್ಲೇಖಿಸಿವೆಯಲ್ಲದೆ "ಅಕ್ಕ ಮಹಾದೇವಿ ಅವಿವಾಹಿತೆಯೇ?" ಮುಖ್ಯ ಆಕ್ಷೇಪ ಸಮಾಧಾನಮುಲು ಎಂಬ ಶೀರ್ಷಿಕೆ. ಈ ದಿಸೆಯಲ್ಲಿ ಶ್ರೀಯುತರ ಶಿಲವನ್ನು ನಿರ್ದೇಶಿಸುತ್ತದೆ. ಮುಂದೆ ಅಕ್ಕನನ್ನು ಮೀರಾಬಾಯಿ. ಹೇಮರಡ್ಡಿ ಮಲ್ಲಮ್ಮರಿಗೆ ಹೋಲಿಸಿರುವುದು ಅಗತ್ಯವೆನಿಸಿದರೂ, ಆಧುನಿಕ ಮಾತಾ ಮಹಾದೇವಿಯನ್ನು ಅಕ್ಕನಿಗೆ ಹೋಲಿಸುವಲ್ಲಿ ಶ್ರೀ ರೇಕಳಿಗೆಯವರು ದುಡಿಕಿದರೆನ್ನದೆ ವಿಧಿಯಿಲ್ಲ. ಏಕೆಂದರೆ ಮಾತಾ ಮಹಾದೇವಿಯು ಈ ಹೋಲಿಕೆ ಎಷ್ಟು ಮಾತ್ರವೂ ಸಂಗತವೆನಿಸದು. ಕಾರಣಗಳು ಅಪ್ರಕೃತ ಶಿವಶರಣರ ದೃಷ್ಟಿಯಲ್ಲಿ ಆಚಾರವೇ ಸ್ವರ್ಗ. ಆಚಾರ, ನೀತಿಯ ನೆಲಗಟ್ಟಿನಮೇಲೆ ಕಟ್ಟಿದ ಒಂದು ಮಹಾಸೌಧ. ಈ ದಿಸೆಯಲ್ಲಿ ಶ್ರೀ ಲಿಂಗಾನಂದ ಮತ್ತು ಈ ಮಾತೇ? ಯ ಸಂಬಂಧ ವಾದಾತೀತವೆನಿಸಿಲ್ಲ. ಮೇಲಾಗಿ ಅಹಂಕಾರ, ಮಮಕಾರ ಭೂಯಿಷ್ಟವಾದ ಈಕೆಯ ಮಹತ್ವಾಕಾಂಕ್ಷೆ ಸ್ವಯಂ ಘೋಷಿತ ಮಹಿಳಾ ಜಗದ್ಗುರುತ್ವದಲ್ಲಿ ಹಾರಾಡುತ್ತಿದೆ. ವೇಷಭೂಷಣಗಳಲ್ಲಂತೂ ವೀರಾಗಿಣಿಯಾದ ಅಕ್ಕನಿಗೆ ಕೊಡುವ ಹೋಲಿಕೆ ಪಾಪಹೇತು! ಅಷ್ಟೇ ಅಲ್ಲದೆ " ವೀರಶೈವವು ಬಸವಪ್ರೋಕ್ತ" ಬಸವನಿಗೆ ಗುರುವೇ ಇಲ್ಲ! ಬುದ್ಧ ಕ್ರಿಸ್ತರಂತೆ ಆತ ಸ್ವಯಂ ವಿಚಾರ 'ಎಂಬ ಈ ತಾಯಿಯ ಉವಾಚಗಳು' ವೀರಶೈವವು ವೇದಾಗಮೋಪನಿಷತ್ ಸಮ್ಮತವಲ್ಲ! ಮುಂತಾದ ಆಕೆಯ ಅಪ ಸಿದ್ಧಾಂತಗಳು "ಕಲ್ಯಾಣ ಕಿರಣ" ಮತ್ತು "ಮಾಮಿಡಿ" ಪತ್ರಿಕೆಗಳಲ್ಲಿ ಬೆಳ್ಳಬೆಳಗಾಗಿ ಸ್ಪಷ್ಟ ಪಡಿಸುತ್ತಿರುವುದನ್ನು ಅರಿಯದ ಶ್ರೀ ವೀರಯ್ಯ

ನವರು ಇನ್ನೂ ಕೆಲವುದಿನ ತಡೆದು ಈ ಶೀರ್ಷಿಕೆಗೆ ಬರೆಯಬಹುದಾಗಿತ್ತೆಂಬುದು ನನ್ನ ಭಾವನೆ. ಇನ್ನೂ ಇಲ್ಲಿ ಕೊಟ್ಟಿರುವ "ಯಾನೆಗುಂದಿ ಮಾಣಿಕ್ಯ ಯೋಗಿನಿಯ ಜೊತೆಗೆ, ಲಿಂ. ಸಜ್ಜಲಗುಡ್ಡದ ಶರಣಮ್ಮನನ್ನು ಸೇರಿಸುವುದಗತ್ಯ" ವಿತ್ತೆಂದು ಭಾವಿಸುವೆ.

ಅಕ್ಕನ ಸಾಹಿತ್ಯ ಪ್ರತಿಭೆ, ಸ್ತ್ರೀ ಸಮಾಜ ಮತ್ತು ವೀರಶೈವ ತತ್ವಗಳನ್ನು ನಿರೂಪಿಸಿದ ತರುವಾಯ ಶ್ರೀಯುತರು ಅಕ್ಕನ ಅನಂತರ, ಕದಳೀವನ ಸಂಶೋಧನ ಮತ್ತು ಅದರ ಅಸ್ತಿತ್ವಗಳ ಬಗೆಗೆ ಶ್ರೀಶೈಲ ಸ್ಥಲಪುರಾಣ ಕರ್ತೃ ಶ್ರೀಪೋತುಕುಚ್ಚಿ ಸುಬ್ರಮಣ್ಯಶಾಸ್ತ್ರಿ ಎಂಬುವರು ಪೂರ್ವ ಗ್ರಹ ಪೀಡಿತರಾಗಿ ಬರೆದಿರುವ ಅನೇಕ ವಿಚಾರಗಳು ಶ್ರೀಶೈಲ ವಾಸ್ತವ ಇತಿಹಾಸವನ್ನು ಹೇಗೆ ಮರೆಮಾಚಿವೆ ಎಂಬುದನ್ನು ಸಪ್ರಮಾಣವಾಗಿ ನಿರೂಪಿಸಿ, ಇತಿಹಾಸ ಪ್ರಪಂಚಕ್ಕೆ ಮಹೋಪಕಾರ ಮಾಡಿದ್ದಾರೆ. ಮತ್ತು ಶ್ರೀಶೈಲ ಕ್ಷೇತ್ರ ಪರಿಪಾಲಕ ಸಮಿತಿ ಈ ದಿಸೆಯಲ್ಲಿ ಸಂಶೋಧನೆ ನಡೆಸಿ. ನಿರ್ದುಷ್ಟವಾದ ಶ್ರೀಶೈಲ ಸ್ಥಲಪುರಾಣವನ್ನು ಅಮತ್ಸರ ಮತಿಗಳಿಂದ ಮತ್ತೆ ಬರೆಯಿಸಿ ಪ್ರಕಟಿಸುವ ದಿಸೆಯಲ್ಲಿ ಶ್ರೀಯುತರ ಈ ರಚನೆ ಫಲಪ್ರದವಾಗಲೆಂದು ಭಾವಿಸುತ್ತೇನೆ.

ಮೈಸೂರು.
ದಿ. ೧೦-೭-೧೯೬೨.

ಇಂತು
ಎಂ. ಜಿ. ನಂಜುಂಡಾರಾಧ್ಯ

# కృతజ్ఞతలు

గౌరవనీయులు, డా. బెజవాడ గోపాలరెడ్డిగారు, (ఉత్తరప్రదేశ మాజీగవర్నరు గారు) ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమినుండి, ఈపుస్తక ప్రచురణ గురించి. రెండువేలరూపాయల ఆర్థికసహాయము నిచ్చుట యేగాక, అమూల్యమగు తమ మున్నుడివలన, నా ఈకృతికి సాహిత్యపు విలువను కూడపెంచి ప్రోత్సాహించియున్నారు. వారికి నాకృతజ్ఞతా పూర్వక వందనములను విన్నవించుచున్నాను.

కళాప్రపూర్ణులు, వయోజ్ఞానవృద్ధులు, శైవసాహిత్యవేత్తలు, శివశ్రీ నిడదవోలు వెంకటరావుగారు, అత్యంత ఉత్సాహముతో, "అక్క మహాదేవిగురించి" అను నా పరిచయవ్యాసమునువిని, సంతసించి "అభి వాదన" యందు విపులమగు అభిప్రాయమును తెలిపి నన్నుత్సాహపరచి యున్నారు. వారికి నాహృదయపూర్వకవందనములు తెలుపుచున్నాను.

ఉస్మానియావిశ్వవిద్యాలయ తెలుగుభాషాచార్యులు డా. బి రామ రాజుగారు అత్యంతాదరముతో, నా అనువాదపుస్తకమును ఆమూలాగ్ర ముగచదివి, విద్వత్పూర్ణ మగు తమఅభిప్రాయమునొసగి, నన్నుత్తేజపరి చియున్నారు. వారికి నాకృతజ్ఞతాపూర్వక నమస్కృతులతెలుపుచు న్నాను. వారుఇంతకుమొదలు 'వీరశైవమహిళా శివశరణులు' అను నా రచనను కూడా ప్రశంసించిప్రోత్సహించి యున్నారు.

తరుణమిత్రులు శ్రీ యస్వి. సత్యనారాయణగారు, (అంబేడ్కర్ కాలేజి తెలుగు లెక్చరరుగారు,) తమ "ఆవాహన" యందు శివశరణుల వచనములందలి ఉత్తేజనము, ఉద్వేగములను, ఆధునిక కవితలందుపయో

గించుచు జనులను త్తేజపరచు అవకాశముగలదని తెలిపినారు. మచ్చునకు, అక్కమహాదేవియొక్కవచనమునందలి, ఆవేదనను, తమకవితయందు తెలిపినారు. ఇతరభాషల సాహిత్యమును మనభాష యందు అనువదించుట, మనభాష అభివృద్ధికి కారణమగుననుచు, నా కృషిని ప్రోత్సహించి యున్నారు. వారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలను తెలుపుచున్నాను.

ఆత్మీయులు, శివశ్రీ యం. యస్ మహాంతయ్యగారు (కన్నడ ప్రాధ్యాపకులు ఉస్మానియా విశ్వవిద్యాలయ మహిళాకళాశాల) నాయనువాదమును, కన్నడమూలవచనములతో పోల్చి, తమ "ఎరడుమాతు" నందుప్రశంసించి యున్నారు. నా పూర్వకృతులనుకొన్నింటిని కూడ ప్రశంసించి ప్రోత్సహించియున్నారు. వారికి నా కృతజ్ఞత పూర్వక వందనములనందజేయుచున్నాను.

ఆదరణీయులు, ఆస్థానవిద్వాన్ శివశ్రీ యం. జి. నంజుండారాధ్యులవారు, మైసూరు, నా ఈపుస్తకమునకు తమయభిప్రాయమును, వ్రాయుచు నా'కించిత్' సేవను "ఘనముగ" ప్రశంసించియున్నారు. అందుకు వారికినాయందుగల అభిమానమే కారణము. నేనంతటియోగ్యుడ, గానని సవినయముగా తెలుపుచున్నాను. వారికి నాకృతజ్ఞతాపూర్వక వందనముల నందజేయుచున్నాను.

నా పరిచయవ్యాసమునందు, పూజ్యమాతామహాదేవి ప్రశంసను కొంతచేర్చియున్నాను. ఆరాధ్యులవారు నేనావిషయమును చేర్చుటయందు తొందరపడ్డానని సెలవిచ్చినారు. మాతాజీగురించిన వారిఅభిప్రాయము, ఏకపక్షీయముగానున్నట్లు, వారిశైలివలన తెలియుచున్నది. నేనావిషయమును, ఏతొందరపాటులేకయే చేర్చినానని సవినయముగా తెలుపు

చున్నాను. నేను చేర్చిన ఆవిషయము మూడుకారణముల వలనఅయోగ్య మనివారు తెలిపినారు

వారుతెలిపిన మూడుకారణములలోని ఒకదానిగురించి ఆలోచించు టగాని, వ్రాయుటగాని అనుచితము-అవాంఛనీయము. అట్టిఅపనిందలు ఈనాడేగాదు, ఆనాడును ఉండెను. మరిఏనాడైనను అవి ఉండునని ఆరాధ్యులవారు గ్రహించవలసిన విషయము. అట్టి ద్వేషభూయిష్టమగు వార్తలను నమ్మి, ఏవ్యక్తినైనా విమర్శించడము అసంభావ్య మని వారికి విన్నవించుచున్నాను.

ఇక యితర రెండుకారణములోన నొకటి ఏనాటినుండియో వివా దాస్పదముగానున్నది. అది పురాతనసమస్యయే! అందులో మాతాజీ చేసిన క్రొత్తదనమేమియులేదు మాతాజీయే గాదు, ఆధునిక విద్వాంసులు, విమర్శకులు, అనేకులు ఆవాదననే బలపరుచుచున్నారు. కనుక ఆవాదన ఆమెనునిరసించుటకు కారణము కాగూడదని నాయభిప్రాయము. ఇకమూ డవకారణము ఇప్పుడది సర్వసాధారణమైనది పురాతనకాలమునుండి వచ్చుచున్నవనుకొను జగద్గురు పంచాచార్యులపంచపీఠముల తోబాటు పన్నెండవశతాబ్దము తర్వాత విరక్తజగద్గురు పీఠములు నాలుగు బయలు దేరినవి. ఆ అయిదు ఈ నాలుగుగాక, ఇప్పుడింకెన్నియో జగద్గురు పీఠ ములు బయలుదేరినట్లు తెలియుచున్నది. అందులోమాతాజీ పీఠముగూడ నొకటి అనుకున్న గొప్పతప్పేమియుగాదు! మీదుమిక్కిలి ఆదిమహిళా జగద్గురు పీఠమగుట మరీవిశేషమే! వీరశైవధర్మమునందు స్త్రీపురుషులకు ధార్మికముగా సమానాధికారములున్నవని ఘోషించియు, స్త్రీజగద్గురు పీఠములేనికొరతను, మాతాజీతీర్చినారు. అందుకువారు అభినందనీయులే కాని, వారునిందార్హులు కాకూడదని నా భావము. ఏవ్యక్తినైనను వరబట్టి

చూచుటకు 'వరగల్లు' అసూయతో కూడినదిగాని, ఏకపక్షమునకు చేరినది గాని గాకూడదని నా మనవి.

శివశ్రీ మహాంతయ్య గారు మరియు, శివశ్రీ నంజుండారాధ్యులవారు తమ అభిప్రాయములను, కన్నడముతో వ్రాసిపంపినారు. హైద్రాబాద నందు కన్నడ ప్రింటింగు లేదని తెలిపినందున మిత్రులు, ఆత్మీయులు, శ్రీ బసవరాజు గారు తమ జగదీశ్వర ప్రెస్, తాండూరునందు, వానిని అచ్చువేసి ఇచ్చి మహోపకారమొనర్చినారు. వారికి నా కృతజ్ఞతాపూర్వక వందనములను తెలుపుచున్నాను.

అనువాదకుడు

# విషయ సూచిక

# సమర్పణ



ఇష్టలింగనిష్ఠయందున్న
మహాతపస్విని వీరవిరాగిణి సాహిత్యనిధి
అక్కమహాదేవిగారి
శ్రీపాద పద్మములకు భక్తితో

# ప్రశంస

ఆద్యుల అరువై వచనములకన్న
    దండనాయకుని ఇరువై వచనములు
దండనాయకుని ఇరువై వచనముల కన్న
    ప్రభుదేవుని పది వచనములు
ప్రభుదేవుని పది వచనముల కన్న,
    అజగన్నగారి ఐదు వచనములు
అజగన్నగారి ఐదు వచనముల కన్న
    కూడల చెన్న సంగయ్యయందు
మహాదేవి అక్కగారి యొక్క వచనము నిర్వచనము
    చూచితివా, సిద్ధరామన్నా.

—చెన్నబసవన్న

శివాయనమః

# అక్కమహాదేవి గురించి

"అంగగుణమునాస్తియై లింగసంగియైనది.
మనోగుణమునాస్తియైజ్ఞానసంగి యైనది.
భావగుణము నాస్తియై మహాప్రభుతానైనది.
నేనునీవను భేదముడిగి మా గుహేశ్వరలింగమందు
స్వయంలింగమైన మహాదేవిఅక్క
నిలువునకు శరణనుచుంటిని"

—ప్రభుదేవుడు

"అవనిలో గోముఖవ్యాఘ్రుంబులట్లు
గవిసిపట్టంగవచ్చు కామాదిరిపుల
నవలీలగ గెలిచి నిజాంతరంగంబు
శివలింగమూర్తికిఁ జేకూర్చినట్టి
అక్కమహాదేవియమ్మ! సద్భక్తిఁ
జక్కగాఁ జేయుదు శరణార్థిమీకు"

—పిడుపర్తి సోమనాథుడు

## పూర్వ విషయము

పన్నెండవ శతాబ్దము నందు కన్నడ దేశమున ఉద్భవించిన శివశరణులు తమ తమ అనుభావ వచనముల వలన కన్నడ భాషను పునీత మొనరించిరి. దేశమునందు అలము కొని యున్న ధార్మిక సామాజిక, నైతిక, ఆర్థిక, అసమానతలను తొలగించిరి.

సర్వసహోదర భావములుగల నవసమాజమును సృష్టించిరి. నేడును వారు మనకు మార్గ దర్శకులుగా నుండు నట్లు చరించి పోయిరి. వారి జీవితాంశములు సుప్రసిద్ధములు, వారు కన్నడ నాడునకే గాక, యావద్భారతమునకును, ప్రపంచమునకును, మార్గదర్శకులై మానవ జాతికే మహోపకారమొనరించిరి.

ఆ శివశరణుల యందలి ప్రముఖులలో బసవేశ్వరుడు, చెన్నబసవేశ్వరుడు, ప్రభుదేవుడు, అక్కమహాదేవి అగ్రగణ్యులు. అందును అక్కమహాదేవి అనుభవజ్ఞానము సర్వసంగ పరిత్యాగము మిన్నయై యుండెను. ఆనాటి శివశరణులందరును కీర్తికాములు గాక సత్యశుద్ధ కాయకములతో దాసోహభావముతో తమ తమ జీవనమును గడుపుచుండిరి. తమ జీవన దినచర్యలనుగాని, స్వీయ చరిత్రలను గాని వ్రాయు తలంపు వారికి గలుగలేదు. ఐనను బసవేశ్వరుడు చెన్నబసవేశ్వరుడు ప్రభుదేవుడు, అక్కమహాదేవి మొదలగు ప్రముఖ శివశరణుల గురించి, హరిహరుడు, చామరసు, సిద్ధవీరణార్యుడు, విరూపాక్షపండితుడు, చెన్నబసవాంకుడు, పాలకురికి సోమనాథుడు పిడుపర్తికవులు మొదలగు పండితులు సంస్కృతాంధ్ర, కర్ణాటక భాషలలో పురాణములను కావ్యములను వ్రాసి వారలగురించిన అనేక సంగతులను లోకమునకు తెలిపిరి. ఈకావ్య కర్తలు ఇతిహాస దృష్టితో గాక భక్తిభావముతో తమ తమకావ్యనాయకుల కథలను ఒకరినొకరు అనుసరింపక స్వతంత్రించి రచించిరి. అనేక శివశరణుల జన్మస్థలము, కాలము, తల్లిదండ్రుల, పేరులు, వివాహము మొదలగు విషయములలో పరస్పర భిన్నాభిప్రాయములు గలిగినవి.

వివాదాస్పదములగు అంశములను వదలిన శివశరణుల జీవనముల యందలి మార్పులను, ముఖ్యఘట్టములను తెలుసుకొనుటకు వారొనరించిన

సంస్కరణలు, వారు వచించిన అనుభావ వచనములు, ముఖ్య ప్రమాణములుగా గ్రహింప వచ్చును. అటులనే అక్కమహాదేవి జీవనవిశేషములను తెలుసు కొనుటకును కూడ, ఆమె వచనముల రచనలు, ఆమె గురించి ఇతర శివశరణులు వచించిన వచనములే ముఖ్య ప్రమాణములుగా గ్రహింప వచ్చును.

## జననము బాల్యము

అక్కమహాదేవి గురించి వ్రాసిన పూర్వకవులలో అధికులు ఆమె జన్మస్థలము కర్ణాటకప్రాంతమందలి శివమొగ్గా జిల్లాలోని బళ్ళిగామ సమీప మందున్న ఉడుతడి యనియు, ఆమె తల్లిదండ్రులు సుమతి నిర్మలశెట్టి యనియు తెలిపి యున్నారు. ఆ పేరులనే నేను సమంజసములని గ్రహించుచున్నాను. మహాదేవి తల్లిదండ్రులు వీరశైవులగుట వలన తమ ఆచారప్రకారము, వారు అక్కమహాదేవి పుట్టగానే ఆమెకు లింగధారణ యొనరించి విభూతి రుద్రాక్ష ధారణలు జేసిరి. బాల్యదశ యందు ఆమెకు వారు శ్రీగురువుచే, దీక్షాసంస్కారమును పంచాక్షరి మహామంత్రోప దేశమును జేయించిరి. బాల్యము నుండియే ఆమె ఆభూషణముల యందు అత్యంత తేజస్వినిగా కనుపించుచుండెను. శైశవ దశగడిచి యౌవ్వన దశకురాగానే ఆమెయందు భౌతికసుఖము పైనను భోగలాలసపైనను కోరిక సన్నగిల్లెను. ప్రపంచనాదుల పూసుకొనక విభూతిని ధరించు కొనుచు, రత్నమౌక్తిక హారములను వేసుకొనక రుద్రాక్ష మాలాధా రిణియై, చావుబ్రతుకుల నరుల గోరక భవహరుండగు చెన్నమల్లి కార్జునుడే తనకు భర్తయను దృఢ సంకల్పముతో రేయింబవళ్లు శివచింత నమునందె కాలము గడుపుచుండెను. "శరణసతి-లింగపతి" అను వీరశైవతత్త్వ మునుసరించి తనకు చెన్నమల్లి కార్జునుడే భర్తయని తలంచుచు వివాహ ప్రసంగము వచ్చినప్పుడెల్ల తనకు చెన్నమల్లి కార్జు

నుదే భర్తయని, అతి సంబరముతో తెలుపు చుండెను. తోడిబాలికలు, ఇరుగు పొరుగు వారలు ఆమె మాటలను పిల్లల మాటలని తలంచినను, ఆమె తల్లిదండ్రులుమాత్ర మట్లుతలంచక ఆమె మానవతీత వ్యక్తియు యగు శివశరణురాలు కాగల సూచనలు గలవని తలంచి లోలోన సంతృప్తి చెందుచుండిరి.

## యౌవనదశ—కౌశికునికన్ను

మహాదేవి చిరుతవయస్సునందే ఆదర్శప్రాయమగు జీవనమును గడుపు చుండెను. ఆమె కర్ణాటక సంస్కృత భాషలను ఆగమశాస్త్రములను పురాతనుల వచనవాఙ్మయమును అధ్యయనముచేయుచు పాండిత్యమున అనుభావమును, గడించుచుండెను. యౌవనదశకు రాగానే ఆమె రూపలావణ్యమునకుతోడుగ ఆమెయందుభక్తిభావము లింగనిష్ఠ పెంపొందుచువచ్చెను. ఆమె లేజవ్వనమందున్నప్పుడు, ఒకనాడు అపట్టణపురాజు, కౌశికుడు, వాహ్యాళి,నుండి తిరిగివచ్చు నప్పుడు, పురజనులందరు రాజదర్శనమునకై తమతమ మేడలపైనెక్కి చూచుచుండిరి. మహదేవియు తన సఖియల కోరికపైతమమేడపైనెక్కి జనసమ్మోహమును చూచుచుండెను. కౌశికరాజు తన కృతజ్ఞతా సూచకముగ పురజనులనందరిని పారజూచెను. ఆసమయమందు తనమేడపై నిలుచుండిన మహాదేవిని కౌశికుడు గాంచి, ఆమెరూపలావణ్యమును జూచి, మోహితుండై తన అంతఃపురమునకు బోయి ఆసుందరాంగి యెవరనునది తెలుసుకొని, ఆమె తనను పెండ్లియాడునట్లు ఒప్పించుమని పరిచారికలను పురోహితులను పంపెను. కానిలాభము లేక పోయెను. కౌశికుండంతటితో ఆగక,నయమునగాకున్న ఆమెకు ఆమె తల్లితండ్రులకు భయమునుజూపినైనను, ఆమె తనకు స్వాధీన మగునట్లు జేయుమని తనమంత్రిని పంపెను.

అతి చతురుండగు ఆ మంత్రివరుడు మహాదేవితల్లిదండ్రులకు సిరిసంపదల ఆశనుజూపి, "మహాదేవిని మారాజునకుకిచ్చి మహారాణిగా జేయు"డని, ప్రోత్సహించెను కానివారు మహాదేవి లింగనిష్టను వైరాగ్య ప్రవృత్తినెరింగిన వారగుటచే,అది సాధ్యముగాదనిరి. మంత్రిమీకుమార్తెను మారాజున కప్పగింపకున్న అతడుమీకు చిత్రవధను విధించియున్నాడు. గావున, మీరుపట్టును విడిచి మీపట్టిని మారాజు కప్పగింపుండనెను. వారందుకును జంకకుండుటనుజూచి, మంత్రి తానే మహాదేవిదగ్గరకువెళ్లి "కౌశికమహరాజు నీకు పాదాక్రాంతుడు కాదలచినాడు, నీవుమహా భాగ్యవంతురాలవు. ఈ సమయమును తప్పించుకొనకుము, లేకున్ననీతల్లి దండ్రులు చిత్రవధ చేయబడుదురు. నీవు బలాత్కరింప బడుదువు. ఆ అవస్థ కన్న నీవు సంతసముతో మహారాణివై నీతల్లి దండ్రులనునీబంధు బలగమును సిరిసంపదలతో తులతూగించు"మని అనుచు ఆమె మనస్సును మరలింప ప్రయత్నించెను. అదివిని మహాదేవి ఉగ్రురాలై కౌశికుని కోర్కెను నిరాకరించి, శివభక్తురాలగు తనకును భవియగు కౌశికునకును వివాహము అసంభవమని ఖండితముగానుడివెను. కాని. అమెఉభయసంకటమునందు చిక్కుకొని నట్లు తలంచెను. ఒక వైపు పరమశివభక్తులగు తనతల్లిదండ్రుల ప్రాణరక్షణ మరొకవైపు తాను నిస్సారమని తలంచిన సంసారపు చిక్కులో బడుట; ఈ రెండుసమస్యల పరిష్కారము ఆమెకు దుస్సాధ్యముగా తోచెను. ఐనను తన ఎదుట గనబడుచున్న సంసారపు చిక్కున కన్న, తన తల్లిదండ్రుల ప్రాణరక్షణయే ముఖ్యమని ఆమెకు తోచెను. తన మానరక్షణ భారమును తనఇష్టదైవమగు మల్లికార్జునునిపై వదలి, తన తల్లిదండ్రుల ప్రాణరక్షణ చేయతలంచి, " మీరాజు స్వయముగా వచ్చి నానియమములను నాకోర్కెను చెల్లింతుననియు, తానునా కోర్కెను పూర్తిచేయుచో, నేనురాజభవనమునుండి వెడలిపోవుటకు

స్వతంత్రురాలను గావచ్చుననియు,అంగీకరించినట్లు శపథము చేసిన నేను రాజభవనమునందు ప్రవేశింతునని, మహాదేవి మంత్రికితెలిపెను.

మంత్రితాను వచ్చిన పనిపూర్తి అయ్యినదని సంతోషించి రాజునకీ వృత్తాంతమును నివేదించెను. కామాతురుండగు కౌశికుడు ఈసందర్భమునందలి బిగువునుఆలోచింపక "మహాదేవిఇంటికి పోయి ఆమె కోర్కెను చెల్లింతుననియు, ఆమెకోర్కెను తాను చెల్లించకపోయినచో ఆమె రాజభవనమునుండి వెడలిపోవుటకు స్వతంత్రురాలు గావచ్చుననియు, ఆమె సమ్మతిలేనిదే బలాత్కరింపనని"యు అంగీకరించెను. అదివిని మహాదేవి చెన్నమల్లికార్జునునిపై తన అనన్య విశ్వాసమునుంచి, నిస్పృహ మానసయై, రాజభవనమునందు ప్రవేశించెను. అంతటితో మహాదేవి తల్లిదండ్రులకు రానున్నవిపత్తు తప్పెను.

## రాజభవనమునందు - మహాదేవి

మహాదేవి రాజభవనమునందు గురులింగ జంగమముల ఆరాధన, దాసోహము,అనుభావగోష్టులయందు నిమగ్నయైయుండెను. అందుచే కౌశికునకు వివాహవిషయమగు ప్రస్తావన జేయుటకుగాని. తన కామేచ్ఛను తీర్చుకొనుటకుగాని, అవకాశమే కలుగకుండెను. తాను మెచ్చితెచ్చుకొనిన అద్వితీయసౌందర్యవతి యగు మహాదేవి తన అంతఃపురమందున్నను,తన కామేచ్ఛను తీర్చుకొనజాలకుండుట వలన, అతని కామపిపాస మేరమీరిపోవుచుండెను. అతనికి విరహవేదన అధికమగుచుండెను.

ఇదిఇట్లుండగా, రాజబంధువులు రాజ్య ఉన్నతాధికారులు తమ ధర్మవిరుద్ధమగు పనులను మహాదేవి రాజభవనమునందు చేయుచుండుటను జూచి సహించక రాజునకు దుర్బోధలను చేయనారంభించిరి. మహాదేవి రాజును మత పరివర్తనమును కూడ కోరవచ్చునని వారు హెచ్చ

రించిరి. రాజు తానొకవిషమ పరిస్థితియందు చిక్కుకొనినట్లు భావించి కామాతురాణాం నభయంనలజ్జః అనునట్లు కామాతురుండగు కౌశికుడు తానుజేసిన శపథమును మరిచి, లింగనిష్ఠ యందున్న మహాదేవిని పట్టుకొన బోయెను. అప్పుడు తన లింగానందమునందు భంగము కలిగినందున అత్యంత కోపసంతాపముతో, మహాదేవి

"పశువునకొక చింత, కసాయికొక చింత
ధర్మనకొకచింత, కర్మన కొకచింత
నాకునాచింత, తనకు తనకామపుచింత

ఒల్లనుపో మూర్ఖుడా "అని రాజును ధిక్కరించెను. "నాకోర్కెను దీర్చకయే అవివాహితగానున్ననన్ను బలాత్కరించుట న్యాయమా?" అని అతడు జేసిన శపథమును గుర్తునకు తెచ్చెను. రాజు ఖిన్నుండై "ఆ, కోర్కెను తెలువుమని" అడిగెను. "నేను శివభక్తురాలనునీవు భవుని,లింగ దీక్షనుబొంది శివభక్తుడవైననే నీకును నాకును వివాహపొంతనము కుదురు న"ని మహాదేవి కౌశికునకు ఖండితముగా తెలిపెను. కౌశికుడు శివమతము తనకు ఒప్పిదము కాదనెను. "అటులైననీవు నీమాటను నిలుపుకొనక వచన భ్రష్టుండవైతివి. ఇకనేను నీభవనమునుండి వెడలిపోవుటకుస్వతం త్రురాలనైతిన"ని తెలిపి, రాజభూషణాంబరములనుత్యజించి.

''అమేధ్యపుకడవ, మూత్రపుబుడిగె
ఎముకల తడక చీముబుడ్డ
కాలిపోనీ ! ఈదేహము!
ఈయెడలినినమ్మి చెడకుము
చెన్నమల్లికార్జునుని దెలియని మూర్ఖుడా "

అని అక్కమహాదేవి మానవశరీరము యొక్క నిజస్థితిని దెలిపి,కౌశికుని కామోద్రిక్తత వల్లాచు నట్టుబు దిగంబరియై రాజభవనము నుండి వెడలెను.

మానవదేహ మండలిఅసహ్యతను దెలుసుకొని నందుననో, జినధర్మ ప్రకారము దిగంబరత్వమునందు పూజ్యబుద్ధి గలిగి నందుననో కౌశికుండు మిన్నకుండ నూరకుండెను.

## కల్యాణ ప్రయాణము

మహాదేవి రాజభవనము నుండి వెడలి, ఆమె తల్లిదండ్రులు సఖులు యెందరు వారించినను వినక, ధనుస్సు నుండి వెడలిన బాణమువలె త్రోవ తెరువులు గానక కల్యాణము నందలి బసవాది శివశరణుల సంగమ మందుండి అనుభావ సంపన్న యగుటకు కుతూహలపడుచు కల్యాణమునకు ప్రయాణ మయ్యెను. మార్గమధ్యమందు కొంతమంది దుండగులవలన కొన్ని కష్టములు కలిగినను, వానిని తన లింగనిష్ఠాబలము వలన తప్పించుకొనుచు ఆమె కల్యాణము చేరెను. మహాదేవి కల్యాణపట్టణమున కభిముఖియై నిలిచి.

"కల్యాణమా కైలాసమనుపలుకు వినమాయె
త్రోవలను కల్యాణము వెల్లు పలను కల్యాణము
దీని అంతు నెవరెరింగి రయ్యా!
మీ సత్యశరణుల రాక పోకలు తెలుపు చున్నవయ్యా!
మీశరణుల బసవన్నను గనవలయునను
కుతూహలము నాకయ్యె నయ్యా
వినవయ్యా చెన్న మల్లికార్జునయ్యా". అని ఆమె కల్యాణ పట్టణమునందు ప్రవేశించు చుండెను. ప్రభుదేవుడీ సంగతిని తెలుసు కొని ఆమెసచ్చరిత్రను జనులకు తెలియజేయవలయునను ఉద్దేశముతో, కిన్నెర బొమ్మయ్య యను శరణుని పంపి; ఆమెను పరీక్షించ మని ఆదేశించెను.

అతి సూక్ష్మగ్రాహియు నిర్మోహియునగు కిన్నెర బొమ్మయ్య మహాదేవిని జూడగానే ఆమెనిశ్చల శక్తిని వీరవైరాగ్యమును కనుగొని

ఆమెను పరీక్షింప జూచుట తప్పని తెలుసుకొనియును ప్రభుదేవుని ఆదేశానుసారము, ఆమె అవయవములను తాకి జూచి ఆమె "కామ సంహారిణి" యను నిజస్థితిని తెలుసు కొని తాను జేసినది అపరాధమని గ్రహించి పశ్చాత్తాపపడు చుండెను. అంత మహాదేవి.

"చూచు కన్నులకు రూపమింపుగానున్న
చూచి మనసున సిగ్గు లేక వచ్చితిరన్నా
వినెడి చెవులకు సొంపుగలిగిన మరులు జెంది వచ్చితిరన్నా
నారియను రూపమును జూచి వలచి వచ్చిరన్నా
మూత్రపు బిందువుల నొదలు నాళమని
తెలిసియు కన్ను గానక గతిజెడివచ్చితిరన్నా
బుద్ధిహీనతచే పరమార్థ సుఖమును
తప్పించు కొనుట యెందుకని అరయక;
నరక హేతువన్నన దెరింగియు మనసున రోయక వచ్చితిరన్నా
చెన్న మల్లికార్జునుడు గాక, తక్కిన మగవారు
అన్నలు నాకు ఛీ పొమ్మా మూర్ఖుడా."

అని అతనికి హితమును తెలిపెను. అప్పుడు కిన్నరి బొమ్మయ్య

"విషయములు నిర్విషయము లయ్యేనేడు
కరణాదులు శాంతించి నిలిచె నేడు
నా వినాశమనునది తప్పె నేడు
నా హృదయకల్మషము హరించె నేడు
మహాలింగ త్రిపురాంతకయ్యా
పూర్వ జన్మ కర్మ నివారణమయ్యె నేడు."
"శరణార్థి శరణార్థి, ఓ తల్లీ మాయమ్మా !
శరణార్థి శరణార్థి కరుణానిధీ !

శరణార్థి శరణార్థి ఓ తల్లీ దయామూర్తీ !
త్రిపురాంతక మహాలింగము పెట్టిన చిక్కును
తప్పించితివి తల్లీ ! నీ దయవలన
పులినోటబడి మరల బ్రదికితిని, నేడు తల్లీ !
శరణార్థి శరణార్థి మాయమ్మా"

అనుచు ఆమెను సాష్టాంగ ప్రణామమొనరించెను. అక్కమహాదేవి

కిన్నర అక్కమహాదేవి కిన్నరి బొమ్మయ్య పశ్చాత్తాపమునకు మెచ్చి.

"నా యంతటి పుణ్యము చేసిన వారు గలరా
నా యంతటి భాగ్యము బడసినవారు గలరా
కిన్నరయ్య యంతటి అన్న గలడు నాకు
ఏడేడు జన్మలందు శివభక్తులే బంధువులు నాకు
చెన్న మల్లికార్జునయ్య యంతవాడు
మగడు నాకు చూచితిరా."

అనుచు కిన్నెరబొమ్మయ్యకు తన ఆప్యాయతను తెలిపెను. కిన్నెర బొమ్మయ్య తన అవివేకమునకు మరిమరివగచుచు "నన్నుగన్న తల్లి అక్కమహాదేవి విరక్తిచే దిగంబరియై కామ సంహారిణియై ఇటకు వచ్చుచున్న"దని జరిగిన వృత్తాంతమును వివరముగా ప్రభువున కెరింగించెను.

**అనుభవ మంటప ప్రవేశము-పరీక్ష**

కిన్నరి బొమ్మయ్య నతవదనుండై తన దారిని పోయిన తదుపరి అక్కమహాదేవి కల్యాణ పట్టణమునందు ప్రవేశించెను. ఉడుతడిని విడిచి నది మొదలు అన్న బసవన్నను గన వలయునను కుతూహలము అక్కకు ఎక్కువగు చుండెను. దిన దినమూ కుతూహలము పెరుగు చుండెను. దారి యందు వచ్చుచు పోవుచు నున్న శరణుల గుంపులను జూచి వారి వలన బసవన్న దాసోహ ప్రశంసలను విని "చెన్న మల్లికార్జునుని వలచి

ఉభయ లజ్జల నొదిలితిగాన కల్యాణమును గావించిన మోసమో యను చున్నా"ననుచు బసవన్న మహామందిర ద్వారమునందు ప్రవేశించెను సదావచ్చెడి శకరులకు స్వాగతము పలుకుటకు బసవన్న అంతరంగిక శరణుడు, ఆపన్న ద్వారమందు ఆమెకు స్వాగతము పలికి లోపలికిదయ చేయమని విన్నవించెను. బసవన్న ఆమె వీరవైరాగ్యమునకు మనసున ఆనందించి ఉన్నతాసనమున కూర్చుండునట్లు తెలిపెను.

బసవన్నను చూడవలయు నను కుతూహలముగల అక్కమహా దేవికి అతనిని చూచిన తరువాత ఆమెకు కలిగిన ఆనందము వూహాతీత మనవచ్చుము. బసవన్న నీలాంబిక, గంగాంబిక, నాగాంబిక, చెన్నబసవన్న మొదలగు ముఖ్యశరణులను పరిచయ మొనరించెను. ఆమె వారందరికి తన శరణుల తెలిపెను. అందరును ఆమె అఖండ వైరాగ్యమునకు మనమున సంతసించిరి. అక్కమహాదేవి ప్రభుదేవుని దర్శనముకై తొందరపడుచుండెను. అంతవీరందరు అక్కమహదేవిని అనుభవమంటపమును వెంబడించుకొని పోయిరి. అక్కమహాదేవి శూన్య సింహాసనారూఢుడై యున్న ప్రభుదేవునకు, ఇతర శరణ శరణు రాండ్రందరినిచూచి

"అని మిషని అల్లమయ్య"
మరుళశంకరయ్య కోలశాంతయ్య
మాదారధూళయ్య మిండమల్లినాథయ్య చెన్న బసవన్న
చేరమ రాయ తెలుగు జొమ్మయ్య కిన్నరయ్య
హలాయుధయ్య దాసిమయ్య భండారి బసవరాజయ్య
చెన్నమల్లికార్జునుని ముఖ్యమగు
శరణులకు నమోనమో యందును.

అని నిలిచెను. వారందరు ఆమె అఖండవైరాగ్యమును బ్రహ్మ తేజస్సును చూచి అచ్చరువొంది ప్రభువును జూచిరి.

**అక్కమహాదేవి పరీక్ష**

ప్రభుదేవుడు ఆమె నిజచరిత్రను, ఆమె అనుభావ జ్ఞానమును, ఆమె మాటలలోనే ఇతర శరణులకును తెలియునట్లు చేయుదలయునని

తలంపుతో మహాదేవిని నిండుసభలో కొన్ని ప్రశ్నలను సూటిగా అడిగెను. ఆ ప్రశ్నలకు ఆమె లింగముమెచ్చి ఔ నౌ నని తలయూచు నటుల సమాధానముల నొసగెను.

ప్రభుదేవుడు "ఉప్పొంగు చున్నయవ్వన మదము గల సతీ
సీవిచ్చటి కెందుకొచ్చితివి తల్లీ
సతియనిన కోపింతురు మాశరణులు నీ
పతిగురుతు తెలిపివచ్చి కూర్చుండుము తల్లీ
లేకున్న తొలగుమిటనుండి తల్లీ
మాగుహేశ్వరుని శరణు లందు
సంగసుఖ సన్నిహితము గోరిన, నీ
పతియెవ్వరనునది చెప్పుము తల్లీ!

అక్కమహాదేవి, "హరుడా, నీవు నాకు మగడవుగా వలయునని"
అనంత కాలము తపమొనరించితిని
పెండ్లివార్త రాగానే మావారు నన్ను
శశిధరుని చెంతకు పంపిరి
భస్మముబూసి కంకణము కట్టిరి
చెన్నమల్లికార్జునయ్య నాకు మగడుగా వలయునని"
"చెన్నమల్లికార్జునుడే మగడునాకు తక్కిన వారితో
సంబంధము లేదయ్య ప్రభూ"

"ప్రభుదేవుడు, దేవుడు నిన్నువలచెను నీవు దేవుని
వలచితివి అనునదెట్లు నిజము
భావము శుద్ధమైనచో, చీరను విడిచినవెంట్రుకల మరుగెందుకు
అది అంతరంగమందలి సిగ్గు బాహ్యమందు కనిపించెగదా!
గుహేశ్వరలింగమున కిదెమెప్పితము గాదు."

అక్కమహాదేవి, "ఫలములోపల పక్వముగానిదే పైన
తోలు మ దు తలు పడదు
కామునిముద్రను చూచిన మీకు
వేదన కలుగునేమో యను భావముతో
మరుగు పరచితి, మీకెందులకాచింత!
చెన్నమల్లికార్జున దేవునియందు కలిసినదాన
నన్నుపీడించకు మన్నా" అనిపలికెను.

ప్రభుదేవుడంతటితో విడువక తత్త్వజ్ఞాన సంబంధమగు అనేక ప్రశ్నలను వేసి ఆమె సమాధానములను విని ఆమె అనుభావ నిధి యనియు తత్త్వజ్ఞశిఖామణియనియు తెలుసుకొని మనసున ఆనందించి అనుభవ మంటపము నందలి శరణులకు తెలియునటులు ఆమె అంతరంగ మందలి ప్రకాశమును

"ఆదిశక్తి అనాదిశక్తి యందురు
దానినెవ్వరు తెలుసుకొనిరయ్యా
ఆది యనగాగురుతునకు వచ్చెను
అనాది యనగా పేరునకు వచ్చెను
ఆదిగాదు అనాదిగాదు ఊరులేదు పేరులేదు
నిజశక్తి చిచ్ఛక్తియయ్యె గనుమా
అంతరంగమందలి ప్రకాశము
బహిరంగమందు తానెయై భేదములేక
గుహేశ్వర లింగమందున్న అక్క
మహాదేవి శ్రీపాదములకు నమోనమో యందును"

అని తెలిపెను. ఆమె యొసగిన సమాధాన వచనములను విని ఆమె యందుగల వైరాగ్య తేజస్సును, అంగలింగ సామరస్యానుభవ

మును కనుగొని, అందరును ఆమెను అక్క యని గౌరవించి అనుభవ మంటపము నందు ఉన్నతా సనమున కూర్చుండ నియమించిరి. బసవేశ్వ రుడు నీలాంబిక గంగాంబిక నాగాంబిక, చెన్నబసవేశ్వరుడు అందరును ఆమెను "మహామందిరము" నందు ఉండునట్లు ఆహ్వానించిరి. వారి మాటను కాదనక అక్కమహాదేవి 'మహామందిరము' నందుండిఆమెవారి కుటుంబవ్యక్తులలో నొకరుగా కలిసి, అందుండి బసవని చక్తి, దాసోహ భావము, హరగణముల ఆరోగణము అడిగినదిచ్చెదనను బసవనిబాస బాస తప్పనను బాసమొదలగు భక్తిక్రియలనుజూచుచుఅనుభవమంటప మందలి జ్ఞానసంపత్తును, పెంచుకొనుచుండెను అనుభవ మంటపము నందలి శివాను జ్ఞానచర్చల యందు పాలుగొనుచు, తన అనుభావమును అభివృద్ధి చేసు కొనుచుండెను.

ఇట్లు కొన్నాళ్ల అక్కమహాదేవి మహామందిరమందుండి బసవాది ప్రమధులకరుణ ప్రసాదానుభవమును బొందుచుండి, తన ఇష్టదైవంబగు, శ్రీశైల చెన్నమల్లికార్జున మహాలింగమందు ఇక్యముగా వలయనను తన కోర్కెను ప్రభుదేవున కెరిగించెను.

## అక్కమహాదేవి వీడ్కోలు

ప్రభుదేవుడు తన అనుభావజ్ఞానమువలన శ్రీశైల క్షేత్రమునందు గల కదళీ వనమునందు ఐక్యము నొందుమని ఇట్లు తెలిపెను.

నేను నీవను భేధమును విడిచి
తాను తానై త్రికూటమను మహాగిరి
కొట్ట కొన నెక్కి చూచిన
బట్ట బయలు గాన వచ్చును చూడమ్మా !
ఆ బయలు నందు కలసి పోయిన
త్రికూట గిరి యందొక కనరాని కదళి



కనుపించును చూడమ్మా !
ఆ కదళియను కళ యందు
చొరవడి చూచిన దేదీప్య మాన మగు నొక
జ్యోతి గలదు చూడమ్మా !
పయనించుము తల్లీ అచటికి
గుహేశ్వర లింగమందు పరమ పదవి
స్వీయమగును నీకు చూడమ్మా ! "

అనుచు ప్రభుదేవుడు ఆమెకు ఐక్యమగుటకు యోగ్యమగుస్థలమును తెలిపి

"తను గుణము నాస్తియై లింగ సంగియైనది
మనో గుణము నాస్తియై, జ్ఞాన సంగియైనది
భావ గుణము నాస్తియైనుహా ప్రకాశము తానైనది
నీవు నేనను భేదము నణచి మా
గుహేశ్వర లింగమందు స్వయం లింగమైన
మహాదేవి అక్కనిలువునకు శరణనుచుంటిని"

అని ప్రభుదేవుడు ఆమెకు నమస్కరించెను.

"తనువు నందుండి తనువును గెలిచెను
మనసు నందుండి మనసునుగెలిచెను!
విషయము లంటుండి విషయాదుల గెలిచెను
అంగ సంగమునొదలి భవమును గెలిచెను
కూడల చెన్నసంగయ్య హృదయకమలమున
నిండి నిజపథమును జేరిన మహాదేవి యక్క
శ్రీ పాదములకు నమో నమో యనుచుంటిని"

అని చెన్నబసవేశ్వరుడు, నమస్కరించెను.

"కంటి చూపు కరస్థల ప్రాణ మయ్యెను.

ఒంటి వికారము నిర్వికార మయ్యెను.
సంగ సుఖము నిస్సంగ మయ్యెను.
స్త్రీ యను భావము బయలు నందు కలిసెను.
కలిదేవుని దేవా నిన్నువలచి, ఆనంద మొందిన
మహాదేవి అక్క పాదములను తలచి తలచి నేను ధన్యుడ నైతిని

అని మడివాలమాచిదేవుడు నమస్కరించెను.

''ఔనౌను, కాకేమి?
అజ్ఞానికి పెద్ద చిన్న కలదు గాని,
సుజ్ఞానికి పెద్ద చిన్న కలదా, చెప్పుమా!
చావు గల వానికి భయముగలదు గాని,
చావును గెలిచిన వానికి భయముండునా, చెప్పుమా!
కపిల సిద్ధమల్లికార్జుని యందు గలిసిన,
మహాదేవి అక్క నిలువునకు శరణని
సిద్ధుండ నైతిని, చూచితివా చెన్నబసవన్నా''.

అనుచు శిద్ధరామ శివయోగి నమస్కరించెను.

''దేహము లజ్జయందలి కల్పితమును వదలి,
జీవితము నందలి లజ్జలోగల మోహమును వదలి
మనసులోని లజ్జయందలి గురుతును వదలి,
భావకూటమ శూన్యమని యెరింగి,
తమకపు స్నేహవ్యవహారము నకు ఔక,
కూడల సంగమదేవుని యందున్న
నన్ను గన్న తల్లి మహాదేవి యక్క
నిలువును చూచితివా ప్రభువే!,

అనుచు బసవేశ్వరుడు ను నమస్కరించెను. ఈ ప్రకారముగా అనుభవమంటపము నందలి శరణులు, మహిళాశరణులు అందరునుఆమెకు నమస్కరించి వీడ్కోలు చెప్పిరి.



అనుభవ మంటపము నందలి పరీక్షయందు అక్కమహాదేవి ఘనవిజయము

# తత్త్వజ్ఞాన పరీక్ష

ప్రభు : కూడలేని ఘనమును కూడువిధమెటులు;
తెలిపిన దానికదే కొరత !
గుహేశ్వర లింగమును వేరుగాజేసి,
కలియు విధమెటులు తెలుపుము !

అక్క : గట్టినెయ్యికి కరిగిననెయ్యికి భేధము గలదా !
దీపమునకు దీప్తికి భేదముండునా !
అంగమునకు ఆత్మకు భేదమున్నదా,
శ్రీగురువు నా అంగమును మంత్రమయము చేసినందున,
సావయ నిరవయమునకు భేదము లేదయ్యా !

ప్రభు : చచ్చితినని పీనుగు పలుకుట గలదా !
దాచిన ధనము పలుకుట గలదా !
తోడుబెట్టిన పాలు తియ్యనగుట గలదా ?
గుహేశ్వరలింగమున కీమాట ఒప్పదు !

అక్క : చచ్చిన పీనుగు పలుకుట గలదు !
దాచిన ధనము పలుకుట గలదు !
తోడుబెట్టిన పాలు తియ్యనగుట గలదు !

ప్రభు : ఇది నాకాశ్చర్యము, చెప్పమ్మా తల్లీ !
కాయము లేని సుఖము, జీవము లేని భావము;
ఆ తావేది తెలుపుము, గుహేశ్వరలింగమునకు !

అక్క : నిదురించి కలగని చెప్పునపుడు చచ్చిన పీనుగు లేచి పిలిచె,
తనకు ఋణపడిన ధనము లేచి పిలిచె,
తోడుబెట్టిన పాలు గట్టినెయ్యి యయ్యి తియ్యనయ్యె;
దీనికి తప్పుదీయుట యెందులకు ?

ప్రభు : ఇది లెస్సయయ్యె ! ..............................
ఎటుజూచినను గుహేశ్వరుడను భావమొక్కటయ్యె.

అనుచు ప్రభువు ఆమె తత్త్వజ్ఞానమునకు సంతసించి, ఆమె 'తత్త్వజ్ఞాననిధి' యని తెలిపి తన శరణులను తెలిపెను -

## మహాదేవి వందన సమర్పణము

మహాదేవి అనుభవమంటపము సందలి శివశరణుల కరుణ ప్రసాదము వలననే తనకు ఈ అనుభావజ్ఞానము కలిగినదని,

"బసవన్న నే గురువు ప్రభుదేవుడే లింగము
సిద్ధరామయ్యయే జంగమము
మడివాలయ్యయే, నన్ను గన్నతండ్రి
చెన్నబసవన్ననే పరమారాధ్యుడు
ఇకనే సుఖి నైతి గనుమా చెన్నమల్లికార్జునా!"

"బసవన్న భక్తి చెన్నబసవన్న జ్ఞానము
మడివాలయ్య నిష్ఠ ప్రభుదేవుని జంగమస్థలము
అజగన్న ఐక్యస్థలము నిజగుణుని ఆరూఢస్థలము
సిద్ధరామయ్య సమాధిస్థలము
ఇట్టి వారందరి కరుణ ప్రసాదము
నాకయ్యెను చెన్నమల్లికార్జునా!"

"సంగన బసవన్న పాదముగంటి గాన, నా
యంగము నాస్తి యయ్యెను.
చెన్నబసవన్న పాదముగంటి గాన, నా
ప్రాణము నాస్తి యయ్యెను
ఓ ప్రభూ! మీ శ్రీచరణమునకు శరణంటి గాన,
నాకు జ్ఞానము స్వాయత్త మయ్యె
చెన్నమల్లికార్జునా మీ శరణుల
కరుణ ప్రసాదమును బడసితిగాన, నాకు
ఏ జంజాటము లేదయ్యా ప్రభువే"

2)

అని ఒక్కొక్కరిని స్తుతించుచు నమస్కరించుచు, మరియు నిట్లనియె,

"శరణార్థి శరణార్థి మీకందరకు
ఒడలులేని నుడువలేని కడగానని
ప్రియు నొడగూడి సుఖి నైతి
వినుడయ్యా బాసతప్పను ఇతరంబు కోరను
ఆసించను ఇతరసుఖంబుల
ఆరు చెడి మూడై మూడు చెడి రెండై
రెండు చెడి ఒకటై నిలిచితినయ్యా
బసవన్న మొదలగు శరణులకు శరణార్థి
ఓ ప్రభూ నీ వలన నేను కృతకృత్యురాలనైతి
మరువవలదు మీ బిడ్డను నేననుచు
చెన్నమల్లికార్జునితో కలిసి యుండుమని
నన్ను దీవింపుడయ్యా"

"పుట్టితిని శ్రీ గురుని హస్తమందు
పెరిగితిని అసంఖ్యాకుల కరుణయందు
సద్భావమను పాలు, సుజ్ఞానమను నెయ్యి
పరమార్థమను చెక్కర బెట్టిరి చూచితివా!
ఇట్టి త్రివిధామృతమును తనివి దీర
బెట్టి వారు పెంచిరి నన్ను చూచితివా!
తగిన మగని కిచ్చి పెండ్లిజేసి
ఇచ్చిన ఇంటికి పంపుటకని
వచ్చిరి అసంఖ్యాకు లందరు కూడి
బసవన్న మెచ్చునటులు సంసారము జేయుదు
చెన్నమల్లికార్జుని చైబట్టి.

మీ తలకు తురాయి దెత్తును
కాని పూరి దేను అవధరింపుడు
తరలిపొండు మీరందరు
శరణార్థి, శరణార్థి, మీకందరకు."

అనుచు తనను సాగనంప నిలిచిన వారందరికి సాష్టాంగ నమస్కారములు చేయుచు వారితో సెలవు గైకొని కల్యాణమును విడిచి శ్రీశైలక్షేత్రమునకు పయనమగుచు.

"అయ్యా! మీ శరణులతో కూడియుండిన
సుఖమును నుపమింపరాదయ్యా
అయ్యా మీ మహంతుల కూడి
విడిచి పొవుటకన్న చచ్చుట బలు లేసయ్యా
చెన్నమల్లికార్జునయ్యా! మీ నిజము నెరిగిన
మహాత్ముల విడిచి నే నిలువలేనయ్యా"

అనుచు ఉడుతడిని విడుచునప్పుడు తల్లిదండ్రుల సఖుల విడిచిన నాటికన్న శరణులవిడుచు నేటిదుఃఖము ఆమెకు, అతిదుర్భరముగానుండెను. కాని చెన్నమల్లికార్జున మహాలింగమందైక్యము గావలయు ననుకుతూహలము వలన ఆ దుఃఖము నాపుకొని తన ప్రయాణమును ముందుకు సాగించెను. సాగనంప వచ్చిన శరణులు శరణురాండ్రందరు ఆమెను విడుచు దుఃఖము నాపుకొనలేక, అప్రయత్నముగా వచ్చు అశ్రుధారలను తుడుచుకొనుచు ఆమె చివరి మాటలను తలచుచు తలచుచు ఆమె తమకంటికి కగుపడు వరకు ఆమెను చూచుచు చూచుచు ఆమెను దీవించుచు తమ తమ నెలవులకు తిరిగిపోయిరి.

## కదళీవనయాత్ర - ఐక్యము

అక్కమహాదేవి శ్రీశైలక్షేత్రమార్గమధ్యము నందలి సృష్టి సౌందర్యమును వనరామణీయకమును గాంచుచు కల్యాణము నందలి అనుభవమంటపము నందు వినిన శివానుభవ గోష్ఠుల వలన కలిగిన అనుభావజ్ఞానముచే వనమందు చూచునదంతయు శివచైతన్యమే యని భావించుచు

"వనమెల్ల నీవే వనమందలి దేవతరులన్నియు నీవే.
తరువులం దాడు చున్న ఖగ మృగము లన్నియు నీవే
చెన్నమల్లికార్జునా సర్వభరితుండవై
నీ ముఖమును జూపుమా"

అనుచు తన ఇష్టదైవంబగు చెన్నమల్లికార్జునుని వేడుచు శ్రీశైల పర్వతమును జేరెను. అచ్చట చెట్టు చెట్టు యందును పుట్ట పుట్ట యందును చెన్నమల్లికార్జునుడు గలడని పిలుచుచు, కనుపించుమని వేడుచు, కనబడ కుండిన విలపించుచు, శ్రీశైలగిరిని జేరెను. అచ్చట శ్రీశైలదేవస్థాన మందలి తన ఇష్టదైవంబగు చెన్నమల్లికార్జునమహాలింగమును సందర్శించి, శ్రీశైల సూర్యసింహాసన పీఠాధిపతులగు(మునిప) జగద్గురువుల వారికి నమస్కరించి, ప్రభువు తెలిపిన గురుతులను వెదకుచు తుదకు కదళీవనమును కనుగొని, అందు ప్రవేశించెను. అచ్చట నొక ఏకాంత స్థలము (బిలము) నందు, సుఖాసీనయై అనన్యభక్తితో కరస్థలమందలి ఇష్టలింగమును జూచుచు, ఇష్టప్రాణ లింగముల నొకటిగా చూచి, చెన్న మల్లికార్జునుండను భావలింగమును దృష్టియందు నిలిపి అంతరంగము బహిరంగము ఆత్మసంగముల నొకటిగా జేసి

"కదళి యనునది తనువు కదళి యనునది మనసు
కదళి యనునది విషయాదులు
కదళి యనునది భవఘోరారణ్యము
ఈ కదళి యనుదానిని గెలిచిబ్రదికివచ్చి
కదళివనమందు భవహరుని గంటి
భవమును గెలిచి వచ్చిన బిడ్డా యని
కరుణతో నెత్తుకొని
బిగువుతో ఎదనొత్తుకొనిన
చెన్నమల్లికార్జునుని హృదయ
కమలమందు నిండి పోయితి"

అనుచు శివయోగానందమగ్నయై స్వయంలింగమయ్యెను. ఇప్పటికిని శ్రీశైలక్షేత్ర మందలి కదళివనమునందు అక్కమహాదేవి పేరుతో నొక వాగు (అక్కనహళ్ళ)ఆమె పేరుతో నొకబిలము (అక్కనగవి) ఆమె పేరుతో నొకగద్దె (అక్కనగద్దె) మరియు అక్కనగవి ఎదుట విరియబోసిన వెంట్రుకలతో కప్పబడియున్న ఆమె శిలాప్రతిమ సుప్రసిద్ధ చరిత్రావశేషములుగా నిలిచి యున్నవి. శ్రీశైలదేవస్థానపు ప్రాకారగోడకు,అరటిచెట్టు దగ్గర నిలిచియున్నఅక్కమహదేవిని లింగము నుండి ఒకచేయి బైటికివచ్చి రమ్మని పిలిచినట్టు చెక్కబడియున్న చిత్రము, మల్లికార్జునుని గుడియందు ఆమె లింగార్చన జేయుచున్నట్లు శిలాప్రతిమ యొకటి; అక్కమహాదేవి శ్రీశైల చెన్నమల్లికార్జునుని తన పతిగా భావించి, అర్చించి. ధ్యానించి కదళీవనమందు మల్లికార్జునలింగములో ఐక్యమైన దను చరింత్రాంశములకు స్మారకచిహ్నములుగా నిలిచి యున్నవి. శ్రీశైలక్షేత్రముతో శివశరణులకు సన్నిహిత సంబంధమున్న దనుటకు అక్కమహాదేవి చరిత్రకూడ యొకబలవత్తరమగు ఆధారమ్ము,

## అక్కమహాదేవి-అవివాహితనే

అక్కమహాదేవి కౌశికుని రాజభవనమునందు ప్రవేశించు వరకు పూర్వకవులును, ఆధునిక రచయితలును అందరు దాదాపు ఏకాభిప్రాయులయ్యే యున్నారు. కాని రాజభవనమునందు ప్రవేశించిన తదుపరి జరిగిన సన్నివేశము లందు, భిన్నాభిప్రాయము లేర్పడినవి. అందును ఆమె వివాహవిషయము ముఖ్యము. ఈ భిన్నాభిప్రాయములకు పూర్వకవులలో ముఖ్యులగు హరిహరుని, చామరసుని కృతులే మూలము.

హరిహరుని కథన ప్రకారము; అక్కమహాదేవిని జూచి కౌశికుడు మోహించును. అలిమిన గాకున్న బలమిననైనను ఆమె తనను వివాహమాడునటులు ఒప్పించుమని కౌశికుడు తనమంత్రిని పంపును. ఆమె అంగీకరించదు. మంత్రి ఆమె తల్లిదండ్రులకు రాజదండన భయమును జూపును. ఆమె తల్లిదండ్రులు తమ ప్రాణభయముచే, ఆమెను రాజుతో వివాహమాడు మందురు. అందుకు అక్కమహాదేవి తన నిత్యనియమములగు లింగపూజ గురుజంగమముల దాసోహము,అనుభావగోష్టికి అంతరాయము కలిగించనని కౌశికుడు అంగీకరించిన అతనితో వివాహమునకు అంగీకరింతు ననును. రాజు తన మూడు నియమములకు అంతరాయములు కలిగించి మూడు తప్పులు జేసిన, రాజభవనమునుండి తానువెడలి పోవుటకు స్వతంత్రురాల నగుదునను. కౌశికుడు ఆమాటలకు అంగీకరించును. ఈ అంగీకారముపై ఆమె అతనితో వివాహమాడును. రాజభవనమునందు, 'విషమ సంసారము' చేయుచుండును. కౌశికుడు ఒక్కొక్కటిగా ఆ నియమములకు అంతరాయముల కలిగించి మూడు తప్పులను జేయును. ఒడంబడిక ప్రకారము, అక్కమహాదేవి, రాజభవనమునుండి దిగంబరియై వెడలి పోవును. ఆమె దిగంబరియై పోవుటకు, హరిహరుడు తెలిపిన కారణము ఇది. ఒకనాడు మధ్యరాత్రియందు అక్కమహాదేవి

నిదురించుచుండగా, ఆమె ఆరాధ్య గురువు రాజభవనమునకు వచ్చును. ఆమె నిద్రమేల్కొని, భక్తిఆతురతతో, వివస్త్రగానే గురుదర్శనమునకు వచ్చును. గురువు ఆమెను 'వస్త్రభూషిత వైరమ్మ' నును. ఆమె వస్త్రమును గైకొన బోవును. కౌశికుడు, 'అత్యంతభక్తురాలవగు నీకు, మీరిన విరక్తురాలవగు' నీకు చీరయెందుల కని, పరిహసించి చీరను లాగుకొనును. అది మూడవ తప్పు అగుటవలన, కౌశికుడు, తనమూడునియమములకు అంతరాయములను కలిగించి మూడు తప్పులు జేసెననియు, తాను రాజభవనమునుండి వెడలిపోవుటకు స్వతంత్రురాలనైతిననియు, కౌశికునకు తెలిపి, అతని చేతియందలి చీరనువదలి, కేశాంబరియై, అటనున్న గురువునకు నమస్కరించి, రాజభవనమునుండి వెడలిపోవును.

హరిహరునకు అక్కమహాదేవిపై ఎంతభక్తియున్నను, అతడు అమె కాలమునకు ఎంత దగ్గరివాడైయున్నను, అతడు చిత్రించిన అక్కమహాదేవి పాత్ర, బిడ్డభవిష్యత్తుకన్న తమ మేలునే కోరు ఆమెతల్లిదండ్రులపాత్రలు, రాజదర్పము వలన బలిమిన నైనను అక్కమహాదేవిని పొందగోరు కౌశికునిపాత్ర. అంతేగాక శ్రీశైలక్షేత్రమునందు అతడు ప్రవేశపెట్టిన ధనాశాకోరులగు జంగముములపాత్రలు, ఆనాటి శివశరణుల సత్యశుద్ధజీవనములకును, వారుబోధించిన ధార్మికతత్త్వములకును గొడ్డలిపెట్టువలె కనబడుచున్నవి. అంతేగాక అక్కమహాదేవి శ్రీశైలమునకు పోవుటకన్న మొదలు కల్యాణము నందుండి, అనుభవమంటపమందలి, అనుభావగోష్ఠులలో పాలుగొన్నటులు ఆమె వచనములు, ఆమె సమకాలీనులగు ఇతర శివశరణుల వచనములు సాక్ష్యమిచ్చుచుండగా, హరిహరుడు అతిముఖ్యమగు ఆ విషయమునే తెలుపలేదు. కనుక ఆతనికి ఆమె చరిత్ర సంపూర్ణముగా ఉన్నదున్నట్లు తెలియనందుననో, లేక అవివాహిత యగు నొకస్త్రీ రాజభవనము నందుండుట, తప్పని భావించియో,

హరిహరుడు ఆమెకు వివాహమైనట్లు ఊహించి వ్రాసియుండవచ్చును. తర్వాత జరిగిన సన్నివేశముల వలన అది సత్యమని తలంచుట సమంజసము గాదు.

తననిత్యనియమములకు కౌశికుడు, అంతరాయము కలిగించడను నమ్మకము లేని స్థితియందు, అక్కమహాదేవి అతనితో వివాహమాడి, రాజభవనమునందు వైవాహిక జీవనమును (విషమస్థితియందైనను) గడుపుచుండగా; రాజు తననియమములకు అంతరాయము కలిగించెనని, వివాహసబంధమును తృణీకరించి, రాజభవనమునుండి, (ఆమె) వెడలి పోవుటవలన ఆమెకు ప్రయోజనకరము గాకపోవుయేగాక, మగనిపై తప్పుమోపి వెడలిపోయినదను, అపవాద కూడ కలుగవచ్చును. బహుశః ఇట్టి ఆపవాద యందలి నిజస్థితిని లోకమునకు తెలుపవలయునను ఉద్దేశముతోనే ప్రభుదేవుడు, అనుభవమంటపమునందు అట్టి ప్రశ్నల నడిగియుండును. ఆమె యొసగిన సమాధాన వచనములవలన ఆయపవాదము నిరాధారమని తెలియవచ్చినది.

వివస్త్రగానే ఆమె గురుదర్శనమునకు వచ్చుట, కౌశికు డామెను పరిహసించుట, ఆమె దిగంబరత్వమునకు కారణములను హరిహరుని వాదన సహేతుక మనిపించదు. అది అసహజము, అస్వాభావికమనియు కూడా తోచును. ఈ కారణము వలన హరిహరుని కథనమును నమ్మి ఆమెకు వివాహమైనదను విషయమును అంగీకరించక పోవుటయే సముచితము.

చామరసుని కథన ప్రకారము; అక్కమహాదేవి వివాహమునకు మొదలు తనదొక కోర్కెను పూర్తిచేసిన కౌశికునితో వివాహమునకు సమ్మతింతుననను. కౌశికుడు తనకోర్కెను నిరాకరించిన అవివాహితగానే రాజభవనమునుండి వెడలి పోవుదు నననును. కౌశికుం దందుకు అంగీ

కరించును. అంతేగాక ఆమె సమ్మతిలేనిదే బలాత్కారించనని కూడ శపథము చేయును. అప్పుడు అక్కమహాదేవి రాజభవనమునందు ప్రవేశించును. ఆమె రాజభవనమందున్న కొన్ని రోజులలో వివాహము జరుగు అవకాశము కలుగలేదు కామాతురుండగు కౌశికుడొకనాడు, ఆమెను కౌగిలించబోవును. తన కోర్కెనుదీర్చకనే బలాత్కరింపజూచుట న్యాయమా? అని ఆమె రాజును హెచ్చరించును. రాజు ఖిన్నుండై తనకోర్కెను తెలుపుమని ఆమెను కోరును. అక్కమహాదేవి తాను శివభక్తురాలు గనుక రాజు లింగధారియై శివభక్తుండైననే అతనితోవివాహమునకు సమ్మతింతునను. రాజు తన కది సాధ్యముగాదనును. అంత అక్కమహాదేవి, కౌశికుండు తనమాటను నిలుపు కొనలేక, వచనభ్రష్టుడయ్యెనని తాను రాజభవనమునుండి వెడలిపోవుటకు స్వతంత్రురాలనైతినని, రాజునకు తెలిపి రాజభూషణాంబరములను విప్పి పారవైచి, అతని కామోద్రిక్తత తగ్గుటకు దిగంబరియై రాజభవనమునుండి వెడలిపోయెను. జైనుండగు కౌశికుడు దిగంబరత్వము నందలి పూజ్యభావమును తలంచియో తనమాటను నిలుపు కొనలేక పోయితిననియో, మిన్నకుండెను. జినధర్మ ప్రాబల్యముగల ఆ నాడు దిగంబరత్వ మొక వింత గాకుండెను.

చామరసుని ఈ కథనమునందు నైజము, స్వాభావికము కనిపించుచున్నది. అక్కమహాదేవి కోర్కెను అంగీకరించి కౌశికుడు శివభక్తుడై యుండిన ఆరాజ్యమునందు జైనుల ప్రాబల్యము తగ్గుచుండెను. ఆరాజ్యము శైవసామ్రాజ్యముగా మారుచుండెను. శివధర్మ ప్రచారమునకు అనుకూలము కలుగుచుండెను. అట్లుగానందున అక్కమహాదేవి కౌశికుని కపిముష్టినుండి తప్పించుకొని అవివాహితగానే బయటపడగలిగినది. ఈ క్రమమునందు ఆమెయందలి దూరదృష్టి తులనాత్మక విచారము, శివభక్తి ప్రాబల్యమునకు ఆమెచేయదలచిన త్యాగము తెలియుచున్నది ఆమె వ్యక్తిత్వ మందలిఘనత పెరిగినది. కనుక చామరసుని కథనప్రకారము

అక్క మహాదేవి, అవివాహితగానే నిలచిన అఖండ బ్రహ్మచారిణియనుటయే సర్వవిధముల సముచితము.

ఈ విషయమునందు ఇరుప్రక్కలవారు, తమ తమ వాదముల నెగ్గించు నుద్దేశముతో, అప్పటి కాలమాన పరిస్థితులను, సంస్కృతిని, లోకాచారములను ఆధారముగా గొని తమ తమ బుద్ధిబలములతో వాదోపవాదములను జేయుచున్నారు. ఐనను తర్వాత జరిగిన కొన్ని సన్నివేశములందు అక్కమహాదేవి స్వయముగా వచించిన వచనముల వలనను, ఆమె గురించి ఇతర శివశరణులు చేసిన ప్రశంసల వలనను, మనస్తత్వ శాస్త్ర ప్రకారముగను ఆలోచించిన ఆమె అవివాహితగా నుండెననియే తెలియుచున్నది మనస్తత్వశాస్త్ర ప్రకారము రాజభవనమునందలి భోగ విలాసములతో వైవాహిక జీవనమున కలవాటు పడిన తదుపరి, హఠాత్తుగా వాసినన్నింటిని కాలదన్ని రాజభవనమునుండి వెడలిపోవుట మానవ స్వభావమునకు వ్యతిరేకముగా నుండును. కొంతవయస్సు దాటిన తదుపరి, బుద్ధునివలె, సంసార సుఖమునందు విముఖత కలిగినను కలుగవచ్చును. కాని నవయవ్వనము నందు, అందులో హఠాత్తుగా, అంతటి విముఖత కలుగుట అసంభవము.

రాజభవనము నందు రాజు, అక్కమహాదేవిని బలాత్కరింప జూచి నప్పుడు, "ఒల్లనుపో కొంగుపీడుమో మూర్ఖుడా" అని రాజును ధిక్కరించుట వలన ఆమెకు రాజుతో వివాహము కాలేదనియే తెలియుచున్నది. వివాహమై వైవాహిక జీవనమును గడుపుచుండినచో, అట్లుధిక్కరించుటకు ఆమెకు ధైర్యము చాలకుండెను. కిన్నర బొమ్మయ్య పరీక్షింప వచ్చినప్పుడును, అనుభవ మంటపమునందు ప్రభుదేవుని ప్రశ్నలకును, అక్కమహాదేవి పలికిన సమాధానవచనముల వలనను. కూడ రాజభవనమునందు ఆమె అవివాహితగానుండె ననియే తెలియుచున్నది.

## ముఖ్య ఆక్షేపణలకు సమాధానములు

అక్కమహాదేవి తన వచనములందలి కొన్నింటిలో, తన విరహ వేదన, మోహావేశము, ప్రియునితో కూడెడు కోర్కె, ప్రియునిపిలుచు కొని రమ్మని సఖులను వేడుట, కూడి ఆనందమున పరవశించి నటుల తలంచుట, మొదలగు కామవికారపు చేష్టలను వచించియున్నది. ఆమె వైవాహికజీవనమును అనుభవించనిచో, అట్టి అనుభూతి ఆమె ఎట్లు ఊహించ గలదని, హరిహరుని పక్షము వారు వాదింతురు. కాని ఆవచనము లందు ఆమె తెలిసినది కామవికారము కాదనియు, శివచింతన మందుండి, శివజీవైక్యానుసంధానకోర్కెను తెలిపినదనియే గ్రహించ వలయును. ఆమె ఇతర వచనములందును గూడ, ఈ యభిప్రాయమే తెలిపియున్నది.

ప్రేమలు రెండు విధములు. ఒకటి లౌకిక ప్రేమ (కామతృప్తి) రెండవది ఆధ్యాత్మిక ప్రేమ (మోక్షాపేక్ష). కామతృప్తి అనగా, పరస్పర మోహావేశము గల స్త్రీ పురుషుల సంగమము. మొదటి ప్రేమ గురి. అది జరుగునంత వరకు వారిరువురియందు ఆతురత పెరుగుచుండును. ఆ యాతురతనే కామవికారపు చేష్టలకు మూలము. దానినే విరహవేదన యందురు. మోక్షాపేక్ష యనగా జీవుడు దేవునియందు గలియుట, రెండవ ప్రేమ గురి అట్లు కలిసిననే ఈ యాధ్యాత్మిక ప్రేమ గురి సిద్ధించును. భక్తి ఈ గురికి సాధన మార్గము. కామతృప్తికి సాధనముగానున్న ప్రేమయే మోక్షసాధనయందు భక్తిగా మారును. సాధకులు, సాధన మార్గములు, సాధ్యములు వేర్వేరైనను; లౌకికప్రేమ యందు ప్రియురాలు ప్రియునితో కూడుటకు పడెడి పాట్లనే, ఆధ్యాత్మిక ప్రేమ యందు (జీవుడు శివునియందు కూడుటకు) పడునట్లు తెలుపుట పూర్వము నుండి వచ్చిన

యాచారమే! దీనినే మోక్షాపేక్ష యందురు. మధురప్రేమ యనియు కూడ యందురు.

లౌకికప్రేమ యందు ఇరువురి కలయిక యున్నంతవరకు, ఆ యిరువురును మహానందము నందు తన్మయత్వమును పొందియుందురు. ఆ తన్మయత్వము క్షణభంగురము. తర్వాత వారిరువురును మళ్లి మొదటి ఆటకే వత్తురు. ఆధ్యాత్మిక ప్రేమ అట్లు గాదు. అది సులభసాధ్యమును గాదు. క్షణభంగురమును గాదు. అది బహు కష్టసాధ్యము. ఆ బ్రహ్మా నందము కలిగిన మరల తిరుగదు, తరుగదు. కనుక భక్తులు, భక్తు రాండ్రు జీవితాంతము ఆ యావేదనను పొందుచుందురు. సాధకులు అదే జన్మయందు ముక్తిని బడయక పోవచ్చును. కర్మపక్వము గాకున్న మరల జన్మమెత్తవలసి వచ్చును. అప్పుడు పూర్వజన్మ సుకృత దుష్కృత ఫలముల ననుభవించుదురు. పూర్వజన్మ సుకృతము ముక్తి మార్గగామియయ్యి యుండిన, వారు కామాదిరిపులను తొందరగా గెలిచి దేహగుణముల నొదలగలుగుదురు. అయినను జీవశివులు ఏకమగువరకు, ఆవేదన బొందుట వారికి తప్పనిసరియగును. ఈ దిశయందు మీరాబాయి తన కృష్ణప్రేమను భక్తిగా మోక్షాపేక్షగా తలంచి, పాడిన మధుర కీర్త నలు మనకు నిదర్శనములుగా నున్నవి.

ఆ యావేదననే అక్కమహాదేవి తన వచనములందు తెలిపినది. అంతటితో ఆమె సంసార సుఖము ననుభవించినదనుట పొరపాటు. ఆమె శరణసతి-లింగపతి యను తత్త్వముననుసరించి శ్రీశైల చెన్నమల్లికార్జున మహాలింగమును, పతిగా భావించి, ప్రేమించి తన ఆవేదనను అతనికి భక్తితో నివేదించినది. అందులో అశ్లీలత యెంతమాత్రము గానరాదు.

సర్వాంగసౌందర్యముతో బాటు, షోడశవర్షప్రాయమున నున్న అక్కమహాదేవిని, సాహసుండును, బలపరాక్రమ సంపన్నుండును అగు

మహారాజు ప్రేమించి, వివాహము నర్థించిన ఆమె నిరాకరణము, అస్వా భావికమని వారు మరొకవాదమును జేతురు. యువతీయువకులు ఒకరి నొకరు ప్రేమించి ప్రేమవివాహములను జరుపుకొనుచున్న ఈ రోజులలో, ఆమె నిరాకరణము వారికి అస్వాభావికమని తోచినదేమో! కాని, సుమారు ఎనిమిది వందల ఏండ్లకు మొదలు, అప్పటి పరిస్థితులలో ఆమె నిరాకర ణమును అస్వాభావికమనుట యెంతమాత్రమును పొసగదు. అట్లు తలం చుట పొరపాటు. అక్కమహాదేవి లింగధారియగు శివభక్తురాలు, సచ్ఛీల వతి. కౌశికరాజు జైనుడు, భవి. కనుక ఆమె నిరాకరణము అస్వాభావిక మెంతమాత్రమును గాదు.

అతి బలపరాక్రమవంతుడును, కామపిశాచపీడితుండును అగు కౌశికుని మందిరమందున్న అక్కమహాదేవి అతని బారినుండి యెట్లు తప్పిం చుకొనగలిగినదనియు కూడ వారు యింకొక ఆక్షేపణ జేయుదురు. ఈ సందర్భమున, రావణుని లంకయందు బంధితురాలై యున్న సీతశీలము వారికి గుర్తుకు రాలేదు గాబోలు! వారి అభిప్రాయమునందు కౌశికున కున్న అనుకూలములకన్న, రావణునికే ఎక్కువ అనుకూలము లుండెనని వారి ఆలోచనకు తట్టనటు లున్నది. అయినను సీతయందలి పతిభక్తి, ధర్మనిష్ఠ లంకయందు గాపాడినటులే, సర్వభరితుండగు చెన్న మల్లికార్జు నుని శక్తియే ఆమెకు అంగరక్షయై యుండినదనునది వారు తెలుసుకొన దగిన విషయము.ఇటులనే సదాచారప్రవృత్తిగల శీలవతులు, దైవచింతన ము, ఆత్మబలము వలన దుష్టశక్తుల నుండి పరిరక్షింప బడిన సత్య సంఘటనలెన్నియో గలవు. ఐనను అక్కమహాదేవి ఘుడలనే వారికి యను మానము కలుగుట కడు విచారకరము.

చరిత్రను సృష్టించు మానవాతీత వ్యక్తుల చర్యలు ఇతరులకు అస్వాభావికములుగా తోచుట క్రొత్తగాదు. అక్కమహాదేవి కౌశికునితో వివాహమునకు సమ్మతించకనే, వివాహమునకు మొదలు పూర్తిచేయవల

యునని అతనికి సాధ్యముగాని కోర్కెలను కోరినది. ఆ ప్రకారము అతడు చేయునట్లు శపథము చేసినతదుపరియే ఆమె రాజభవనమునందు ప్రవేశించినది. ఆమె తలచినటులే కొన్ని రోజులలోనే రాజు వచన భ్రష్టుడు గావడము. ఆమె రాజభవనము నుండి అవివాహితగానే వెడలిపోవడము జరిగినది. ఒకవేళ ఆమె ఆ వివాహమునకు సమ్మతించి యుండినచో, ఆ కోర్కెలను గోరుటవలన ఆమెకుగల ప్రయోజనము గాని, తన కామతృష్ణ తీరిన తదుపరి రాజు ఆ కోర్కెల నిరాకరించిన, అతనికగు నష్టముగాని గానరాదు. ఈ పరిణామమును గ్రహించియే అక్కమహాదేవి వివాహమునకు మొదలే తన కోర్కెను పూర్తి చేయుమని కోరినది. కామేచ్ఛ తీరిన తదువరి పురుషులకు స్త్రీలయందు వ్యామోహము తగ్గుట స్వాభావికమే. కనుక తన కోర్కెను పూర్తి చేయునంతవరకు కౌశికునితో వివాహమాడనను ధృడ సంకల్పముతోనే ఆమె రాజభవనము నందు ప్రవేశించినది. ఆమె ఆ ధృడసంకల్పము, లింగనిష్ఠలే రాజభవనము నందు ఆమెను పరిరక్షింప గలిగినవి. ఆమె అఖండబ్రహ్మచారిణియైనందుననే ఆమెకా బ్రహ్మతేజస్సు, దిగంబరి కాకలిగినంతటి వీరవైరాగ్యము కలిగినది.

ఒకవేళ అక్కమహాదేవికి కౌశికునితో వివాహమే జరిగియుండినచో ఆమె ఈ క్రింది వచనభాగముల కర్థమేమి ?

"చెన్న మల్లికార్జునుని వలచినవారు
లోకాభిమానము నెంతురా మూర్ఖుడా !"
" నా మగడు చెన్న మల్లికార్జునుడు
మిగిలిన మగవారందరు మొగులు చాటున
నగుపడు రంగుబొమ్మలు చూడవే !"
"చెన్న మల్లికార్జునుడు గాక
అన్యపురుషుల ఎదయందు ముండ్లుండును

నేను వారిని కౌగిట చేర్చనమ్మా"
"ఏడేడు జన్మలందు శివభక్తులే బంధువులు
చెన్నమల్లికార్జునని అంతటివాడు మగడు నాకు గనుడోయి"
"చెన్న మల్లికార్జునుండను మగనితో
పెండ్లి చేసిరి నాకు''
"చెన్న మల్లికార్జునుని వధువునగు నాకు
వేరే శృంగార మేటికు చెప్పరే అమ్మలారా"
"ఇహమున కొక మగడు పరమున కొక మగడా"
"నా దేవుడు చెన్న మల్లికార్జునుడు గాక
పరపురుషులు నాకు పనికి రారన్నా"
"చెన్న మల్లికార్జునుడు గాక మిగిలిన మగవారలు
నాకు సోదరులు, ఛీ పొమ్మా మూర్ఖుడా"
"శరణసతి - లింగసతి"నైతిని ఈ
కారణమున చెన్న మల్లికార్జునుం డను
మగనితో కూడి కలిసిపోయితిని"

ఈ అభిప్రాయమునే ఆమె ఇతర అనేక వచనములందు ధృఢముగా తెలిపినది. ఐనను ఆమె కౌశికునితో పెండ్లియాడి, సంసారసుఖము ననుభవించినదను వాదమును ప్రతిపాదింప జూచుట సాహసము, దుస్సాహసము.

ఈ వివరముల వలన రాజభవనము నందు కౌశికునకు అక్క-మహాదేవితో వివాహమాడుటకు గాని, వైవాహిక జీవనమును గడుపుటకు గాని అవకాశమే కలుగలేదని తెలియుచున్నది. ఆమె రాజభవనము నందు అవివాహితగా, అఖండబ్రహ్మచారిణిగా నుండియే సర్వసంగ పరిత్యాగియై కేశాంబరియై రాజభవనము నుండి వెడలి బసవాది ప్రమథుల అనుభావ

గోష్ఠిని విని అనుభావమును గడించుటకు గాను కల్యాణమునకు ప్రయాణ మైనదనుటయే సర్వవిధముల సముచితము.

ఆమె యందలి జ్ఞానజ్యోతి, ఉజ్వల ప్రకాశమును, వీర వైరాగ్యము జూచి జనులందరు "ఆదిశక్తియగు పార్వతి యందలి సాత్త్విక కళయే మహాదేవి రూపమున భూలోకము నందవతరించెనా" అని అభిప్రాయపడుచుండిరి. ఈ జనాభిప్రాయమే భక్తిపారవశ్యులగు కావ్యకర్తలు ఆమె జననము గురించి చెప్పిన 'అవతార కథ'కు కథా సామగ్రి యయ్యెనని తలంచవచ్చును.

## అక్కమహాదేవి — మీరాబాయి

అక్కమహాదేవి వలెనే భారతదేశమునందు కొందరు మహిళలు మధుర ప్రేమతో రచించిన మధురగీతముల వలన తమ తమ ఇష్ట దైవముల ప్రసన్నతను బడసి సాయుజ్యపదవిని బొందిన పుణ్య చరిత్రలు సుప్రసిద్ధములు. అట్టి వారిలో ఉత్తరదేశము నందలి మేవాడ మీరాబాయి చరిత్ర అందరకును విదితమే. మీరాబాయి చిన్ననాటి నుండియే శ్రీకృష్ణభగవంతునిఅత్యంతభక్తితోవలచితనప్రభువుగాప్రేమించిఆరాధించి రేయింబవళ్ళు ఆతనిని భజించుచు, ధ్యానించుచు,తన్మయత్వము నొందుచుండెను. ఆమె పరధ్యాన స్థితిని తెలియక, ఆమె తల్లిదండ్రులు తమ వంశ మర్యాద ననుసరించి ఆమెకు వివాహ మొనరించిరి. ఆమె ఆవివాహము తనకును తన మనోనాయకుండగు శ్రీకృష్ణునకును జరుగుచున్నట్లు జరిగినట్లు భావించి, శ్రీ కృష్ణుని ధ్యానము నందే నిమగ్నయగుచుండెను. కృష్ణునిపై ఆమెభక్తిని పిచ్చిగా తలచి ఆ పిచ్చిని మాన్పుటకై అత్తవారింటివారు మొదట నయభయములనుపయోగించిరి. కాని ఆమె తన 'కృష్ణపిచ్చి'ని వదలకుండిన "దండో దశగుణో భవేత్త" ను మూర్ఖ

ఇష్టలింగార్చన యందున్న అక్కమహాదేవి



శ్రీశైలమల్లికార్జున దేవస్థానమందు
ప్రతిష్ఠింపబడియున్న విగ్రహము

కదళీ వనమందు శ్రీశైలచెన్నమల్లికార్జునుడు అక్కమహాదేవిని ప్రత్యక్ష
తనలో ఐక్యము చేయుచున్న దృశ్యము.



శ్రీశైలమల్లికార్జున దేవస్థాన ప్రాకారము సందలి రాతియందు
చెక్కబడియున్న దృశ్యము.

## హేమారెడ్డిమల్లమ్మ



శ్రీశైలమల్లికార్జున దేవస్థానమందు ప్రతిష్ఠింపబడియున్న విగ్రహము



యానగొంది మాణిక్యయోగిని

బుద్ధితో ఆమెను తాడన పీడన జేయనారంభించిరి. చివరకు విషప్రయోగముసు కూడ చేసిరి. భక్తులపాలిటి పరసవేదియగు పరమేశ్వరుడు అంతర్ధానమందుండియే మీరాబాయిపైబడు దెబ్బలను, గుద్దులను, విషపానమును తానను భవించుచుండెను. మీరాబాయిపై వాని పరిణామము గాకపోవుటయే గాక, కృష్ణునిపై ఆమె భక్తి తృష్ణ మరి మరి పెరుగుచుండెను. వారి మూర్ఖతవలన లాభము లేకపోయెను. అది చూచి ఆనాటి పెద్దలు ఆమె, లౌకిక భోగముల స్పృహలేని మహా యోగినియని యెరింగి, ఆమె భక్తి యోగమునకు అడ్డు తగలక, ఆమెను ఆమెదారిని పోనిచ్చిరి.

ఆమె శ్రీకృష్ణుని జన్మభూమియగు మథురా నగరమునకు వచ్చి శ్రీకృష్ణుడు తన లీలలను భక్తులకు చూపిన పుణ్యభూమియని తలంచి అతని లీలలను తలంచుచు, "మీరాకే ప్రభు గిరధర్ నాగర్" అను మకుటముతో అనేక మధురగీతములను రేయింబవళ్ళు పాడుచు తలంచుచు అతనియందే లీనమైన సంగతి నెరుంగనివారు లేరు. పరమేశ్వరుడు మీరాబాయికి సుందరరూపమునకు తోడుగా మధుర స్వరమును కూడ ప్రసాదించి యుండెను. ఆమె దైవదత్తమగు ఆ గాన మాధుర్యముతో విను వారు కూడ తన్మయత్వము నొందునటుల జేయుచుండెను. ఆమెభక్తిగీతముల నీనాడును దేశమునందు భక్తులు పాడుచు, ఆమెను స్మరించుచు, జోహారుల నర్పించుచున్నారు.

అక్కమాదేవి శరణసతి-లింగపతి యను తత్త్వము ననుసరించి శ్రీశైల చెన్నమల్లికార్జునుని అనన్య భక్తితో వలచి, ప్రేమించి భజించి అతనియందే ఐక్యమైనదనునది ఆమె వచనముల వలననే తెలియుచున్నది. చెన్నమల్లికార్జునియందు తన అనన్యభక్తికి అడ్డుతగలనున్న వివాహమును, రాజభోగమును తృణీకరించిన వీర విరాగిణి ఆమె.

అక్కమహాదేవి వచనములయందు మధురభక్తి, మధురమిలన చింతయేగాక, భక్తి జ్ఞాన వైరాగ్యములకు సంబంధించిన సదాచారముల, షట్ స్థలములబోధకూడ ఎత్తి కనిపించుచున్నది. ఇది ఆమె వచనముల

యందలి వైశిష్ట్యత. ఈ విశేషమే, ఆమె చరిత్రను మీరాబాయిచరిత్ర కన్న మిన్న యొనర్చినది. సుమారు ఎనిమిదివందల సంవత్సరములు గడచినను, దేశమునందలి భక్తురాండ్రందరి చరిత్రలకన్న ఆమె చరిత్ర ఉన్నతముగా నున్నదనిన ఆమె వచనముల యందలి తాత్త్వికబోధ మరియు సాహిత్యపు విలువలే కారణమనవచ్చును. సాహిత్యపు విలువలను బట్టియే వ్యక్తియొక్క ఘనత శతాబ్దాల తరబడిగా చరిత్ర పుటలలో సంరక్షింపబడి యుండుననునది సుప్రసిద్ధ విషయము. మీరాబాయి కీర్తనలను "భక్త్యమృతపు బిందువులనిన, అక్కమహాదేవి వచనములను భావ గాంభీర్యము; విషయ నిరూపణము, లయ విన్యాసములు గల గీతము" లనవచ్చును.

## అక్కమహాదేవి - మాతామహాదేవి

మాతామహాదేవి ఆశ్రమ స్వీకారమునకు మొదట సుశిక్షిత శివభక్తుల ఇంట బుట్టిన సత్కాకుమారి. విద్యయందు సౌశీల్యమందు రూపమందు, ఆమెకు ఆమెయేసాటి. ఆమెతల్లిదండ్రులు, ఆమె తెలివితేటలను, ఆమె సద్భావమును చూచి ఆమె తమ నోములపంటయని యువ్వి ళూరుచుండిరి. కాని విధివిలాసము అందుకు వ్యతిరేకముగా నుండెను. బహుశ: ఆమె B. Sc. చదువుచుండెను; పూజ్యులు లింగానంద స్వాముల వారు ఆశ్రమ స్వీకారానంతరము, బసవతత్త్వ ప్రచారము చేయుచు ఒకనాడు మాతామహాదేవి పూరియందు అక్కమహాదేవి గురించి ప్రవచన మెనరించిరి. ఆప్రవచనము మాతా మనస్సును కదలించెను. రెండవరోజు మాతామనస్సులో పూర్తిగా సంసారభ్రాంతి వదలి నివృత్తి కలిగెను. అప్పుడు ఆమెకు సుమారిరువది సంవత్సరము లుండవచ్చును. ఆమె స్వయముగా పరిపక్వ జ్ఞానియయ్యే యుండెను. స్వాములవారి ప్రవచనము ఆమె జ్ఞానమునందు పరిపూర్ణతను కలిగించెను. మరునాడు మాతా

స్వాములవారి శరణుజొచ్చి తనకు లింగదీక్ష ననుగ్రహించుమని వేడెను. తాను సర్వసంగ పరిత్యాగియై ఆశ్రమస్వీకార మొనర్చి, అక్కమహాదేవి సందేశ ప్రచారము చేయుటకు సిద్ధముగా నున్నానని విన్నవించెను. ఆపుడునాడు మాతా తల్లిదండ్రులు వచ్చి నయ భయములతో ఎంత చెప్పి నను వినక, తన దృఢ నిశ్చయమును తెలిపెను. అక్కమహాదేవి, రాజ భోగములను, తల్లిదండ్రుల మమతను నిరాకరించి, తనను తరించు గురుదేవుని [ప్రభుదేవుని] వెదకుటకు ఉడుతడిని విడిచి పోయిన హృదయ విదారకమగు దృశ్యము అందరికి కన్నులకు గట్టినట్టులుండెను. ఆదృశము కొందరికి హృదయ విదారకముగను, మరి కొందరికి అవహేళనగను కనిపించెను. ఇది ఈశ్వర లీల! ఏ పనియైనను అందరికి రుచించదు. అందరికి ఏవగించదు. ఆ ఘడియనే మాతా, జీవనమందలి ముఖ్యమగు మలుపు. ఆమె ఆకారమున స్త్రీయైనను ఆత్మనిగ్రహమునందు, పౌరుషము నందు పురుషులకన్న మిన్న అనునది అందరి కప్పుడు తెలిసినది.

ఎందరేమన్నను, వినక మాతా శ్రీ గురువు నాశ్రయించి వారి శరణ తత్త్వ ప్రచారకార్యమందు వారికి సహాయకారిగానుండి, బసవ తత్త్వమును అక్కమహాదేవి వైరాగ్యమును, సౌశీల్యములను ప్రచారము చేయుచున్నారు. వారు ఇప్పుడొక గొప్ప ధర్మసంస్థను బెంగుళూరు సమీపమునందు తమ ఆధ్వర్యమున నడుపుచున్నారు. దేశమునందే గాక, అమెరికా మొదలగు విదేశములందును లింగతత్త్వసిద్ధాంతమును ప్రబోధించుచు, కీర్తిని ప్రఖ్యాతిని పొందుచున్నారు విదేశములందు శరణ తత్త్వ ప్రచారార్థము పోయిన ప్రప్రథమ మహా శివశరణి ఆమెయే.

కల్యాణమునందలి అల్లకల్లోలము తర్వాత ప్రభుదేవుని శిష్యపరంపర వారు, దేశమునందు నాలుగు విరక్త పీఠములను స్థాపించిరి. అటులనే మాతా, అక్కమహాదేవి పీఠమును ధార్వాడయందు స్థాపించి, ఆ

పీఠమునకు తామే మొదటి పీఠాధిపతియై జగద్విఖ్యాతియగుట మన సమాజమునకు ముఖ్యముగా స్త్రీ సమాజమునకు గౌరవ కారణ మన వచ్చును.

"నిన్న బుట్టిన శిశువు నేడే పెద్దయయ్యె", "జ్ఞానమునకు చిన్న పెద్ద గలదా", అనునట్లు మాతా మహాదేవి జగద్విఖ్యాతయై జగద్వంద్య యై అక్కమహాదేవి అపరావతారముగా ప్రసిద్ధియై ధర్మప్రచార కార్య మును చేయుచుండుట మన సమాజముయొక్క సుదైవమనవచ్చును. మాతా తన అనర్గళమగు వాక్ఝురిని, గంగా ప్రవాహమువలె సాగించుచు జనులను సదానందభరితుల గావించును. మాతా లేఖని ఒకసారి కదలిన వందలకొలది పుటలునిండినను నిలువదు. మాతాసాహిత్యసంపదఅపారము. అనేక అత్యుత్తమ గ్రంథములను, వెలువరించినది. అందు కొన్ని బహు మతులనందుకొన్నవి. అక్కమహాదేవి యందలి చిత్కళ, వైరాగ్య తేజ స్సు, సాహిత్య ప్రతిభ మాతా మహాదేవి రూపమున నేడు మనకు కనపడు చున్నదనిన అతిశయోక్తి గాదు. ఇంకను కొందరు మాతా మహాదేవి వలెనే రూపుగొనిన మన సమాజము గతవైభవమును మరల పొందుననుటలో సందేహము లేదు.

## హేమారెడ్డి మల్లమ్మ

అక్కమహాదేవి తర్వాత మన దేశమందలి వివిధ ప్రాంతములందు కొందరు మధుర భక్తివలనను, మరికొందరు అవ్యక్తమగు యోగిక శక్తి వలనను తమతమ ఇష్టదైవములను కీర్తించుచు, ధ్యానించుచు సాయుజ్య పదవిని బొందిన భక్తురాండ్రచరిత్రలు సుప్రసిద్ధములు. ఆ పరంపరలోని ఆధునికులగు హేమారెడ్డి మల్లమ్మ యానగొంది మాణిక్యమ్మ చరిత్రలు

అందరికి తెలిసినవే. హేమారెడ్డి మల్లమ్మ శ్రీశైల ప్రాంతమందుగల సిద్ధాపురమందలి భరమరెడ్డి ధర్మపత్ని. ఆమె గురు జంగమములయెడల దాసోహ భక్తిగల శీలవతి, పరమ పతివ్రత. ఆమెకు శ్రీశైల మల్లికార్జునుని ఎడల అనన్య భక్తి యుండెను. ఆమె అత్త వారింటివారు ఆమెను పరిపరి విధముల కష్టముల నొసగి బాధించినను, ఆమె శ్రీశైల మల్లికార్జునుని యందలి భక్తిని వదలక, తదేక ధ్యానము నందుండి, ఆ కష్టములను సహించుచుండెను. ఆమె భక్తికి ప్రసన్నతజెంది, మల్లికార్జునుడు సాయుజ్య పదవి నొసగెను. మల్లికార్జుని యెడల ఆమె భక్తికి చిహ్నముగా, మల్లికార్జునుని దేవాలయ ఆవరణమునందు, అక్కమహాదేవి ప్రతిమ ప్రతిష్ఠింపబడినటులే, హేమారెడ్డి మల్లమ్మ ప్రతిమ కూడ, ప్రతిష్ఠింప బడియున్నది. ఆమె మరిది వేమారెడ్డి కామపిపాసి, విషయ లోలుడు. అతనిని కామప్రవృత్తి నుండి తప్పించి, వైరాగ్యమును బోధించిన పరమ జ్ఞాని ఆమె. తత్ఫలితముగా వేమారెడ్డి వేమనయోగియై మహాకవియై వేలకొలది అనుభావ పద్యములను రచించి, ఆంధ్రసాహిత్యాకాశమునందు ధృవతారయై ప్రకాశించెను. అతని ప్రపంచానుభవము అపారము. అతడు తమ మతమగు వీరశైవము నందలి అనేక సూక్తులను తన పద్యములందు గూఢముగా రచించి, ఆ తత్త్వములందలి తన యభిమానమును తెలిపినాడు.

## యానగొంది మాణిక్య యోగిని

యానగొంది మాణిక్యమ్మ, ప్రస్తుతము సజీవముగా నున్న మన సమకాలీన యుగ యోగిని. ఆమె సుమారు నలుబది సంవత్సరములకు పూర్వము కర్ణాటక ప్రాంతమందలి మల్లాబాదయను గ్రామమందు శైవకాపు కుటుంబము నందు బుగ్గప్ప ఆశమ్మయను దంపతులకు జన్మించినది. ఆమె ఇతర పిల్లలవలె అల్లరులు జేయక, తల్లి అంకమునందు

దిగులు చెందక, శాంత స్వభావముతో శైశవదశను గడిపినది. బాల్య దశయందును తోడి పిల్లలతో ఆటలకు పోక, గంతులు వేయక, మౌనముగా నొకచోట కూర్చుండి ఏదో ధ్యానమునందు నిమగ్నయై యుండెడిది. ఆమె తల్లిదండ్రులు ఆమెను పశువులను కాయుటకు పంప మొదలు పెట్టిరి. ఆమె తోడిబాలుర పశువుల వెంబడి తమ పశువులను తోలి, తానొక చెట్టుపైన కూర్చుండియో లేక నొక దూర ప్రదేశమున కూర్చుండియో మౌనముద్ర యందు యుండెడిది. కొన్నాళ్ళకు ఆమె తల్లిదండ్రులు ఆమెకు వివాహ మొనరించి, అత్తగారింటికి పంపిరి. అచ్చటను ఆమె మౌనస్వభావమునందు మార్పు రాక పోవుటచే అత్తవారు ఆమెను తిట్టి కొట్టి ఆమె మౌనస్వభావమును మాన్పు ప్రయత్నము చేయ నారంభించిరి. ఆమె వారిదౌర్జన్యమునకు తాళజాలక, ఇల్లు విడిచి, అడవి యందలి గట్లపైననో చెట్లపైననో తన మౌనధ్యానమును సాగించుచుండెను. చివరకు ఆమె యానగొందిగట్టుపై బసచేసి ధ్యానధారణ సమాధిస్థితులయందుండి తన యౌగికశక్తిని, తపస్సిద్ధిని పెంచుకొనుచుండెను. అక్కడకూడ జనసమ్మర్దనము పెరిగి పోవుచుండుట వలన ఆ చోటును విడిచి ప్రస్తుతము కరీంనగర్ ప్రాంతమునందు తన యోగ సాధనను సాగించుచున్నది.

ఆమె తన భౌతికకాయమును శ్రీశైలక్షేత్రమునందు చాలించ దలంచినది. మన రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ టంగుటూరి అంజయ్యగారు అత్యంతభక్తిశ్రద్ధలతో, తగిన యేర్పాటులను, శ్రీశైల క్షేత్ర ప్రాంతమందు చేయించుట గొప్ప విశేషము. మాణిక్యమ్మగారు జగన్మాత అక్కమహాదేవి వలెనే తన అంత్యకాలమునందు శ్రీశైల క్షేత్రమునకేగి, అచ్చటనే శివసాయుజ్యమును పొందవలయునని కృతనిశ్చయురాలై యున్నట్లు తెలియుచున్నది.

## అక్కమహాదేవి - సాహిత్య ప్రతిభ

అక్కమహాదేవి ఇతర శివశరణుల వలనే వచనకర్త్రి, సాహిత్య నిర్మాత. ఆమె షట్స్థల వచనములనే గాక, సృష్టివచనములను, "యోగాంగ త్రివిధి" అను త్రిపది కృతిని మరియు రాగతాళ బద్ధములగు అనేక కీర్తనలను కూడ రచించినది. ఆమె 'అక్కన పీఠిక' అను మరొక ఉత్తమ గ్రంథమును కూడ రచించినటులు ప్రతీతి గలదు. కాని ఆ గ్రంథము లభించకపోవుట మన దురదృష్టకరము. ఆమె వచనములు కొన్ని మర్మగర్భితములుగా నున్నవి. లౌకిక పరముగాను ఆధ్యాత్మిక పరముగాను అర్థము చేయవచ్చును. మచ్చునకు—

''మూలాధారమను వేరును బట్టి, భూమండలము నెక్కి
ఆధారమను వేరును బట్టి ఐక్యస్థలముతుదిని జేరితి.
వైరాగ్యపు మెట్లులనెక్కి, శ్రీగిరిని జేరితి,
చై బట్టి లాగుకొనుమా, చెన్నమల్లికార్జునా !"

ఈ వచనమునకు సామాన్యమగు అర్థము కనిపించినను, ఇందు ఆమె శివయోగ మార్గమును తెలిపినది. మూలాధారమనగా చెట్టు మొదటి వేరనియు, మూలాధార చక్రమనియు తెలియవలయును. ఇటులనే వరుసగా షట్చక్రముల నధిరోహించుచు, చివరిదగు ఆజ్ఞా చక్రము, అనగా ఐక్యస్థలమును చేరితినని తెలిపినది.

"నేల మరుగుననున్న నిక్షేపము వలె
శిల మరుగుననున్న హేమము వలె
తిలల మరుగుననున్న తైలము వలె
ఫలము మరుగుననున్న రుచి వలె
తరువు మరుగుననున్న తేజము వలె
భావము మరుగున బ్రహ్మమైయున్న
చెన్నమల్లికార్జునుని ఉనికి తెలియరానిది"

"వనమంతయు నీవే, వనమందలి తరులన్నియు నీవే
తరులం దాడుచున్న, ఖగ మృగములన్నియు నీవే
చెన్న మల్లికార్జునా సర్వాభరితుండవై యుండియు
నాకేంమకు నీ ముఖమును జూపవయ్యా?"

ఈ వచనములందు ఆమె తరులు గిరులు మొదలగు నైసర్గిక పదార్థముల నుండి శివ సాక్షాత్కారమును బడయవచ్చునని, తన ధృఢ విశ్వాసమును తెలిపినది. ప్రకృతి సౌందర్యమును భక్తితో వర్ణించినది. ఆరాధించినది.

"హరిని మ్రింగెను మాయ, అజుని మ్రింగెను మాయ
ఇంద్రుని మ్రింగెను మాయ, చంద్రుని మ్రింగెను మాయ
ఎరింగితినను బలాఢ్యుల, మ్రింగెను మాయ
ఎరుంగలేని బడుగుల మ్రింగెను మాయ
ఈరేడు భువనంబుల నారడి పెట్టెను మాయ
చెన్నమల్లికార్జునా, నన్నీమాయ నుండి
తప్పించుము, కరుణించుము".

ప్రపంచమందలి మాయామోహములు బలవంతములైనవనియు, హరి బ్రహ్మాదులు కూడ ఆ మాయయందు సుడివడి యున్నారనియు, స్పష్టముగా తెలిపినది. అట్టి మాయాజాలమునుండి తనను కాపాడుమని తన ఇష్ట దైవంబగు చెన్న మల్లికార్జునని వేడినది. ఐనను, "అఖండ బ్రహ్మచర్యముతో, నిశ్చల మనస్సుతో చెన్నమల్లికార్జునుని నమ్మి అతని శరణు జొచ్చిన, ఆ మాయయే భయపడి నిలుచు'నని చెప్పి, మాయను జయించు మార్గమును తెలిపినది. 'మనస్సు నీయందు నిలిపిన, నాకిక భవముండునా ?" అని తన ఇష్టదైవమును అధికారవాణితో ప్రశ్నించి, తన నిశ్చలచిత్తమును తెలుపగలిగిన ధీరురాలు ఆమె.

ప్రపంచ సృష్టికి సంబంధించిన అనేక వివరములను, సూక్తులను తాను అనుభవమంటపమునందు గడించిన అనుభవజ్ఞానమును, తన వచనముల వలన బోధించినది. ఆమె వచనములు భక్తిజ్ఞాన వైరాగ్య బోధకములు, సాహిత్య ప్రతిభకు ఆకరములు. కనుకనే హరిహర మహా కవి ఆమెను "సాహిత్యనిధి" యని వర్ణించెను.

ఆమె తాను చెప్పదలచిన భక్తితత్త్వమును అనుభావజ్ఞానమును, వీరశైవమత సూత్రములను, సామాన్య జనులకు తెలియునటుల, సులభ శైలియందు సరళమగు కన్నడభాషయందు వచించినది. వినువారికి అర్థ మగునటులును, వారి మనస్సు నాకర్షించునటులును, నిత్యానుభవముగల ఉపమానములను సందర్భోచితముగా వాడి. తన వచనములకు వన్నె దెచ్చి నది. ఆమెకు సంస్కృత భాషయందు గొప్ప పాండిత్య ముండెననియు. ఆగమశాస్త్రములను అధ్యయన మొనర్చి యుండెననియు, తన వచనము లందు ఆమె ఉద్ధరించిన ఉద్ధరణముల వలన తెలియుచున్నది ఈ కారణ ముల వలననే. 'షట్స్థల చక్రవర్తి' చెన్న బసవేశ్వరుడు ఆమె వచనము లను ఇతర శరణుల వచనములతో పోల్చి, తులనాత్మక దృష్టితో చూచి విమర్శించి, అందరి వచనములకన్న, ఆమె వచనములు ఉన్నతముగా నున్నవని ప్రశంసించినట్లు అతని ఈ క్రింది వచనము వలన తెలియు చున్నది—

"ఆద్యుల అరువై వచనముల కన్న
దండనాయకుని ఇరువైవచనములు;
దండనాయకుని ఇరువైవచనములకన్న
ప్రభుదేవుని పదివచనములు;
ప్రభుదేవుని పదివచనములకన్న
అజగన్నగారి ఐదువచనములు;

అజగన్నగారి ఐదువచనములుకన్న
కూడలచెన్న సంగయ్య యందు
మహాదేవి అక్కగారి ఒక్క వచనము
నిర్వచనము, జూచితివా, సిద్ధరామన్నా!"

వచనసాహిత్య నిర్మాతయగు బసవన్న వచనముల కన్న, ప్రభుదేవుని వచనములకన్న, అజగన్న వచనములకన్న, అక్కమహాదేవి వచనములు నిర్వచనములని, అద్వితీయములని, చెన్నబసవేశ్వరునిచే పొగడ్తలనందినవి. అదిఆమె సాహిత్య ప్రతిభ. అక్కమహాదేవి యందలి సాహిత్యప్రతిభ, ఈవచనము నందును తెలియుచున్నది.

"గిరులందుగాక, కంచెలందాడునా నెమలి,
కొలనులందుగాక, కాల్వల జొచ్చునా కలహంస
మామిడి కొనలందుగాక కూయునా కోకిల
పరిమళములేని పూలపై ప్రాలునా తుమ్మెద
నాదేవుడు చెన్నమల్లికార్జునుడుగాక, అన్యుల
జేరబోవునా నామనసు; చెప్పరే అమ్మలారా!

ఈ వచనమునందు ఆమె నెమలి, హంస, కోకిల, తుమ్మెదలకు నైసర్గికవస్తువులతో గల స్వాభావిక సంబంధము తెలిపి; తనకును తన ఇష్టదైవంబగు, చెన్నమల్లికార్జునునకు గల సంబంధము జన్మతో గలిగిన సంబంధ మనియు తన మనస్సు చెన్నమల్లికార్జునునిగాక, అన్యుల చేరబోదనియు ఖండితముగాతెలుపుటకు ఆమె వివరించినఉపమాలంకారము వలన, ఆమె యందలి సాహిత్యప్రజ్ఞ ఉన్నత స్థాయిని చేరినది.

బసవేశ్వరుడు కూడ, కూడల సంగమదేవుని చింతనము తనకు స్వభావ సంజనితమనుటకును ఇట్టి ఉపమానములనే తెలిపి యున్నారు —

"చకోరమునకు చంద్రుని వెన్నెల చింత
కమలమునకు సూర్యోదయపుచింత
తుమ్మెదకు సువాసన గ్రోలుచింత
నాకు నాకూడల సంగమదేవుని తలచుచింత"

ఈ వచనమునందు, బసవని సాహిత్య కళ ఉన్నత స్థాయినందు కొన్నది. మహాశివకవి పాల్కురికి సోమనాధుడు, తన బసపురాణము నందలి ద్విపదలలో బసవని వచనములను అక్కడక్కడ కుదించుటయే గాక, అతని కొన్ని వచనములను యథాతథముగ వ్రాసిన నిదర్శనములు గలవు. కూడల సంగమ దేవునిపై బసవని భక్తి సహజసంబంధ మైనదని తెలుపుటకు పై అక్కమహాదేవి భావములను తన ద్విపదలలో ధ్వనింప జేసియున్నాడు.

"క్షీరాబ్ధిలోపల క్రీడించు హంస
గోరునే పడియల నీరు ద్రావంగ ?
జూతఫలంబులు చుంబించు చిలుక
భ్రాంతి బూరుగు మ్రానిపండ్లు గన్గానునే?
రాకామలజ్యోత్స్న ద్రావు చకోర
మాకాంక్ష సేయునే చీకటి ద్రావ?
విరిదమ్మి వాసన విహరించు తేటి
పరిగొని సుడియునే బిబ్బిలి విరుల"

సోమనాధుని తరువాత కవులు అనేక విషయములందు, ఆతనిని అనుకరించినటులు, సోమనాధుని ఈ భావములను గూడ తమతమ కావ్యములందు అనుకరించినటులు తెలియుచున్నది. అక్కమహాదేవి, బసవేశ్వరుని సాహిత్య ప్రతిభలు సోమనాధునిద్వారా తెలుగులోకమునకు ప్రాకుట గొప్ప విశేషమే!

## అక్కమహాదేవి - సంగీతకళ

అనేక శివశరణులు సంగీతమును కూడ నెరింగియుండిరని వారు రచించిన గీతములు, గేయములు తెలుపుచున్నవి శివశరణులు తమ సద్బోధనలు, జనసామాన్యమున కుపకరింప వలయునను నుద్దేశముతో తమ వచనములను సరళమగు దేశ (కన్నడ) భాషయందు వచించినటులే కొందరు సంగీతమును కూడ ఉపయోగించి వానిని రాగతాళ బద్ధములగు కీర్తనలుగా వచించియున్నారు. అటులనే అక్కమహాదేవియును రాగతాళ బద్ధములగు అనేక కీర్తనలను వచించియున్నది.[1] అందువలనఆమెసంగీత సాహిత్య కళల యందు సంపూర్ణత్వము నొందిన "కళాప్రపూర్ణ" యని అనవచ్చును అక్కమహాదేవి వలెనే బసవేశ్వరునకును సంగీతము తెలిసి యుండెనని, అతని వచనములకు కొన్నింటికి రాగములను సూచించి యున్నందున తెలియుచున్నది.[2] కనుకనే మహాశివకవి పాల్కురికి సోమ నాథుడు తన వృషాధిప శతకమందలి మొదటి పద్యమునందే అతనిని "కవిపండితగాయక చక్రవర్తి"యని కీర్తించియున్నాడు.

---

1 ఆమె గేయములను ప్రతిపదికృతిని అనువదించు ప్రయత్నము చేయ నందుకు పాఠకులు క్షమింపగోరుచున్నాను.

2 మావద్ద (వుంటాబజారు నందు) గల "బసవణ్ణన వచనగళు" అనునొక పురాతన వ్రాత (కాగితపు) ప్రతియందలి వచనములకు అక్కడక్కడ రాగములు సూచింపబడినవి. అందులో కొన్నిటిని క్రింద సూచించి యున్నాను.

| సంఖ్య | వచన సంఖ్య | వచన ఆది | రాగము |
|---|---|---|---|
| ౧ | ౬౨ | తనువినలొందిట్టు | మలహరి |
| ౨ | ౧౦౭ | గంధనమేలెస్నేహవిల్లద హెండతి | కాంభోజి |

## అక్కమహాదేవి - స్త్రీ సమాజము

అక్కమహాదేవి చరిత్ర వలన ఆమె స్త్రీ జాతిని దాస్యము నుండి విముక్తపరచి, సంపూర్ణ స్వాతంత్ర్యమును కలుగజేయుటకే యవతరించిన మహాదేవియేమోనని తోచును! ఈ విషయమునందు ఆమె చరిత్ర, ప్రపంచమందలి సాధ్వీమణుల చరిత్రలయందే మిన్నగానున్నదనవచ్చును.

"పితా రక్షతి కౌమారే, భర్తా రక్షతి యౌవనే,
రక్షంతి స్థావిరే పుత్రా న, స్త్రీ స్వాతంత్ర్య మర్హతి."

అను మనుస్మృతి చట్ట ప్రకారము. స్త్రీ కౌమారి దశయందు తన తల్లిదండ్రుల ఆజ్ఞలకును, గృహస్థ దశయందు భర్త యాజ్ఞలకును, చరమ దశయందు పుత్రుల యాజ్ఞలకును బద్ధురాలై యుండవలయునను, ఆచారము అప్పుడు కూడ నుండెను. ముఖ్యముగా వివాహ విషయమందు, తల్లిదండ్రుల మాటను కాదను అర్హత ఆనాటి స్త్రీ కి లేకనే యుండెను. ఆ యాచారమును ఆమె తిరస్కరించి, స్వతంత్రురాలై, వివాహమును నిరాకరించి, సామాజిక కట్టుబాట్లకు లోనుగాక, వీరవిరాగిణియై తాను మెచ్చిన చెన్నమల్లికార్జున మహాలింగమును భర్తగా భావించి, భజించుచు ధ్యానించుచు శివసాయుజ్యమును బొందినది.

---

| | | | |
|---|---|---|---|
| ౩ | ౨౭౯ | హృదయ కత్తిరి నాలిగె బెల్లంబో | ధన్యాసి |
| ౪ | ౩౧౦ | ఆడుదళవట్టిత్తు-హాడుదళవట్టిత్తు | భూపాళి |
| ౫ | ౪౮౪ | అంగై యోగణలింగ | లళితె |
| ౬ | ౫౫౯ | కురివిందుకబ్బిన ఉళివ | మాళవ గౌళ |

(అనువాదకుడు)

ఆమె సమకాలీనులగు బసవేశ్వరాదులు స్త్రీలకు పురుషులతో బాటు సామాజిక, ధార్మిక విషయములందు సమానతను, స్వాతంత్ర్యమును కలుగజేసినను వివాహ విషయమందు మాత్రము వారు అస్వతంత్రులు గానే యుండిరనవచ్చును. ఆనాడు వివాహమును నిరాకరించిన ఏ స్త్రీయైన ను సమాజమునందు నీతి బాహ్యురాలుగా, గౌరవ హీనురాలుగా తలంచ బడుచుండెను. కనుకనే అక్కమహాదేవి అనుభవమంటపమునందు ప్రవే శించగానే, ప్రభుదేవుని ప్రశ్న పరంపరలకు తట్టుకొని సమాధా నముల తెలుపవలసి వచ్చినది. ఆ సమాధానములు విన్న తదుపరి, ప్రభు దేవుడు ఆమె "కామ సంహారిణి" యనియు, "కళంకరహిత" యనియు "పరమజ్ఞాని" యనియు మంటపమందలి శరణులకు తెలిపి, ఆమెకు తన శరణులను తెలిపెను.

ఆమెవివాహనిరాకరణ ధార్మికతత్త్వము నీతిమార్గముపై ఆధార పడియున్నదేగాని అన్యము గాదు. "శరణసతి-లింగపతి", అను తత్త్వమును ఆమె అక్షరాల నమ్మినందున లౌకికముగా అవివాహితగా యున్నది. ఐనను తన ఇష్టదైవము యెడల పతిభక్తిని జూపి, అశ్లీలమగు ఆలోచనలకు గాని, నీతిబాహ్యమగు చర్యలకుగాని మనస్సును బోనివ్వక, తత్త్వజ్ఞ శిఖామణియై వీరవిరాగిణియై, విరాజిల్లినది. అట్టి అఖండ బ్రహ్మచర్యము సాధ్యము గానిచో, 'శరణసతి - లింగపతి', యను తత్త్వప్రకారమే తన భర్తను లింగస్వరూపము (దైవస్వరూపము)గా భావించి, భక్తిశ్రద్ధలతో, అతని (ఆరాధన) సేవయొనర్చి, శివసాయుజ్యమును బొందవలయునని ఆమె స్త్రీజాతికి ఉత్తమ సందేశ మొసగినది. "శరణసతి-లింగపతి', యను సూత్రమునను సరించియే,లింగధారులగు స్త్రీలు, తమ పతులు లింగైక్య మైనచో, వారు శ్రీగురు వనుగ్రహించిన కరస్థలమందలి ఇష్టలింగమందు

అడగియున్నట్లు భావించి; ఆ యిష్టలింగముద్వారా వారికి తమ పతిభక్తిని తెలుపుచు, లింగపూజాది సత్క్రియల నాచరించుచు సచ్చరిత్రులై, యుండవలయునని, ఆమె బోధించినది.

పతిని, పతి ఆస్తిని చేతబట్టుకొని అతనిబంధువులను చులకనగా చూచుటయేగాక, అతనిని గూడ నిర్లక్ష్యముగా చూచుచు, చివరకు అతని ఉనికినే పాటించని అతివలు నేడెందరో గలరు. అందుకు వారికి తమవారి సహాయము దొరికిన, వారి ఈ ప్రవర్తన మరింతధృఢమగును. ఐనను పతియే దైవమని భావించి భక్తితో సేవచేయుచు, అతని మాట మీరని పతివ్రతా శిరోమణులు దేశము నందీనాడును గలరు. అట్టివారి ఉనికి పావనమని, వారి చరిత్ర అనుకరణీయమని నేటి స్త్రీసమాజము గ్రహించిన జాలు. పతిభక్తియే పాతివ్రత్యమునకు మూలము.

ఆధునికులు కొందరు, పతిభక్తిని పతిదాస్యమని, అగౌరవమని పరిహసించి తమ అనభిజ్ఞతను వెల్లడి జేయుదురు. పతిభక్తియే లేక పోయిన పతియందు పత్నికి అధికారముగాని, పత్నియందు పతికి విశ్వాసముగాని ఎట్లుండును? దీనిని వారూహించ లేరు. భార్యాభర్తల కుండు పరస్పర ప్రేమ, భక్తి, విశ్వాసములు వారిరువురి మధ్య సమానతను సూచించునేగాని; ఒకరిది అధికారమనిగాని మరొకరిది దాస్యమనిగాని సూచించవు. ఈ సమానత్వసూచికముగనే, పత్నిని అర్థాంగి యందురు. నేడు అనేకులు ఈ ధర్మనిష్ఠను సామాజిక కట్టు బాట్లను పాటింపక భర్తల యెడల అలక్ష్య భావము వహించుటయే గాక, కొందరు అవివాహితలుగానుండి "కామాదిరిపుల" గెలువలేక అశ్లీలమగు ఆలోచనలకు, నీతి బాహ్యమగు చర్యలకు గురియై చరిత్రహీనులగుచున్న కథలెన్నియో వినబడుచున్నవి. కనుక అక్కమహాదేవి ఆచరణ రీత్యా తెలిపిన "శరణసతి - లింగపతి" అను సూత్రమునను సరించి నేటి స్త్రీ

సమాజము వైవాహిక జీవనమునందు, పతిభక్తి కలిగి, సాంసారిక జీవనమును, సుసూత్రముగా సాగించి, శివ సాయుజ్యమును బొందుదురని వినయపూర్వకముగా విశ్వసించుచున్నాను.

**అక్కమహాదేవి - వీర శైవము**

అక్కమహాదేవి ఇతర శివశరణుల వలెనే వీర శైవు లాచరించు క్రియాపద్ధతులను నిరూపించినది. అష్టావర్ణములందలి పాదోదక ప్రసాదముల వివరములను, వానిని సిద్ధపరచు విధులను, స్వీకరించు నియమములను, అర్పితానర్పిత పదార్థముల భేదములను, అనర్పిత పదార్థములు వీర శైవులకు వర్జితములనియు తనకొన్ని వచనములయందు వివరముగా తెలిపి యున్నది.

శ్రీగురు ముఖమునుండి తెలుసుకొని ఆచరింపదగిన ఏబదిరెండు ఆచార వివరములను దెలిపి, అట్లు అచరించనివారు "శివశక్తి, శివభక్తి, శివజంగమములన" బడుటకు అయోగ్యులని తెలిపినది.బసవన్న మొదలగు శివశరణములు అటుల ఆచరించియే నిరాఘారి వీర శైవులైనారనియును తెలిపినది.

ఈ సందర్భమునందు గురువు యెట్లుండవలయుననునది ఆమె, తన వచనమునందు తెలిపినది.

"అంతరంగమును శోధించి
బహిర్రంగమును శుద్ధపరిచి,
అంతరంగ బహిరంగములను రెంటిని విడిపించి,
స్ఫటికంపు శలాకవలే శుభ్రపరిచి
సుక్షేత్రమెరింగి, బీజమును నాటునటుల
శిష్యునియందలి ప్రాపంచిక ఆశను నివృత్తి పరిచి, ఆ

శ్రీశైలమందున్న కదళీవన పరిశోధనయందు



పరమహంస జగద్గురువు శ్రీశ్రీశ్రీ శివకుమార శివాచార్యమహాస్వాములవారికి
కనబడిన రెండవ కదళీవన దృశ్యము.

శ్రీశైలక్షేత్రమందలి కదళీవనమందు



ఎడమనుండి కుడికి

డా॥ హెచ్. తిప్పేరుద్రసామి ఎం.ఎ., పిహెచ్.డి.,
తరళబాళు జగద్గురువు శ్రీ శ్రీ శ్రీ శివకుమారశివాచార్యమహాస్వాములు
శ్రీ మహాదేవబణకార (కన్నడ కవులు)

శ్రీశైలక్షేత్రమునందలి కదళీవనము



సమీపమందున్న విస్తారమగు గుహ వెలుపలి దృశ్యము

శిష్యునకు నిజోపదేశ మొనరించి
నిజమార్గమును జూపును జ్ఞానగురువు.
ఆ సహజ గురువు జగదారాధ్యుడు
అతని పాదములకు నమోనమో యందును
గనుమా, చెన్న మల్లికార్జునా !"

భక్తులయందలి అజ్ఞానాంధకారమును బోగొట్టి, సుజ్ఞానజ్యోతిని వెలిగించి, భక్తుని మస్తకముపై తన హస్తమునుంచి, తనయందలి తపః శ్శక్తిచే అతనియందలి శివకళను ఇష్టలింగ రూపమున అతని అంగముపై ప్రతిష్ఠించి, కైవల్య పదవిని కరుణించు గురువునకు నమస్కరింతునని, గురువు లక్షణములను వివరముగా తెలిపి, అట్టి సహజ గురువే జగదారా ధ్యుడని జగత్పావనుండని తెలిపినది.

మర్త్యలోకమందలి మానవులు దేవుని సకల నిష్కలుం డనుచు, సూక్ష్మస్థూలుండనుచు, గనజాలక భవభారులగుటను జూచి, బసవన్న జగద్ధితార్థము అవతరించి, వీరశైవ మార్గమును జూపి వర్ణ, వర్గ, లింగ, వయో భేదములు లేక, అందరును షట్స్థల మార్గమునవలంబించి, శివసాయుజ్యమును పొందవచ్చునని, బోధించినటుల ఆమె తన వచనము నందు తెలిపినది—

అక్కమహాదేవి 'దివ్యజ్ఞాని' అనియు, 'వైరాగ్య చక్రవర్తిని' అనియు ఆమె అనుభవ వచనముల వలన తెలియుచున్నది. ఆమెకు గలిగిన జ్ఞానము 'సర్వం శివమయం జగత్' అను ఆత్మానుభూతి వలన గలిగిన పరమార్థ జ్ఞానము, అద్వైత జ్ఞానము. అద్వైతులు కొందరు, జ్ఞానులకు కర్మ లనావశ్యకమని వాదింతురు. వీరశైవులలో కూడ కొందరు, 'ఆరూఢ పంథము' వారు, జ్ఞానికి క్రియ లనవసరమని అందురు. కాని, ఆ దేవి, జ్ఞానము కలిగినను సత్క్రియలను, సదాచారములను వదలవల దని బోధించినది.

"జ్ఞానము స్వాయత్త మయ్యేనని
గురు లింగ జంగమముల విడువదగునా !
అఖండ జ్ఞానమయ్యేనని
పరస్త్రీ పరధనముల గోరవచ్చునా !
"యత్రజీవః తత్ర శివః" అను అభిన్న జ్ఞానమయ్యేనని
శునక, సూకర, కుక్కుట, మార్జాలములతో
కూడి భుజింపవచ్చునా ?"

అని ప్రశ్నించినది. ఆ యద్వైత జ్ఞానము అంతరంగమందలి అను భావమునకే గాని, బహిరంగముగా సత్క్రియల సదాచారముల నాచరించుట యందు అడ్డు రాకూడదని బోధించినది. "జ్ఞానము కలిగినదని, తన మనసునకొచ్చినటుల నడిచిన, నడివిన శ్వానయోనియందు పుట్టించక విడుచునా, చెన్న మల్లికార్జునుడు " అని కఠోరముగా శాసించినది!

"అంతరంగమందు జ్ఞానము కలిగిన నేమయ్యా,
బహిరంగమునందు క్రియ లేకున్న ?
దేహము లేకుండిన, ప్రాణమున కాశ్రయ ముండునా !
అద్దము లేకున్న తన ముఖమును గానగునా ?
సాకార - నిరాకారుండగు దేవు డొక్కడే
కూడల సంగమ దేవుడు"

అని, అంతరంగ బహిరంగములనునవిరెండు వేరువేరు గావనియు, అంతరంగమందలి జ్ఞానమును, బహిరంగమందలి క్రియలను సాధకుండు సమానముగా సాధించుచుండ వలయుననియు బసవేశ్వరుడు కూడ బోధించి యున్నాడు.

చెన్న బసవేశ్వరుడున, క్రియ- జ్ఞానములు రెండును సమానావశ్యకములనియు, ఒకటి లేకున్న మరొకటి నిరర్థకమనియు క్రింది వచనము నందు ఘంటా పథముగ బోధించినాడు.

"క్రియయే జ్ఞానము జ్ఞానమే క్రియ
జ్ఞానమనగా తేలియుట
క్రియయనగా తెలిసినటుల జేయుట
పరస్త్రీని సంభోగించరాదనునది జ్ఞానము
ఆటుల ఆచరించుటయే క్రియ
అటుల ఆచరించకున్న అదే అజ్ఞానము.
చూచితివా కూడలచెన్న సంగమ దేవా?"

క్రియా జ్ఞానములేకాక భక్తి కూడ సమానావశ్యకమని శరణులందరును బోధించియున్నారు. అక్కమహాదేవి.

జ్ఞానము కారణాంగమే భక్తి
భక్తి మహాకారణాంగమే జ్ఞానము.
భక్తి జ్ఞానమనునది కాకాక్షివలె,
భక్తి జ్ఞానమనునది నామోహంపు
చెన్నమల్లికార్జునివలె"

అని, క్రియాజ్ఞానములతోబాటు, భక్తి ప్రాధాన్యతను కూడ బోధించి యున్నది.

ఆమె మానవ దేహము హేయమని తెలిపి, "ఈ యొడలిని నమ్మి చెడకుము, ఓ వెర్రివాడా" అని బోధించినది. కాని శరీరము, అనిత్య మనియు, అప్రయోజకమనియు బోధించు శుష్కవేదాంతులవలె గాక; ఈ శరీరమును సదాచార సత్క్రియల వలన గాపాడుకొని, దానిద్వారా

శివసాయుజ్యమును పొందవలయునని వివరముగా బోధించినది. ఈ విషయమునే తనదొక వచనమునందు ''పాము కోరల దీసి పామునాడించ గలిగిన; పాములతో చెలిమియే లేసు,'' అని తెలిపినది. "దేహమందు పాముకోరవలె నున్న కామాది దుర్గుణములను వదలక దేహమును తిరస్కరించిన లాభమే"మని చక్కని ఉపమానముతో, శుష్క వేదాంతులకు బుద్ధి చెప్పినది. ఆమె సుబోధయందు ఇట్టి అపూర్వమగు ఉపమానము లెన్నియో గలవు. ఇది ఆమె ఆత్మ జ్ఞానమునకు, సాహిత్య ప్రతిభకు నిదర్శనము.

"ఒడలు లేని, నుడువ లేని, కడ లేని,
ప్రియతము నొడ గూడి సుఖినైతినయ్యా''

అని ఆమె నిరాకార శివునియందు ఒన గూడితినని తెలిపినది. ఐనను శక్తిసహిత శివునియందు గూడి సుఖినైతిననియే ఆమె భావము. ఈ భావమునే ఆమె

"జగదాది శక్తితో కలిసి
పలుకుచుండెడు పరమ గురువు
చెన్నమల్లికార్జునుని
నిలువునుగాంచి బ్రతికితి నేను,"

అను వచనమునందు వివరముగా తెలిపినది. "నశివేనవినా శక్తిర్న శక్తి రహితః శివః" అను శక్తి విశిష్టా ద్వైత (వీరశైవ మత) తత్త్వ ప్రకారము, శక్తితో కూడియున్న శివునియందు గలసి సుఖినైతినని వీరశైవ సిద్ధాంతమును బలపరచినది.

## అక్కమహాదేవి–అనంతరము.

కల్యాణనగరమునందు బసవేశ్వరుని బహుముఖసంస్కరణముల వలనను, లింగధారణముల వలనను, అనుభవమంటపము నందలి శివానుభవ గోష్ఠుల ప్రభావము వలనను, మానవ సమాజము నందు తర తరాలుగా నెలకొని యున్న వర్ణవిభేదము అస్పృశ్యత దూరమగుచు, సమసమాజము నిర్మాణ మగుచుండెను. అది చూచి ధార్మికముగాను, సామాజికముగాను, అధికారమును పొంది, మాయబోధలను చేయుచు, ప్రజలను మోసగించు ధర్మవంచకులుగల ఆనాటి సమాజమువారు, ఓర్వజాలక బసవేశ్వరుని విరుద్ధమును. శివశరణుల విరుద్ధమును కుట్రలు పన్నుట నారంభించిరి. హరళయ్య (అల్లయ్య) మధుపయ్యల బాంధవ్య ఫలితముగా ఆకుట్రలు సమసమాజనిర్మాణమునకు తిరుగుబాటుగా బాహాటమగు పోరాటరూపమును దాల్చెను. అందుకు రాజకీయ పైపోటి కూడ అనుకూలపడెను. బసవేశ్వరుడు అది తన అహింసా సిద్ధాంతమునకు విరుద్ధమని భావించి, కల్యాణమును విడిచి కూడలసంగమ క్షేత్రమునకు వెడలిపోయెను. బసవేశ్వరుడు కల్యాణమును విడిచి పోయిన తదుపరి, బిజ్జలుని హత్య జరిగెను. అప్పుడు చెలరేగిన హింసాకాండను రక్తపాతమును చూచి కల్యాణమునందు ఇక తమకు స్థానము లేదని భావించి, శివశరణులు నాయకుడు పోయిన సైనికులవలె, చెల్లాచదరయి, కల్యాణమును విడిచి గుంపులు గుంపులుగా పలు దిక్కులకు వెడలిపోవుట నారంభించిరి. అట్లు వెడలిపోయిన గుంపులలో నొకగుంపు చెన్నబసవేశ్వరుని నేతృత్వమున ఉళివి వైపునకు పోయెను. మరొకగుంపు ప్రభుదేవుని నేతృత్వమున శ్రీశైలప్రాంతమునకు పోయెను.

ఈ రెండు గుంపులును మార్గమధ్యమున అక్కడక్కడ సంఘర్షణల నెదుర్కొనవలసి వచ్చినందున, అనేక ప్రముఖ శివశరణులు అం

దేందు మరయుచుండిరి. చివరకు చెన్నబసవేశ్వరునిగుంపు ఉళివి చేరెను. చెన్నబసవేశ్వరుడు కొన్ని దినముల తర్వాత ఉళివి క్షేత్రమునందలి బిల్వ వనమున లింగైక్య మయ్యెను. ప్రభుదేవునిగుంపు శ్రీశైలక్షేత్రమును చేరెను. అక్కడ ప్రభుదేవుడును కదళీవనమందు లింగైక్యమయ్యెను. ఈ సంఘటన లన్నియును, బహుశః అక్కమహాదేవి కదళీవనమందు లింగైక్య మయిన కొన్ని నాళ్ళకే జరిగియుండునని ఊహించగలము.

కల్యాణమును విడిచి పోయిన శివశరణులు తమ తమ మార్గము లందు స్థిరనివాసము లేర్పచుకొనిన తావులందు, సత్య శుద్ధ కాయక ముల నవలంబించి, శివభక్తి ప్రచారము చేయుచు శివానుభావజ్ఞానమును బోధించుచు వీరశైవసంస్కృతిని అభివృద్ధి చేయుచుండిరి. ఈ ప్రకారముగా కల్యాణమందు ప్రారంభమైన శివభక్తి మార్గము దేశమునందంతటను వ్యాపించె ననవచ్చును ఉళివి ప్రాంతమునకు పోయిన గుంపులోని శివశరణులు కొందరు అప్పటి విజయనగరసామ్రాజ్య మందలి పంపా క్షేత్రమును చేరి అచ్చట శివభక్తి ప్రచారము జేయుచు హరిహరుడు, రాఘవాంకుడు మొదలగు కన్నడ మహాకవులకు, వారి వారి కావ్యము లకు కథాసామగ్రి నిచ్చి రనవచ్చును. అదే ప్రకారముగా శ్రీశైల ప్రాంత మునకు బోయిన వారిలో కొందరు శ్రీశైలక్షేత్రమునందు నివాస మేర్ప రచుకొని, యాత్రికులకు శివభక్తిని వీరశైవతత్త్వములను బోధించుటయే గాక మహాశివకవి సోమనాథుని కావ్యములకు ముఖ్యముగా అతని బసవ పురాణమునకు, పండితారాధ్య చరిత్రమునకు కథాసామగ్రిని తెలిసినట్లు అతడే తెలిపియున్నాడు. అంతేగాక ఆ యిరుగుంపుల వారిశిష్యప్రశిష్యులు వారివారికి అనుకూలమగు మార్గముల ననుసరించిరి. కొందరు దేవగిరి రాజ్యపరిపాలకులగు యాదవ రాజులకును, మరికొందరు ఓరుగల్లు రాజు లగు కాకతీయరాజులకును కులగురువులుగా నుండి ఆ యా ప్రాంతముల

యందు శివభక్తిని వీరశైవసాంప్రదాయమును అభివృద్ధి పరచిరను అంశ ములుకూడ చరిత్ర సమ్మతములే. ఓరుగల్లు చేరినవారిలో ముఖ్యముగా శివదేవుడు పదమూడవ శతాబ్దపు పూర్వార్థమున కాకతీయ సామ్రాజ్య ప్రభువగు గణపతిదేవునకు దీక్షాగురువుగా నుండి ఆ ప్రాంతమునందు వీరశైవధర్మమును అభివృద్ధిచేసె ననునదియును చరిత్ర సమ్మతమే!

## కదళీవనము—సంశోధనము

సర్పాకృతిగా నున్న పశ్చిమ పర్వతశ్రేణియందలి శ్రీశైలప్రదేశము అత్యంత ప్రాచీనమగు అటవీ ప్రదేశము. అచ్చట నున్న వనములు కనుమలు, బిలములు, లోయలు, మల్లలు, ఎల్లలు మొదలగు పర్వతాంగ ములు కూడ అంతే ప్రాచీనమైన మనవచ్చును. కనుక శ్రీశైలక్షేత్రము నందున్న కదళీవనము కూడ అత్యంత ప్రాచీనమైనవేనని వేరుగా చెప్ప నక్కర యుండదు. ఈ కదళీవనము అచ్చటి పవిత్ర వాతావరణము వలన పూర్వమునుండియు అనేక శివయోగులకును, మునులకును, తాపసు లకును, సాధు సత్పురుషులకును, తపోభూమియై యున్నట్లు అనేక శైవ, వీరశైవ గ్రంథముల యందును, ముఖ్యముగా పన్నెండవ శతాబ్దము నందలి శివశరణుల వచన సాహిత్యము నందును, ఉల్లేఖింప బడి యున్నది.

సుమారు ఇరువదియైదు ముప్పయైదు సంవత్సరములకు పూర్వము వరకు, శ్రీశైలక్షేత్రయాత్ర అత్యంతదుర్గమముగా నున్నందున, యాత్రికులు శివరాత్రి యుగాది, పర్వదినముల సందర్భములలో తప్ప శ్రీశైలయాత్ర జేయకుండిరి. అ పోయినప్పుడైనను, తమ తమ గుంపుల ననుసరించి నిర్ణీత మార్గములను విడిచి ఇటు నటు పోకుండిరి. కనుక యాత్రికులకు ఆ మహాక్షేత్రమునందలి ఇతర విశేషములనుగాని, పిన

శమునుగాని, పరిశోధించి కనగొను ప్రయత్నమును జేయుపట్టింపు గలుగకుండినది. అందుచే కదళీవనములు, అక్కమహాదేవి బిలములు గల నెలవులు జనులకు నికరముగా తెలియ కుండినవి. వివిధ గ్రంథములయందు వర్ణింపబడియున్న "తపోభూమి" యగు కదళీవనమును "గుప్త కదళి" యనుచుండిరి,

ఆంధ్రప్రదేశ రాష్ట్రమునందు న్యాయాధికారిగా నుండిన లింగైక్యులు శ్రీ T. H. M. సదాశివయ్యగారు ఆంధ్ర, కర్ణాటక, సంస్కృత భాషలయందు పాండిత్యప్రతిభ కలిగియుండిరి. శైవ వీరశైవ కృతులయందు 'కదళి' యనుపదము ఉల్లేఖింప బడియున్న దానిని చూచి, కదళీవనమను నొక తపోవనము శ్రీశైలక్షేత్రమునందు వుండి తీరవలయునను విశ్వాసమును బూని దానిని సంశోధించి కనుగొని యాత్రికు లచటికి పోవు దారిని ప్రకటింప వలయునను పట్టింపు ప్రప్రథమమున వారికి సుమారు ఇరువదిఐదు సంవత్సరములకు పూర్వమే కలిగెను.

లింగైక్యులు సదాశివయ్యగారు తమ సోదరులగు లిం॥ చంద్రశేఖరశాస్త్రి, మరియు అప్పుడు శ్రీశైలమల్లికార్జున దేవస్థానమునందు ప్రధానార్చకులుగా నుండిన లిం॥ సంగనబసవయ్యగారల సహకారముతో కదళీవనాన్వేషణమును ప్రారంభించిరి. స్థానీయ నివాసులగు చెంచురాజుల సహాయ్యమునుగొని అత్యంత ప్రయాసమున కోర్చి, శ్రీశైల పర్వత పశ్చిమదిశయందు, అనేక శతమానములనుండి, చేతనాత్మతముగా నున్న కదళీవనమును కనగొని వివిధకృతులందు వర్ణింపబడియున్న కదళీవన మిదేనని నిర్ణయించి తమ పరిశోధన ఫలితమును కన్నడ పత్రికలయందు ప్రకటించిరి. లిం॥ సదాశివయ్యగారి పరిశోధన వలన కదళీవనము ప్రకాశమునకు వచ్చినను అక్కమహాదేవి ఐక్యస్థల

మగు "అక్కనగవి" అక్కమహాదేవి బిలము పరిశోధనీయముగానే యుండినది

లిం॥ సదాశివయ్యగారు కదళీవన పరిశోధన గురించి, చేసిన పరిశ్రమను తరళుబాళు జగద్గురువులు శ్రీ శ్రీ శ్రీ శివకుమార శివాచార్య మహాస్వాములవారు తెలుసుకొని హర్షించి ఆ సంశోధనను ముందుకు సాగించుచు అంతవరకు బైట బడని స్థలములను, సంగతులను కనుగొన వలయునను నుద్దేశముతో లిం॥ సదాశివయ్యగారి పరిశోధనానుభవములను తెలుసుకొని "సిరిగెరె శివానుభవ ప్రవాససమితికి" నేతృత్వము వహించి తేది 13-4-61నాడు కదళీవన ప్రవాసమును ప్రారంభించిరి. పూజ్యులు లింగానంద స్వాములవారును కూడ ఈ పరిశోధన యాత్ర యందు వెళ్ళియుండిరి. వారు ఆ యాత్రా సమాచారమును అక్కడ చూచిన విగ్రహములను అక్కమహాదేవి బిలమును, కదళీవనమును తాము ప్రకటించిన "అక్కన ప్రవచన" మను కన్నడ గ్రంథమునందు వివరముగా తెలిపి యున్నారు.

ప్రవాసికులు సిరిగెరెనుండి 13-4-61నాడు బయలుదేరి ఆరోజు సాయంత్రము శ్రీశైలక్షేత్రమును చేరిరి. కదళీవనము అక్కడికి పడమటి దిక్కున నున్నను నేరుగా పోవుమార్గము లేనందున, వారు వాయువ్య మార్గము ననుసరించి, మార్గమధ్యమున గల "పంచ మఠములు", "హర శయ్య మంటపము", "చుక్కల పర్వతము" దాని కొనయందుగల "జాతర రేవు"ను చూచును, "అక్కన హళ్ల" (బుగ్గ వాగు) ఒడ్డునకు చేరిరి. అక్కడికి సుమారు అరమైలు దూరమునగల 'అక్కనగవి' (అక్కమహాదేవి బిలము)ని చూచిరి. ఆ బిలము ముందట విరియ బోసిన వెండుకలతో కప్పబడిన అక్కమహాదేవి ప్రతిమను జూచి; అదియే అక్కమహాదేవి తపస్సుచేసిన బిలమని వారు తలంచిరి. ఆ బిలముదగ్గ

రనే వీరభద్రుడు. పార్వతి, పరమేశ్వరుడు మొదలగు దేవతల సుందర విగ్రహములు, అస్పష్టముగా నున్న మరికొన్ని విగ్రహములు గలవనియు వారు తెలిపియున్నారు.

ఈ బిలము ప్రవేశద్వారము ఇరు ప్రక్కలయందు విస్తారముగా నుండి సుమారు నూరు గజముల పొడవుగా నున్నది. ఎడమవైపు కొంత దూరము సేరుగా పోయినచో ఆ దారి ఇరుకుగా నుండి ఎడమ వైపునకు మరలును. అందు నొక వేదికపై కొంతవరకు లింగాకారమును పోలి యున్న గచ్చుముద్ద యొకటి వారికి కనిపించినది. అనేక శతమానముల కాలగర్భమునందు జీర్ణమగుచు నిలిచియున్న ఆబిలము, అద్భుతమును, ఆశ్చర్యమును కలుగజేయునట్టి ప్రకృతి వస్తువులలో నొకటియని ఆ ప్రవాసికులు గ్రహించినట్లు తెలిపియున్నారు. ప్రవాసికులు అక్కమహాదేవి బిలమును చూచి, అటునుండి ప్రభుదేవుడు వర్ణించిన "త్రికూటగిరి" నెక్కి అక్కమహాదేవి ఐక్యస్థలమగు కదళీవనమును చూచిరి. ఈ కదళీ వనము "త్రికూటగిరి" కొట్ట కొనయందున్న బట్ట బయలులో చిట్ట చివర యందు గలదు. ఈ కదళీవనము అందలి బిలము మధ్యభాగము నుండి పారుచున్న రెండు నీటిజాలలచే రక్షింపబడుచున్న సుమారు ముప్పది అరటి చెట్ల గుంపుగా నున్నదని వారు తెలిపియున్నారు. ఈ అరటిచెట్లను పరీక్షించి చూచి, అవి తెల్లని 'రసబాళ' జాతికి చెందినవని తెలుసుకొన్నట్లు కూడ తెలిపియున్నారు. ఈ బిలముపైన సుమారు వంద ఏబది గజముల పొడవును, డెబ్బది గజముల వెడల్పునుగల ఒకే ఒక పరుపురాతిబండ గలదు. ఆ పరుపురాయి అడుగుభాగము పొరలు పొరలుగా, ఆ బిలము నందలి నేలపై రాలినందున ప్రభుదేవుడు సూచించినదియు అక్కమహాదేవి "భవహర గంటి" నన్నదియు నగు లింగము అచ్చట కనుపించుట లేదని వారు తెలిపిరి.

ఆ తర్వాత ప్రవాసికులు, ఆ కదలీవనము చుట్టుముట్టును తిరిగి పరిశీలించిరి. అక్కడికి దక్షిణ దిశయందు సుమారు ఒక మైలు దూరమున ఇరువది ముప్పది అరటిచెట్లుగల మరొక కదలీవనము వారికి కనుపించెను. ఇది ఈ ప్రవాసికుల పరిశోధన ఫలితముగా అగుపడిన రెండవ కదలీ వనము. ఇచ్చటినుండి సుమారు ఒక మైలు దూరమున పది–పదియైదు చెంచు గుడిసెలుగల "లింగభేరిహళ్లి" అను నొక పల్లె వున్నట్లు వారు కనుగొనిరి ఆ మార్గమునన్లే అనుసరించుచు పోయిన, మార్గమధ్యమున (బొమ్మ చెరువు) భ్రమరాంబ చెరువు, అప్పాపురము, వుల్లా పల్లె ఫర్తాబాద, మొదలగు గ్రామములు కలియుననియు; హైద్రాబాద నుండి శ్రీశైలమునకు వచ్చుమార్గము. ఈ ఫర్తాబాద వద్దనే కలియుననియు; ఈ దారి హైద్రా బాద నుండి వచ్చు యాత్రికులకు, నేరుగా కదళీవనమునకు పోవుటకు అనుకూలముగా నుండుననియు వారు తెలిపిరి. కదళీవనమునకు పోవు ఈ రెండవ మార్గముకూడ ఈ ప్రవాసికుల పరిశోధనా ఫలితమనవచ్చును. ఈ పరిశోధనా నంతరము శ్రీశైలక్షేత్రమునకు పోయిన యాత్రికులలో కొందరు కదళీవనము, అక్కమహాదేవి బిలము మొదలగు చారిత్రక ప్రదేశములను కూడ దర్శించి వచ్చుచున్నారు.

కదలీవనము రెండవ దారి అంతును తెలుసుకొని, ప్రవాసికులు తిరిగి "అక్కనహాళ్ళ" ఒడ్డునకు వచ్చి అక్కనగవి కొండపై నెక్కి చూడగా, ఆ ప్రక్కన శిథిలావస్థ యందున్న కొన్ని రాతిగోడలు వారికి కనుపించెను. వారు అచ్చటికి పోయి చూడగా ఆ గోడలమధ్య నొక లింగ మున్నట్లును, దాని సమీపముననే నొక భిన్నమైన బసవన్న శిలాస్థంభ మున్నట్లును వారికి కనిపించినది ఆ స్థంభమును పరీక్షించి చూడగా అది కేవలము శిలా స్థంభమే గాక, అదొక ముఖ్యమగు శిలాశాసనమని కూడ వారు గ్రహించిరి తెలుగు భాషయందున్న ఈ శిలా శాసనము అత్యంత ముఖ్యమగు ఐతిహాసిక విషయమును సూచించు చున్నదని వారు తెలుసు

కొనిరి. ౧౩ వ శతాబ్దిని పూర్వార్థమున ఓరుగల్లు రాజ్యము నేలిన కాకతీయ వంశపు రాజగు గణపతిదేవుని ( 1199 - 1261 ) దీక్షాగురువగు, శివదేవుని గురించిన ఉల్లేఖన మా శాసనమునందు గలదనియు, "కదళీ వనమందు తపస్సు జేయుచున్న శివదేవయ్యగారు ఈ మఠమును కట్టించిరి" అని ఈ శాసనము యొక్క స్థూలసారాంశమనియు వారు గ్రహించినట్లు తెలిపియున్నారు. ఈ నూతన శిలాశాసనమును కనుగొనిన శ్రేయస్సు శ్రీ శ్రీ శ్రీ తరళబాళు జగద్గురువుల వారికి చెందినది. పురాతత్త్వ శాఖవారు గమనించి ఆ శిలాశాసనమును భద్రపరచవలయునని మనవి.

ఈ శివదేవయ్యగారు ఓరుగల్లు కాకతీయుల కులగురువుగా నుండి, ఆ ప్రాంతమునందు వీరశైవ ధర్మమును ప్రసరింప జేసిన చారిత్రక పురుషుడు. ఇతడు కల్యాణమునందలి "అనుభవ మంటపము" మాదిరిగా "విద్యా మంటపము" అను పేరుతో నొక సంస్థను ఓరుగల్లునందు ప్రారంభించి, ఆ సంస్థకు అధ్యక్షత వహించి ఆంధ్ర ప్రాంతమునందు వీరశైవ ధ్వజము నెగురవేసిన శ్రేయస్సును పొందియుండెను. అంతేగాక అతడు "పురుషార్థ సారము", "శివదేవ ధీమణి శతకము", "పరతత్త్వ రసాయనము" మొదలగు అనేక ఉత్తమ గ్రంథములను రచించియున్నాడు. ఇట్టి ఉజ్జ్వల వ్యక్తియగు శివదేవయ్య కదలీవనమునందు తపస్సు జేసి, అనుభవజ్ఞానము నార్జించి రనియు "అక్కన హళ్ళ" ఒడ్డు నందొక మఠమును కట్టించి యుండిరనియు పై శాసనమువలన తెలియుచున్నది. ఈ శాసనము, కదలీవనము అస్తిత్వము గురించి అత్యంత బలవత్తరమగు ప్రమాణమని చెప్పవచ్చును.

## కదళీవనము - దాని అస్తిత్వము

కదళీవనము యొక్క అస్తిత్వమునకు చాలినన్ని భౌగోళిక వివరములు స్పష్టమగు చరిత్ర, పరిశోధనా ఫలితాంశము లుండగా

శ్రీశైలస్థలపురాణమును వ్రాసిన వ్యాకరణవిద్యాప్రవీణ ఉభయ భాషా ప్రవీణ మొదలగు బిరుదాంకితులు శ్రీ పోతుకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రి గారు, ఒకే ఒక వాక్యమునందు (కదళీవనము) "ఇది విశ్వసింప దగినది కాదు. అని శ్రీశైలస్థలపురాణము(పుట246-247) నందు వ్రాయుట విచిత్ర ముగానున్నది. అంతటి ప్రతిభావంతులగు పండితవర్యుల కిది శోభనీ యముగా నుండదని నా మనవి. శ్రీశైలస్థలపురాణము నందు ఈ విషయ మును వ్రాయుటకు పూర్వము, అక్కడి స్థలీయులగు వారిని, ముఖ్యముగా శ్రీశైల మల్లికార్జున దేవస్థానము నకు అప్పుడు ప్రధానార్చకులుగా నుండిన లిం॥ శ్రీ సంగనబసవయ్యగారిని విచారించి గాని, శ్రీశైలసూర్య సింహాసనాధీశ్వరులగు జగద్గురువులు శ్రీశ్రీశ్రీ వాగీశ శివాచార్యమహా స్వాములవారిని సందర్శించి గాని, లేక సంస్థానము ఏజంటుగారిని జూచి గాని కదళీవనమును గురించిన వివరములను తెలుసుకొను ప్రయత్నమును జేసియుండిన వారిగ్రంథమునకు ఈ న్యూనత కలుగకుండెడిదని నా భావము. కనీసము 1964నందు ప్రకటింపబడిన "శ్రీశైలదర్శిని" యందలి వ్యాసములను చూచియుండినను, బాగుండెడిదని నాయభి ప్రాయము. శ్రీ శాస్త్రిగారు తమ గ్రంథమునందు కదళీవనముల గురించి వ్రాయుచు "వేరు వేరుగా నివి చాల గలవు" అనియు "ఇవి తొమ్మది యని శ్రీపర్వత పురాణ మనుచున్నది" అని క్రింది పద్యమును ఉద్ధరించి యున్నారు.

"తొమ్మిది కదళీ వనములు
తొమ్మిది పురములును నదులు దొమ్మిది బిలముల్
తొమ్మిది యమృతపు బావులు
తొమ్మండ్రు పురాధిపతులు దోర్బలయుక్తుల్".

ఈ పద్యమునందు కదళీవనములేకాక, పురములు, నదులు, బిలములు, అమృతపు బావులతో బాటు పురాధిపతులు కూడ తొమ్మిది సంఖ్యయందే

కలకని తెలుప బడినది. అనగా కదళీవనములు శ్రీశైలక్షేత్రము నందు గలవనియే ఈ పద్యముయొక్క తాత్పర్యముగదా! ఐనను శాస్త్రిగారు "ఇది శ్రీశైలముదగ్గఱ (12 మైళ్ళలో) నున్నదందురు. "ఇది విశ్వసింప దగినది కాదు" అని వ్రాసినందున, శాస్త్రిగారి అభిప్రాయము శ్రీ పర్వత పురాణము నందలి పద్యము విశ్వసింప దగినది కాదనియా? లేక శ్రీశైలము దగ్గఱ (12 మైళ్ళలో) కదళీవనము గలదను జనవాక్యము విశ్వసింప దగినది కాదనియా? తెలియుట లేదు. ఒకవేళ జనవాక్యము విశ్వసింప దగినది కాదనునదే వారి యభిప్రాయమైనచో ప్రవాసికులు తెలిపిన మార్గము ననుసరించి స్వయముగా పోయిచూచి విశ్వసింప వచ్చునుగదా! లేక శ్రీపర్వతపురాణమునందలి పై పద్యమే విశ్వసింప దగినది కాదనునదే వారి యభిప్రాయ మైనచో తా ముద్ధరించిన పద్యమునే తాము విశ్వసింపదగినది కాదనుట మిక్కిలి విచిత్రముగా నుండును. మీదు మిక్కిలి కదళీవనము గలదను జనవాక్యమును, ఆ పద్యము సమర్థించుచున్నది.

పై పద్యమునందు తొమ్మిది కదళీవనములతోబాటు తొమ్మిది బిలములుకూడ నున్నవని చెప్పబడియున్నది. శాస్త్రిగారికి ఆ బిలముల విషయమునందు యెట్టి సంశయమును రానట్లు తెలియుచున్నది. శ్రీశైల స్థల పురాణము నందు అక్కమహాదేవి బిలమును గురించి వ్రాయుచు 'ఈ బిలముశ్రీశైలమునకు పదిమైళ్ళ దూరమున నున్నది' అని వ్రాసి యున్నారు. కదళీవనమును, అక్కమహాదేవి బిలమును కనుగొన బోయిన "శివానుభవ ప్రవాస సమితి" వారు కూడ నిటులే తెలిపియున్నారు. ఆ బిలము పరిసరమునందే కదళీవనము గలదని వారు తెలిపి యున్నారు. వారు కూడ రెండు కదళీవనములను, రెండు బిలములను కనుగొని రెండవ కదళీవనము సమీప మందున్న రెండవ బిలమునందే అక్క-

మహాదేవి లింగైక్యమయ్యెనట్లు తెలియు చున్నదని తెలిపినారు, శాస్త్రి గారు, కొంచ రనుచున్నారు' అని వ్రాసిన వివరములతో ప్రవాస సమితి వారు ప్రత్యక్షముగా చూచి తెలిపిన వివరములు సరిపోవుచున్నవి. గనుక శాస్త్రిగారు కదళీవనవిషయమునందు సంశయ పడుట అనావశ్యక మని నా మనవి.

శాస్త్రిగా రింతటితో విడువక 'కదళీవన మిదయే యది యైన దీనిని గాంచు విధమును శ్రీపర్వతపురాణమిట్లు వచించినది అని ఈ క్రింది పద్యమును వ్రాసియున్నారు.

"శ్రీ మల్లికార్జును సేవించి పూజించి
యా దేవదేవుని యాజ్ఞపూని
శుక్ల పర్వతమున శుద్ధాత్ముడై నిల్చి
పంచోపచార ప్రపంచరచన
సర్వలోకాధీశు శంభు నారాధించి
కదళీ వనంబు నీ గతిన తెలిసి
యైరావతీనది నభిషిక్తుడై కల్ప
సరణి లక్షత్రయీ జపముచేసి
మంత్ర సంసిద్ధుడై భక్తి మార్గ నియతి
నిత్యలింగార్చన క్రియా నిరతితోడ
సాధకోత్తముఁ డత్యంత సహజ భక్తి
లీల నేతెంచి కనుఁ గదలీవనంబు"

శాస్త్రిగారి పై వాక్యమునందు కూడ ఇది, అది, అను సర్వ నామములు దేనిని సూచించుచున్నవో విస్మయముగా నున్నది. పైవాక్య మువలన శాస్త్రిగారి యభిమతమునందు కదళీవనము లున్నవనియా? లేక లేవనియా? లేక వున్ననను అవి విశ్వసనీయములు గావనియా? స్పష్టముగా

తెలియుటలేదు. వారు పైన ఉద్ధరించిన రెండవపద్యమునందు కూడ కదళీవనములు లేవనిగాని, అవి విశ్వసనీయములు గావనిగాని తెలుప బడలేదు వానిని కనుగొనుటకు ఒక క్రమమును సూచించినట్లు తెలియు చున్నది. ఏ క్రమముతో చూచినను, ఉన్న వస్తువులే కనిపించును గాని లేని వస్తువులు కనిపించవుగదా! ఒక వస్తువును చూచుటకు, చూచువారికి చూచుశక్తి, (అనగా దృష్టిబలము), ఆ వస్తువు కనుపించుటకు అవసర మగు వెలుతురు; (అనగా ప్రకాశము) మరియు ఆ వస్తువు యొక్క స్వరూపజ్ఞానము (అనగా ఆవస్తువు అస్తిత్వ విశ్వాసము) ఈ మూడును అవసరము. అనేక గ్రంథములలో వర్ణితమై యున్న కదళీవనముల స్వరూపములను విశ్వసించి అవి వున్నవని నిరూపించిన, స్థలమును నిర్ణయించి వెదుకుచు బోయిన అవి కనుపించుననుటలో సందేహము నుండదు. ఈ ప్రకారముగనే ఇంతవరకు పరిశోధించినవారు శ్రీశైలపర్వ తారణ్యమునందు గల కదళీవనములను కనుగొన గలిగిరి. అంతేగాక కదళీవనము యొక్క అస్తిత్వమును తెలుపునట్టి శాసనమును కూడా ఆ స్థలమునందే వారు కనుగొన గలిగిరి,

శ్రీపర్వతపురాణమునందలి పై పద్యమునందు వచింపబడిన విధానము ఆధ్యాత్మికమగు భక్తిమార్గము ననుసరించి యున్నది. అందు లోపమేమియులేదు! పూర్వకాలమునందు శ్రీశైలమేకాదు, కదళీవనమే కాదు, ఏ క్షేత్రయాత్రకు పోయినను, యాత్రికులు కీర్తన, భజన, ప్రార్థన, అర్చనలు చేయుచు దైవచింతనముతో, సద్భావముతో పోవు చుండుట యాచారముగా నుండినది. అట్లు పోవు క్రమమునే కొంచెము యించుమించుగా పై పద్యమునందు తెలుపబడినది. భౌగోళిక స్థలములను, భౌతిక పదార్థములను, యే యుద్దేశముతో చూచినను అవి కన్పించుట సహజము, నిస్సంశయము పుణ్యక్షేత్రములను సద్భావము సద్భక్తితో చూచిన అవి పవిత్రమగు దేవస్థానములుగను, లేకున్న అవి శిలా ప్రతిమల ఆవాసములుగను తోచును.

శ్రీశైలక్షేత్రమందలి కదళీవన మార్గమున అక్కమహాదేవి గవిక్రింది



భాగమందలి అక్కవాగు ప్రక్కననున్న శివదేవయ్య మఠము అవశేషము

శ్రీశైలక్షేత్రమందలి కదళీవన మార్గమందు



శివదేవయ్యా మఠావశేషములలో కనబడిన శిలాశాసనము.
"కదళీవనమందు తపస్సు చేయుచుండిన శివదేవయ్యా
ఈ మఠమును కట్టించె"నని దాని స్థూల సారాంశము.
శ్రీమదుజ్జయని సధర్మసింహాసనాధీశ్వరులు
తరళుబాళు జగద్గురువు శ్రీ శ్రీ శ్రీ శివకుమార శివాచార్య
మహాస్వాములవారి పరిశోధనయందు
**16-4-1961** నాడు దొరికినది.

పూర్వకాలము నందు నేటి ప్రయాణసౌకర్యములు సౌలభ్యములు లేనందున, యాత్రికులు ఆత్మబలమును ఆత్మసాక్షాత్కారమును పొందుటకు ఆవిధమగు నియములను పాటించు చుండుట పరిపాటి గానుండినది. నేటి భౌతికయుగమునందు ఆత్మశక్తి, ఆత్మసాక్షాత్కారములు అవసరములేకయే సాధన సంపత్తులతో, వైజ్ఞానిక పరికరముల సహాయముతో నభోమండలమందలి తారా మండలముల పైకి కూడ ఎగిసి పోవుచుండుట మనము చూచుచునే యున్నాము. ఇట్టి పరిస్థితులలో కదళీవనములు శ్రీశైలఖండాదులయందు పేరొ్కన బడినను, మంత్ర సిద్ధులు కాని వారికవి యదృశములను, వాదన సయుక్తిక ముగా నుండదేమో నని నేను తలంచుచున్నాను. ఏవి దృశ్యములో అవి కొందరికి అదృశ్యములగుననుట ఏవి అదృశ్యములో కొందరికి అవి దృశ్యములగు ననుట నేటి వైజ్ఞానిక యుగమునందు విశ్వసింప దగినదిగాదని తోచుచున్నది.

శ్రీ శాస్త్రిగారు అల్లమప్రభువు (ప్రభుదేవుని) కాల నిర్ణయము గురించి శ్రీశైల స్థలపురాణము (పరిచయము ౪౬) నందు వ్రాయుచు "నేటి చారిత్రికుల కాల నిర్ణయమును బట్టి చూచిన, నితడు బసవేశ్వరుని కాలమున నున్నాడని తెలియవచ్చును. బసవేశ్వరుడు 1168 లో మరణించి నాడు. కావున నీతని కాలము 12 AD అని మనవారి నిర్ణయ" మని వ్రాసియు; వెంటనే, "ఇది విశ్వసనీయము గా" దని వారు వ్రాసిరి.

బసవేశ్వరుడు, అల్లమప్రభువు వీరిరువురును సమకాలీను లనుటకు చాలినన్ని ఐతిహాసిక ప్రమాణములే కాక, వారిరువురును ఒకరి నొకరు సంబోధించుకొని నటుల తమ తమ వచనములందు వచించి యున్నారు. శ్రీ శాస్త్రిగారు, అల్లమప్రభువు బసవేశ్వరుని సమకాలీను డనునది "విశ్వస నీయము కా"దనియు, మీననాథుని కాలమే యీతని (అల్లమప్రభువు) కాలమనియు, వ్రాయుటకు వారు, "నవనాథ చరిత్ర", "నారద

పురాణము", "కథా సరిత్సాగరము" లందలి కొన్ని కథలను (పు ౪౫ – ౪౮) వ్రాసి యున్నారు.

ఖచ్చితమగు ఐతిహాసిక ప్రమాణములను విశ్వసింపక, ఊహాపోహలతో గూడిన కథల నాధారముగా గొని, చారిత్రక పరిశోధకుల నిర్ణయమును 'విశ్వసనీయము గా' దనుటకు గల ప్రబల కారణములేవో వారు తెలుపవలసి యుండెను. భౌగోళిక అస్తిత్వముగల పురాతన (చారిత్రక) అవశేషములుగల కదలీవనమును మరియు చారిత్రక పరిశోధకులు సహేతుకముగా నిర్ణయించిన అల్లమప్రభువు కాల నిర్ణయమును విశ్వసనీయములుగావని వ్రాయుట "బహుముఖ ప్రజ్ఞావంతులగు" శ్రీ శాస్త్రిగారికి శోభాయమానముగా నుండదని నా మనవి.

వీరశైవాచార్యులకును, శివయోగులకును, శివశరణులకును పూర్వకాలమునుండియు శ్రీశైలమహాక్షేత్రము ఆవాసమై అత్యంతసన్నిహిత సంబంధము కలిగియున్నదని, శాసనాధారము లున్నను, ఐతిహాసిక ప్రమాణము లున్నను ప్రత్యక్ష అవశేషములున్నను శ్రీ శాస్త్రిగారు ఒకే ఒక వాక్యముతో వాని నన్నింటిని కాదనినట్లు కదలీవనము లున్నవనునదియును అల్లమ ప్రభువు బసవేశ్వరుని సమకాలీనుడను నిర్ణయమును విశ్వసింపదగినవి కావను అభిప్రాయమును శ్రీశైలస్థలపురాణము నందు తెలుపుట శోభింపదు.

శివం - సత్యం - సుందరం

ప్రస్తుత నివాసము
4-7-916/2, ఇసామియా బజారు
హైద్రాబాదు-500 027, ఆం. ప్ర
5-12-1981.

శరణ చరణ రేణువ
రేకళిగె మఠం వీరయ్య

# శ్రద్ధాంజలి



(ఎడమనుండి కుడికి)

రేకళిగె మఠం సిద్ధయ్యగారు

జననము ఐక్యము

( ? ) 1919

గొల్లపల్లి మూలమఠం బసవయ్యగారు

జననము ఐక్యము

( ? ) 1916

# భక్త్యంజలి



(కుడినుండి ఎడమకు)

## బసవతీర్థమఠము వైరాగ్య చెన్న బసవ స్వాములవారు

వీరు కళ్యాణముదగ్గరి బసవతీర్థమఠాధిపతులు. వీరు విరక్తాశ్రమమును స్వీకరించి, శ్రీశైలమందు తపస్సిద్ధిబొంది, స్వస్థానమునకు బోవుచు శంషాబాదయందు నివసించిరి. ఆ ప్రాంతమందలి జనులకు అనుభావజ్ఞానోపదేశము జేయుచు ప్రఖ్యాతి జెందిన తపోధనులు.

## ఆలంపల్లి విరక్తమఠము బసవప్రభుస్వాములవారు

వీరు వికారాబాద దగ్గరి ఆలంపల్లిమఠాధిపతులు. వైరాగ్య చెన్న బసవస్వాములవారిచే అనుగ్రహము బొందిన చరమూర్తులు. అల్వాల పల్లాలచమ్మన్న భక్తికి మెచ్చి తీర్థప్రసాదముల ననుగ్రహించి బసవేశ్వ

రాదుల అస్పృశ్యజనోద్ధరణను గుర్తుకుదెచ్చిన అనుభావధనులు. వీరి శిష్యులు శ్రీమన్నిరంజన శంకరస్వాములు గొప్పపండితులు చరమూర్తులు

## లింగైక్యులు కుంకుమశోభిత చెన్నబసవమ్మగారు

వీరు రేఖశిగెమఠం సిద్దయ్యగారి పుత్రి. గొల్లపల్లిమూలమఠం బసవయ్య పత్ని. వివాహానంతరము తమ తండ్రిని భర్తను దుఃఖసాగరమున ముంచి శివసాయుజ్యము నొందిన పుణ్యజీవులు (వీరు అనువాదకుని పెద్దతల్లి)

## రేకళిగె మఠం సిద్ధయ్యగారు (ఉందాబజారు-హైద్రాబాదు)

వీరు బీదరుదెగ్గరి రేకశిగెమఠమువారు. వీరి తాత గురువయ్య సుమారు రెండువందలఏండ్లకు మొదలు హైద్రాబాదులో నివసించి శిష్యులకు సదాచారమును బోధించుచుండిన ధర్మజీవులు. వీరికుమారుడు వీరయ్య వ్యవహారమును వృత్తిగాగైకొని సత్యశుద్ధజీవనము గడిపిన ధన్యజీవులు. వీరి కుమారుడు సిద్దయ్య ఉద్యోగమును కాయకముగా గ్రహించి పాయెగాఖజానాలో చేరిరి ప్రభువుల అనుగ్రహముచే సదర్ పోతేదార్, గా సేవించుచు సుమారుఎనుబదిఏండ్లవయస్సున సిద్ధార్థిచైత్ర బహుళ (1919)మందు శివసాయుజ్యమొందిన కీర్తిజీవులు. (వీరు అనువాదకుని పెంపుడుతండ్రి)

## గొల్లపల్లి మూలమఠం బసవయ్యగారు.

వీరు రేకశిగెమఠం సిద్ధయ్య మేనల్లుడు. వీరితండ్రి సిద్ధయ్య శంషాబాధలో శివైక్యముకాగా, మేనమామ తమపోషకత్వ మందుఃంచుకొని పెంచి విద్యాబుద్ధుల నేర్పించిరి. తాముద్యోగమందున్న ఖజానాలో వీరికి ఉద్యోగ మిప్పించిరి. వీరు తెలుగు, కన్నడము, ఉర్దు, పార్సీలను నేర్చియుండిరి. అధికారులు మన్నించి వీరిని 'సదర్‌ఖజానేదార్'గా నియమించిరి వీరు 1916నందు తమపై ఆశలనిలుపుకొన్న మేనమామను తల్లిని దుఃఖాబ్ధియందు ముంచి శివైక్యమొందిన వినయజీవులు. (అనువాదకుడు వీరికి రెండవ భార్య కుం॥ సిద్దమ్మ వలన కలిగిన పుత్రుడు)-



సర్వాభరితుండగు

శ్రీశైల చెన్న మల్లికార్జునుడు

శివాయనమః

# అక్కమహాదేవి వచనములు

## భక్తస్థలము

౧

నేల మరుగున నున్న నిక్షేపమువలె
ఫలము మరుగున నున్న రుచివలె
శిలల మరుగున నున్న హేమమువలె
తిలల మరుగున నున్న తైలమువలె
తరువు మరుగున నున్న తేజమువలె
భావము మరుగున బ్రహ్మమై యున్న
చెన్నమల్లికార్జునుని ఉనికి తెలియరానిది.

౨

నన్ను నే నెరుగక మున్ను
నీ వెందుంటివో తెలుపుమయ్యా?
సువర్ణమందలి వర్ణమువలె
నాయందు నీవుంటివయ్యా!
అయ్యా! నా యందుండియు
కనుపించని భేదము మీయందు గంటి
గనుమా చెన్నమల్లికార్జునా!

౬

పాలయందలి నెయ్యి వేరు కాగలదా!
సూర్యుని కాంతి యందున్న యగ్ని నెవరు
వేరు పరచ గలరు?
అపారమహిమా, చెన్నమల్లికార్జునా!
నీవు నా యందు కూడియున్న విధమును
వేరుగా నిదే జూచి కన్ను దెరచితి నయ్యా!

౭

నారింజ, మామిడి, నిమ్మ, మాతులుంగములకు
పుల్లని నీరును బోసిన వారెవరయ్యా!
అరటి, పనస, కొబ్బరి, చెరుకులకు
తియ్యని నీరును బోసిన వారెవరయ్యా!
వరి, సామ, గోధుమలకు
అన్నోదకముల బోసిన వారెవరయ్యా?
మరువము, మల్లె, పచ్చ, కాళలకు
పరిమళోదకమును బోసిన వారెవరయ్యా?
ఇట్లు జలమొకచే, తలమొకచే, మొగులొకచే
ఒకేజలము కొన్నివస్తువులను కూడి
తన విధమును వేరుగా నొనర్చుకొనినటులు
నాదేవుడు చెన్నమల్లికార్జునుడు
అనేకజగముల కూడుకొని యున్న నేమి?
అతని తీరే వేరు!.

౫

కాయమునకు ఛాయయై పీడించెను మాయ
ప్రాణమునకు మనసై పీడించెను మాయ
మనసునకు స్మృతియై పీడించెను మాయ
స్మృతికి జ్ఞానమై పీడించెను మాయ
జ్ఞానమునకు అజ్ఞానమై పీడించెను మాయ
జగమందలి జనసమూహమునకు
అగ్నిబాణమై పీడించెను మాయ
చెన్నమల్లికార్జునా! నీవు పుట్టించిన
మాయ నెవరు గెలువగలరు?

౬

హరిని మ్రింగె మాయ, అజుని మ్రింగె మాయ
ఇంద్రుని మ్రింగె మాయ, చంద్రుని మ్రింగె మాయ
ఎరింగితి మను బలాఢ్యుల మ్రింగె మాయ
ఎరుగలేని అజ్ఞానుల మ్రింగె మాయ
ఈరేడుభువనంబుల వారడిపెట్టె మాయ
చెన్నమల్లికార్జునా! నన్నా మాయనుండి
తప్పించుము, కరుణించుము.

౭

విడిచెదనన్న విడువనీయ దీ మాయ
విడువకున్న వెన్నంటి యుండు నీ మాయ

యోగికి యోగిని యయ్యె నీ మాయ
తాపసికి తపస్విని యయ్యె నీ మాయ
శ్రవణునకు శ్రవణి యయ్యె నీ మాయ
ఐన ఈ మాయకు నే భయపడు దాననా !
చెన్నమల్లికార్జునా నీ యాన?

౯

లేదనిన కలదను నీ మాయ
వలదనిన వదల దీమాయ నాకిది విధియా?
చెన్నమల్లికార్జునయ్యా! ఆ మాయ
నొప్పుకొని నీ శరణు జొచ్చిన
ఇక నుండునా ఆ మాయ
కావుమయ్యా శివధో,! శివధో!.

౧౦

నా మాయామదము నణచుమయ్యా!
నా కాయమందలి చీకటిని బారద్రోలు మయ్యా!
చెన్నమల్లికార్జునయ్యా! నన్ను చుట్టి యున్న
ప్రపంచమును విడిపించు మయ్యా! నీ దయ.

౧౦

చూచితిననిన చూపు మరుగు పడియె
కూడితిననిన భావము మరుగు పడియె

ఏమందు నేమందు నయ్యా!
ఎరింగితి ననిన మరుపు మరుగుపరిచెను
నీ మాయ నధిగమించుట కలవియా?
కావుమయ్యా చెన్నమల్లికార్జునా!.

౧౧

నాకాయము మట్టి బొమ్మ
నా జీవము బట్టబయలు
దేవా, దేనిని జట్టుదు నయ్యా నేను ?
ని న్నేతీరున స్మరింతు నయ్యా నేను ?
ఈ మాయనుండి తప్పించుమయ్యా
ఓ చెన్నమల్లికార్జునా! నీదయ.

౧౨

వెనుక ఏరు ముందు కోనేరు
నిన్ను చేరు టెటులు, తెలుపుమా ?
వెనుక నుయ్యి ముందు గొయ్యి
పదిల మెటు లుండును తెలుపుమా ?
నీవు పెట్టిన మాయ నన్ను చంపుచున్నది
కావుమయ్యా ! కావుమయ్యా !
చెన్నమల్లికార్జునా !

౧౩

ఉన్నదొక తనువు ఉన్నదొకమనసు
నిన్నేమనసుతో ధ్యానింతునయ్యా ?

సంసారము నే మనసునందు
తల్లీన మొనర్తునయ్యా
కటకటా చెడితి, చెడితి
ఇహమునకుగాక పరమునకుగాక
రెంటికిని చెడిన రేవడివలె
బిల్వ కపిత్థముల నొకటిగా తలంచవచ్చునా
చెన్నమల్లికార్జునా!

౧౪

పంచేంద్రియములు, సప్తధాతువులు, అష్టమదములు
చంపి చూచెనుగదా!
హరిబ్రహ్మాదుల బలమును ద్రుంచి
చంపి చూచెనుగదా!
మహాఋషుల తపస్సును భంగపరచి
చంపి చూచెనుగదా!
చెన్నమల్లికార్జునుని నమ్మి శరణని
అతనిమరుగు జొచ్చినందున
ఆ మాయయే భయపడి నిలచెగదా!

౧౫

పశువు కొకచింత, కసాయి కొకచింత
ధర్మిన కొకచింత, కర్మిన కొకచింత
నాకు నా చింత, తనకు తన కామపు చింత

ఒల్లనుపో, కొంగువీడుము మూర్ఖుడా!
చెన్నమల్లికార్జునదేవుడు
వలచునో వలవడో యను చింత,

౧౬

గుండునెత్తిన బెట్టుకొని, కడలిలో మునిగిన
ఇడుములకు కడయుండునా, అమ్మా?
కుడిచి ఆకొంటి ననిన భంగపడుదును
కన్నతావులకెల్ల మనసు బోయిన
చెన్నమల్లికార్జునయ్యా ఎటులవలచునమ్మా?

౧౭

అయ్యా! నిన్ను చేరియుచేరదు చూడుము నా మనసు
ఉదు కెక్కి తడబడుచున్నది నా మనసు
నగరిసుంకరి వలె, తగవులాడుచున్నది నా మనసు
రెండనువది మరచి శూన్యముగాదు నా మనసు
నీవు, నేనగు విధమెటులో తెలుపుము
అయ్యా! చెన్నమల్లికార్జునా!

౧౮

ఎల్లప్పుడు నామనసు ఉదరపోషణకై
ప్రాకులాడుచుండును
కానలేనయ్యా నిన్ను భేదించ లేనయ్యా నీ మాయను.
మాయసంసారమునందు చిక్కుకొంటిని

ఓ దేవా. చెన్నమల్లికార్జునా ।
నిన్ను చేరునట్లు చేయుమయ్యా! నీ ధర్మము.

౧౯

మనసు మనసుతో తర్కించి చూచి
అభానువియగుటకు
జ్ఞానమే ఘనమగును గాని
పరిమితి యందుండునా? అది,
ఓ తల్లీ నీవు వెర్రితల్లివే నా దేవుడు
చెన్నమల్లికార్జునుని వలచి
నేనతనిపై మరులు కొందితిని
నీ తల్లితనము నేనొల్లను పోవే।

౨౦

ఊరు నడుమ నొక శికారి పడియుండెను
ఎవరైనా చూచిన చూపుడయ్యా!
ఊరికి మొరపెట్టెద, తలుపు పెట్టెద
వెదకెదను నా శికారిని
తెలిసియో తెలియకనో ఒక వేట నాడితిని
వెదకి ఇమ్మా చెన్నమల్లికార్జునా!

౨౧

రాళ్ళను జొచ్చిన, రాళ్ళను రావించితివి।
గిరుల జొచ్చిన, గిరుల దొరలించితివి

బాపురే! ఈసంసారము
తరతరలానుండి వచ్చినది
చెన్నమల్లికార్జునయ్యా!
నేనేమందు! నేమందునయ్యా!

౨౨

పాడుసంసారము వెన్నాదలక
హింసించుచున్నదయ్యా! ఏమందు నేమందునయ్యా!
అందందు గలుగుచున్న వ్యసనమునకు
నేనేమందు నేమందునయ్యా!
ఈపాడుదేహమును గాపాడుటకు
నేనేమందు నేమందునయ్యా!
చెన్నమల్లికార్జునయ్యా!
చంపుము, బ్రతికింపుము - నీధర్మము

౨౩

సంసార మనునది శత్రువయ్యా!
ఓ తండ్రీ! నావంశవంశమును తప్పక
వెదకికొనుచు వచ్చుచున్నదయ్యా!
వెదకి వెదకి చిక్కించుకొని నన్ను చంపుచున్నదయ్యా!
నేను నీ శరణు జొచ్చితిని కావుమయ్యా!
నావిన్నప మవధరింపు మయ్యా! చెన్నమల్లికార్జునా!

౨౪

తనువు నందలి శక్తిని తగ్గించెను
మనసువందలి విరక్తిని తప్పించెను
ఘనమును గన నటు లొనర్చెను
పరమజ్ఞానులనే పీడించెను
చెన్నమల్లికార్జునయ్యా! నీమరుగున
నున్న సంసారము తెర, నన్ను నీదరి జేర నీదయ్యా!

౨౫

నేపుట్టినపుడు సంసారము పుట్టెను
సంసారము పుట్టినపుడు అజ్ఞానము పుట్టెను
అజ్ఞానము పుట్టినపుడు ఆశపుట్టెను
ఆశపుట్టగానే కోపము పుట్టెను
కోపాగ్నియొక్క తామసపు ధూమము
చుట్టుకొనగా నేను నిన్ను మరచి
భవదుఃఖమునకు గురియైతిని
కరుణించి నన్నెత్తుకొని నామరుపును తప్పించి,
నీపాదమును జూపుమయ్యా, చెన్నమల్లికార్జునా !

౨౬

పొయ్యి జొచ్చి మంట లమరచినదాన
మలను జొచ్చి మాటనుమరచినదాన
సంసార సంబంధమును చూడుమా !

## భక్తస్థలము

సంసార సంబంధము
నన్ను భవ భయములందు వెన్నువీడదు
శబ్దము నిశ్శబ్దము లోక మైవదానను
నాయందేమి చూచెదరయ్యా
చెన్నమల్లికార్జునయ్యా !

౨౭

అకటకటా ; సంసారమను నాటకము
నా యెదుటవచ్చి ఆడెనుగదా !
అప్పాబొప్పా యమవేషము
మొట్టమొదటవచ్చి యాడినది
నెయ్యిబూసిన మీసములుఁగల వేషము
నట్టనడుమ వచ్చి యాడినది
ముసలి ముసలియను వేషము
కట్టకడకువచ్చి యాడినది
మీరుచూచుట ముగియగా నే
జగన్నాటకమే ముగిసెను
చూచితివా చెన్నమల్లికార్జునా !

౨౮

నాకెందులకయ్యా ఈప్రపంచపు బొమ్మ
మాయామలభాండము చలనపు భవనిలయము
జలకుంభమునుండి నీరుకారుచుండెడి
నెలవు నాకెందులకయ్యా !

వ్రేళ్ళతో తాటిపండును పిసికిన తినవచ్చునా?
చిత్తమంతయు జీవమని ఒప్పనివిధము నాకయ్యెనా!
నాతప్పు నంగీకరించుడు, చెన్నమల్లికార్జునదేవుడు
మీరే అన్నలారా!

౨౯

తన వినోదమునకు తానెపుట్టించెను సకలజగత్తును
తన వినోదమునకు తానె బుట్టించెను
సకలప్రపంచమును
తన వినోదమునకు తానె తిరిగించెను
అనంతభవదుఃఖములలో
ఇట్టి నాచెన్నమల్లికార్జునుడను పరమశివుడు
తన జగద్విలాసము చాలైనచో, మరల
తానే మాయాపాశమును ఛేదించును.

౩౦

రారానిభవములందు వచ్చితినయ్యా!
కడలేని తాపములందు కనలి నీ
కరుణగోరి దరిజేరితి నయ్యా! ఈ
కారణమున ఓదేవా చెన్నమల్లికార్జునా!
తనువు నీకనువై మనసునీపై మరులు జెంద
మత్తులేని తమకపుస్నేహమునకు
తెర వింకెక్కడిది చెప్పుమా! తండ్రీ!

౬౧

పుట్టరాని యోనులందు పుట్టించి
రారానిభవములందు రప్పించి
తినకూడని తిండిని తినిపించి
విధికి లోనుగా జేయును, వినుడన్నా !
తనవారనిన మన్నించునా !
తనవద్దనున్న భృంగి తోలును
వొలిచి ఆరాటపెట్టినవాడు
మరికొందరి నేమరునా?
దీని నెరింగి వదలకు వదలకు
చెన్నమల్లికార్జును డింతటి విచిత్రు డమ్మా !

౬౨

పట్టుపురుగు తనజిగురుచే
ఇల్లు జేసుకొని తననూలును తనచుట్టు
చుట్టుకొని చచ్చునటులు
మనసొచ్చినదానిని గోరి కనలుచున్ననయ్యా ! నా
మనమునందలి దురాశను మాన్పి నీదరి
జేర్చుకొనుమా చెన్నమల్లికార్జునా !

౬౩

అమేధ్యపుకడవ, మూత్రపుబుడిగె
ఎముకల తడక చీముబుడ్డ

కాలిపోనీ, ఈ దేహము
ఈ ఒడలిని నమ్మి, చెడకనుండుము
చెన్నమల్లికార్జునుని దెలియని వెఱ్ఱివాడా !

౩౪

ఒకటిగాదు రెండుగాదు
మూడుగాదు, నాలుగుగాదు,
ఎనుబదినాల్గు లక్షల యోనులనుండి
వచ్చితిని వచ్చితిని
రారానిభవముల ననుభవించితిని
వానిసుఖాసుఖములు
వెనుకటి జన్మల యందేమైనగాని
ముందుకు నీవుకరుణించుమో
చెన్నమల్లికార్జునా !

౩౫

చెడకే చెడకే మృదు నడుగుల నిడుకొనవే!
దృఢముగాదు ఈయొడలు చూచితివా !
దృఢముగాదు ఈ సంసారసుఖము చూచితివా !
చెన్నమల్లికార్జునుడు వ్రాసిన అక్షరము
చెడకముందే శరణను వేవేగ !

౩౬

మట్టిపెల్లవలె కరిగికరిగి, ఇసుకదిబ్బవలె జరిగి జరిగి
కలలో కలవరపడి నేను వెరగొందితి

ఆవములోని నిప్పువలె చుట్టిచుట్టి కందితిని
ఆపదలో ఆప్తుల నెవరిని గాన
వెదకి గానని తనువును కలసిన కూడనిసుఖమును,
నాకు కరుణించుమో చెన్నమల్లికార్జునా !

౩౭

ఆలింపుము నా విన్నపము, లాలింపుము నా విన్నపము
పాలింపుము నా విన్నపము,
ఏల నామొరను వినవయ్యా తండ్రీ
నీవుగాక వేరేలేరు వేరేలేరు
నీవే నాకు గతి నీవే నాకు మతి
అయ్యా ! చెన్నమల్లికార్జునయ్యా

౩౮

గుంపును వదలి పట్టుబడిన కుంజరము
తానున్న వింధ్యను తలచునట్లు తలచెదనయ్యా!
బంధింపబడిన చిలుక తన
బంధువులను తలచునట్లు తలచెదనయ్యా!
'బిడ్డా నీవిటురా' అని నీవు నీదయను
చూపుమయ్యా చెన్నమల్లికార్జునా!

౩౯

లోకపుచేష్టలకు రవి బీజమైనటులు
కరణముల చేష్టలకు మనసే బీజము

నాకు గలదొక్క మనసు
ఆ మనసు నీ యందు చిక్కినచో నాకిక
భవముండునా, చెన్నమల్లికార్జునా.

౪౦

సంసార సంగమందుంటిని చూచితివా నేను!
సంసారము నిస్సారమని చూపెను శ్రీ గురుడు!
అంగవికారపు సంగమును నిలిపి
లింగమును నా అంగముపై నిలిపెను శ్రీగురుడు!
వెనుకటి జన్మల తప్పించి
ముందుకు పథమును జూపించెను నా తండ్రి!
చెన్నమల్లికార్జునుని నిజమును
జూపెను నా గురుడు.

౪౧

పృథ్వి పృథ్విలో కలువక మున్న
జలము జలములో కలువక మున్న
తేజము తేజములో కలువక మున్న
వాయువు వాయువులో కలువక మున్న
ఆకాశము ఆకాశములో కలువక మున్న
పంచేంద్రియము లన్నియు చీలికలై వేరుగాక మున్న
చెన్నమల్లికార్జునికి శరణనుడోయి!

౪౨

లోపల శోధించి వెలుపల శుద్ధిపరిచి
లోపల వెలుపలయను, ఉభయ శంకలను దూరపరిచి
స్ఫటికపుశలాకవలె తలక్రిందుగా జేసి
సుక్షేత్ర మెరింగి విత్తనము నాటునటులు
శిష్యుని సర్వప్రపంచమునుండి నివృత్తి పరిచి
నిజోపదేశ మొనరించి సత్యమూలమును
ఆ శిష్యునకు జూపును జ్ఞానగురుడు
ఆ సహజగురుడప్పుడు జగదారాధ్యుడు
అతని శ్రీపాదములకు 'నమోనమో' యందును
కనుమా చెన్నమల్లికార్జునా!

౪౩

సద్గురుడు శిష్యునకు అనుగ్రహము చేయునపుడు
ఆ శిష్యుని మస్తకముపై తన శ్రీహస్తము నుంచి
లోహముపై పరుస ముంచినటు లయ్యె నయ్యా!
శోభించునటులు నొసట విభూతిపట్టము గట్టగా
ముక్తిసామ్రాజ్యమున కాధిపత్యపు పట్టము
గట్టినటు లయ్యె నయ్యా!
సద్యోజాత వామదేవ అఘోర తత్పురుష ఈశాన మను
పంచకలశములతో అభిషేకము జేయగా; శివుని

2)

కరుణామృతరసము కురిపించినటు లయ్యె నయ్యా!
సమకూడిన శివశరణుల నడుమ మహాలింగమును
కరతలామలకముగా శిష్యుని కరస్థల మందుంచి
అంగమునందు సుప్రతిష్ఠించి ప్రణవపంచాక్షరి
మంత్రోపదేశమును కర్ణమునందు ఒనరించి
కంకణము కట్టగానే కాయమే కైలాస మయ్యె
ప్రాణమే పంచబ్రహ్మమయలింగ మయ్యెను
ఇట్లు వెనుకటి అవస్థల తప్పించి
ముందుకు ముక్తిమార్గము జూపిన
శ్రీగురుసాన్నిధ్యము వలన నే బ్రతికితి నయ్యా!
చెన్నమల్లికార్జునా!

౪౪

కలవాడు పాతర దీసి గింజల బెట్టువరకు
బీదవాని ప్రాణము పోయినటు లయ్యె
నీవు గారించి చూచుట నాకు విధియా చెప్పుము తండ్రీ!
ముగ్గురు రౌతులు పరుగు లిడుచుండ
ఆ కాలి గాలి ధూళి ఎగిరినటు లయ్యె
నన్ను నీ వేవిధమున కరుణింతు వయ్యా
చెన్నమల్లికార్జునా!

౪౫

నీరక్షీరమువలె నీవుంటివి గాన
ఏది మొదట ఏది తుది అని అరయను

ఏది కర్త్రి యేది భృత్యు వని అరయను
ఏది గొప్ప ఏది కొద్ది అని అరయను
చెన్నమల్లి కార్జునయ్యా! నీవు వలచి
కొనియాడిన చీమ రుద్రుడు గాదా!

౪౬

వెదకి శరణన్న కాపాడునట్టి గురవే
జయజయ గురువే జయజయ గురవే!

ఎవ్వ రెరుంగజాలని, శూన్యమందు
శూన్యమై నిలిచిన తీరును
బట్టి దెచ్చి నాకరమునందు జూపిన గురవే
చెన్నమల్లి కార్జున దేవా! గురవే!
జయజయ గురవే! జయజయ గురవే!

౪౭

నిత్యము నా ఇంటికి నడచి వచ్చెను నేడు
ముక్తి నా ఇంటికి నడచి వచ్చెను నేడు
జయజయా, శివశివా, హరహరా!
గురవే నమో పరమగురవే నమో!
చెన్నమల్లి కార్జునుని జూపిన
గురవే నమో నమో!

౪౮

శ్రీగురులింగదేవుడు తన హస్తమును
నా మస్తకముపై నుంచి నంతనె

నా భవము నాస్తి యయ్యెను
నన్ను తనవలె జేసెను తనను నావలె జేసెను
తనకును నాకును భేదము లేనట్లు జేసి
మనస్సునకు జూపెను.
తన కరస్థల మందున్న శివలింగదేవుని
నా కరస్థల మందు నిలిపెను
నా కరస్థల మందు శివలింగదేవుని
నా అంగముపై మూర్తిభవింప జేసెను.
నా అంగముపై నున్న శివలింగదేవుని
నా మనోమంటపమునందు మూర్తిభవింప జేసెను.
నా మనోమంటపమందలి శివలింగదేవుని
నా జ్ఞానమంటపమునందు మూర్తిభవింప జేసెను
నా జ్ఞానమంటపమందలి శివలింగదేవుని
మహాఘనమునందు మూర్తిభవింప జేసెను.
చెరుకురసమును త్రాగి పిప్పిని పారవేసి నటులు
మనసు నందు శివలింగదేవుడు గలడని
తనువుపై కల శివలింగదేవుడు పోయె ననుచు
ఆత్మఘాతుకము జేసుకొను
బ్రహ్మఘాతుకుల నాకు జూపకయ్యా
చెన్నమల్లికార్జునా!

౪౯

నీరెండిన చెరువులో ఏరుపారి నిండినటులయ్యె
ఎండిన మొక్కపై జల్లు కురిసినటులయ్యె

నేడు లోకసుఖము పరమార్థము
తానే నడిచివచ్చినటులయ్యె నాకు
చూచితివా చెన్నమల్లికార్జునయ్యా!
శ్రీగురుచరణముల గాంచి
ధన్యురాలనైతిని చూచితివా!

౫౦

గురుడు హితుడయ్యె
లింగము వరుడయ్యె
నేను వధువునైతిని,
ఈభువన మంతయు నెరుగునటులు
అసంఖ్యాకులు నా తల్లిదండ్రులు
ఇచ్చిరి సదృశుడగు వరుని జూచి.
ఈ కారణమున చెన్నమల్లికార్జునుడే
మగడు నాకు దక్కినవారితో
సంబంధము లేదయ్యా ప్రభూ!

౫౧

వజ్రాలవేదిక పసిడితోరణము కట్టి
వజ్రపుగుంజను పాతి పగడముల పందిరి
ముత్యముల కెంపుల మేలుకట్లు కట్టి
పెండ్లి చేసిరి మావారు
కంకణము కైదారము గట్టి

స్థిరమగు సేసలు చల్లిరి
నన్ను చెన్నమల్లికార్జునుడను
మగనికిచ్చి పెండ్లి జేసిరి.

౫౨

గురుపాదతీర్థమె మంగళస్నానము నాకు
విభూతియే చెదరని పసుపు నాకు
దిగంబరమే దివ్యాంబరము నాకు
శివభక్తుల పాదరేణువులే అనులేపనము నాకు
రుద్రాక్షలే మైతొడవులు నాకు
శరణుల పాదుకలె శిరమున బాసింగములు నాకు
చెన్నమల్లికార్జునుని పెండ్లిపడుచు నగు నాకు
వేరు శృంగారము లెందుకు,
చెప్పరో అమ్మలారా!

౫౩

హరుడా! నీవు నాకు మగడవు కావలయునని
అనంతకాలము తప మొనర్చితి చూచితివా!
పెండ్లిమాట రాగానే, శశిధరుని
చెంతకు పంపిరి మావారు
భస్మమును బూసి కంకణమును కట్టిరి
చెన్నమల్లికార్జునకు నేను గావలయునని.

౫౪

జలమంటపముపై జ్వాలల చప్పరము వేసి

వడగండ్ల పాన్పు పరిచి బాసింగము కట్టి
కాలులేని వధువును తలలేని వరుడు వచ్చి
పెండ్లి యాడెను, ఎన్నటెన్నటికిని వీడని
సంసారమునకు నన్నిచ్చిరి.
చెన్నమల్లికార్జునుఁడను మగనికి
నన్నిచ్చి పెండ్లి చేసిరి గద అమ్మలారా!

౨౨

గురుని కరుణవలన లింగము గంటి, జంగమము గంటి
గురుని కరుణవలన పాదోదకము గంటి
ప్రసాదమును గంటి
గురుని కరుణవలన సజ్జన సద్భక్తుల సద్గోష్ఠిని గంటి
చెన్నమల్లికార్జునయ్యా నేను పుట్టగానే
శ్రీగురువు విభూతి నొసట ధరించి
లింగస్వాయత మొనరించి నందున ధన్యురాల నైతి.

౨౩

నరజన్మమును తప్పించి
హరజన్మ మొనరించిన గురవే మ్రొక్కుదును
భవబంధమును విడిపించి
పరమసుఖమును జూపిన గురవే మ్రొక్కుదును
భవియనుటను తప్పించి
భక్తురాల ననిపించిన గురవే మ్రొక్కుదును

చెన్నమల్లికార్జునుని దెచ్చి
నాకై వశము జేసిన గురవే నీకు | మొక్కుదును.

౨౭

పాతాళ మిందిందు పాదంబు లందందు
దశదిక్కు లిందందు దశభుజము లందందు
బ్రహ్మాండ మిందిందు మణిమకుట మందందు
చెన్నమల్లికార్జునయ్యా! నీవు నా
కరస్థలమునకు వచ్చి సూక్ష్మమై
యుంటివి గద ఓ అంగమా!

౨౮

మరుపు వచ్చినదని, గురుడు గురుతు నిచ్చెను.
జ్ఞానికి ప్రాణలింగము వేరు కాంచు డన్నా
నిర్ణయములేని భక్తికి ఊరక
ఆయాసపడు టెందులకు?
చెన్నమల్లికార్జునుని తెలిసి పూజించిన
మరల భవము వచ్చునా?

౨౯

సజ్జనురాలనై మజ్జన మొనరింతును
శాంతమతినై పూజింతును
సమరతితో నిన్ను కొనియాడుదును

చెన్నమల్లికార్జునయ్యా నిన్ను
వదలని పూజ సిద్ధించెను నాకు.

౬౦

అరచేతి యందలి లింగమును పూజించుచు
మంగళహారతులను ముట్టించి
వెలగుచుంటిని చూడయ్యా కంటిచూపు
మనసునందలి భావము తగ్గని మోహము
ఎడతెరపి లేకనుండెను చూడయ్యా
చెన్నమల్లికార్జునయ్యా నిన్ను
వదలని పూజ సిద్ధించెను నాకు,

౬౧

ఎరింగితి ననిన ఎరుంగరానిది చూడుమా
ఘనమునకు ఘనము తాను చూడుమా
చెన్నమల్లికార్జునుని నిర్ణయము లేక ఓడితిని,

౬౨

వరిపొట్టునకు నీరు పారబెట్టిన
వరిపండు నటయ్యా మొలకెత్తి యెప్పుడైనా?
తెలివిహీనుడు ఆచారవంతుడైన
తెలివిగలిగి సుఖపడ గలుగు నటయ్యా!
శ్రీగంధము చెక్కులు మోసిన

సువాసన స్థిరముగ నుండు నటయ్యా
నాదేవుడు చెన్నమల్లికార్జున ని తెలియనివారికి
ఆచారము లేదు తెలియు డన్నా!

౬౩

ఇదే హితము సకలలోకజనులకు
ఇదే మతము శ్రుతి పురాణాగమముల యందు
శ్రీవిభూతిని భక్తితో ధరించిన
భవము పరుగెత్తి పోవును
దురిత సంకులము దూరమై పోవును
హరుని సాలోక్య సామీప్య సారూప్య
సాయుజ్యము లభించును
సత్యమిది నమ్మము, నమ్మము ఓమనుజా!
ఈ విభూతి యమునకు భీతి
మరణభయము వలన
అగస్త్య, కాశ్యప, జమదగ్ని మొదలగువారు
ధరించిరానాడు చూచితివా!
శ్రీశైల చెన్నమల్లికార్జునుని
మెప్పించును వలపించును శ్రీవిభూతి,

౬౪

ఒప్పునట్టి శ్రీవిభూతిని నుదుట ధరించి
కన్నులార నిన్నుగాంచి నంతనే,

కొండంత తప్పులున్నను ముట్టజాలవు చూడోయి!
దురితమును అన్యాయమును పరిహరింప దలచిన
'ఓం నమః శివాయ శరణను మంత్రము చాలును

ఇదెట్లనిన ;—

"నమః శివాయేతి మంత్రం యః కరోతి త్రిపుండ్రకమ్
సప్తజన్మ కృతం పాపం తత్‌క్షణా దేవ నశ్యతి"

అనునట్టుల,

సింగపుపిల్లను అడవికుక్క కరిచిన
భంగ మెవ్వరి దోయి చెన్నమల్లికార్జునా!

౬౫

సప్తకోటి మహామంత్రములు ఉపమంత్రములకు లెక్కలేదు
చిత్త వ్యాకుల మొంది భ్రమించకుండుము ఓ మనసా!
"శివ శివా నమో నమః శివ శివా." యనిన చాలదా
ఒక కోటి మహాపాతకములు పరిహార మగును

అదెట్లనిన, శివధర్మే

"శివేతి మంగలం నామ యస్య నాచిప్రవర్తతే
భస్మీ భవంతి, తస్యాశు మహాపాతకకోటయః"॥
అనునట్లు నాకిదే మంత్రము నాకిదే తంత్రము
నాకిదే గతి మతి చైతన్య మయ్యా!
సద్గురుడు చెన్నమల్లికార్జునయ్యను నాకు
జూపిన సహజమంత్ర మిదే నయ్యా!

౬౬

సర్పము నోటియందున్న కప్ప
ఈగకై నెగురునట్లు ఆప్యాయనము విడువదు
కాయ మర్పితమను పుణిని చూడుమా!
నేను భక్తురాలనను సిగ్గును చూడుమా!
నేను యుక్తురాల నను యేహ్యామును చూడుమా!
సాదమే గాకున్న ప్రసాద మెటులగును?
చెన్నమల్లికార్జునా, ఉభయ ముడుగ కున్న.

౬౭

గుణదోషముల సంపాదన జేయువఱకు
కామపుటొడలు క్రోధపు గురుతు
లోభమునెలవు మోహపు టిరవు
మదము ఆవరణము మత్సరపు ముసుకు
ఆ భావములు తీరిననే గాని
చెన్నమల్లికార్జునుని దెలియుటకు
అనువు గాదు చూడన్నా!

౬౮

క్రియగలదాననను నదొక ఆశ
సద్భక్తుల నుడిగడణమున్న దనున దొక ఆశ,
శ్రీగిరి నెక్కి నిన్ను గలిసినచో
నా యాశకు కడయుండదు గా! అయ్యా!

ఏ యాశ్రయును లేక నిన్ను నమ్మి వచ్చి
చేరితినయ్యా చెన్నమల్లికార్జునా!

౨౯

క్రియలు ముట్టజాలవు నిన్నెట్లు పూజింతునయ్యా
నాదబిందువుల కతీతుడవు నిన్నెట్లు భజింతునయ్యా?
కాయముతో ముట్టెదనిన కానరాని ఘనమువు నీవు
నిన్నెట్లు కరస్థలమున ధరింతునయ్యా
చెన్నమల్లికార్జునయ్యా నే నేమను నదరయక
నిన్ను చూచిచూచి నే వెరగొందుచుంటినయ్యా!

౩౦

కోలకోన యందలి కోతివలె
దారము కొనయందలి బొమ్మవలె
నే నాడితి నయ్యా నీవాడించి నటుల
నేను పలికితినయ్యా! నీవు పలికించి నటుల
నేనుంటినయ్యా నీవుంచినటుల
జగము నాడించు జంత్రవాహకుడు
చెన్నమల్లికార్జునుడు చాలు చాలను వరకు.

౩౧

భావము పిసర వోయెను
మనసు మృత్యువు నప్పగొనెను నేనేమి జేతునయ్యా!
సేవకత్వపు మనసు

తలక్రిందు లయ్యేను నేనేమి సేతునయ్యా!
విడిచి వేరుగాని భావమై నిన్నొకసారి కూడి
నిత్యసుఖమునం దెప్పుడుండగల నయ్యా!
చెన్నమల్లికార్జునా!

౨౧

అమాయకుండని నమ్మకుము
జగద్విజ్ఞాని చతురుం డతడు
బాణ, మయూర, కాళిదాస, ఓహిల
ఉద్భట, మలహణుల కిచ్చిన విధమే వేరు.
ముక్తిని జూపి భక్తిని మరపించును
చెన్నమల్లికార్జునుడు.

౨౨

లేగరూపును జూపిచిలుకను చదివించినటులు
చదివించుటకు జీవము లేదు వినుటకు జ్ఞానము లేదు
చెన్నమల్లికార్జునయ్యా నిన్నరయని వానిభక్తి
లేగరూపును చిలుకకు చదివించి నటు లయ్యా!

౨౩

పెట్టిన తినదు, ఇచ్చిన మెచ్చదు
అడుగదు అరడిపెట్టదు మెచ్చదు చూడయ్యా!
పెట్టిన తిని ఇచ్చిన మెచ్చి అడిగిన వర మిచ్చు,

జంగమలింగము పాదమునఁబట్టి
బ్రదికితిని చూచితివా చెన్నమల్లికార్జునా!

౭౫

నిక్కమగు వలపు గలవారు
కులచలము లెక్కింతురా?
మిక్కిలి మరులు గొన్నవారు, సిగ్గు లజ్జల పాటింతురా?
చెన్నమల్లికార్జునుని వలచినవారు
లోకాభిమానము నెంతురా, ఓ పిచ్చివాడా!

౭౬

భృత్యుండైనచో, కర్త్రివునకు
ఉత్తమవస్తువు నర్పింప వలయు
ఇదే కర్త్రి భృత్యువు లందలి తారతమ్యము
లింగభక్తుం డైనచో
జంగమ పాదతీర్థ ప్రసాదములను
లింగమునకు మజ్జన భోజన నైవేద్య మొనరించి
తత్ప్రసాదమును గొనవలయు
ఇదే మర్మము ఇదే ధర్మము
చూడుమా చెన్నమల్లికార్జునా!

౭౭

ఉపమాతీతులు రుద్రగణములు, వారు నాబంధుబలగము
మా శ్రీశైల చెన్నమల్లికార్జునుడు వలచిన

మరల నేనిటు రానమ్మా తల్లీ!

౭౮

పంచేంద్రియములు ఉరువడి గొనగ
మదించిన యవ్వన దేహము వృధా పోయెనే!
తుమ్మెద పరిమళమును గోలిపోవు నటులు
నన్నింకెన్నడు లోగొనెద వయ్యా,
చెన్నమల్లికార్జునా!

౭౯

ఆయుష్యము తరిగిపోవుచున్నది
భవిష్యత్తు తొలగిపోవుచున్నది
కూడియున్న సతిసుతులు, తమతమ దారిని పోవుదురు
వద్దువద్దురా, వంధ్యవైయె చెడకుము ఓ మనసా!
చెన్నమల్లికార్జునుని శరణుల సంఘమందు
ప్రజ్ఞాశాలినివై బ్రదుకుము ఓ మనసా!

౮౦

పగలు నాల్గు జాములు అశనమునకై చింతింతురు
రాత్రి నాల్గు జాములు వ్యసనమునకై చింతింతురు
నీటియందున్న చాకలి నోరెండి చచ్చినటులు
తమలోనున్న మహా ఘనమును
గన జాల రీజనులు చెన్నమల్లికార్జునా!

౮౧

మాకు మాలింగము చింత
మాకు మాభక్తుల చింత
మాకు మాఆద్యుల చింత
మాకు మా చెన్నమల్లికార్జునుని చింత
లోకులచింత మాకెందు కన్నా.

౮౨

భక్తుల యింటి అంగణము
వారణాసి యనునది పుసియా!
భక్తులయింటి అంగణమునందు
అష్టాషష్ఠి తీర్థములు నెలకొన్నందున

ఆదెట్లు లనిన : ఆగమసాక్షి.
"కేదారస్యోదకే పీతే వారాణస్యాం మృతే నతి।
శ్రీశైలశిఖరే దృష్టే పునర్జన్మ నవిద్యతే"
అను నుడువులకన్న అధికము
శ్రీశైలమునకు చుట్టు తిరిగిన
కుడి ఎడమ లందు కేదారము
అటనుండి బయట వారణాసి
విరక్తి ఋతువై భక్తి మొలక యయ్యె

ఓ దేవా! చెన్నమల్లికార్జునా!
నీ భక్తుల ఇంటి అంగణము
ప్రయాగ కన్నను అధికము గనుమా।

౧౫౭

అయ్యా! తమస్సు వదలిన
సత్యశరణుల విధము నే నేమందు నయ్యా!
ఘనమును లోగొనిన మనస్సుగల మహానుభావుల
మార్గము ననుసరించి నే బ్రదుకుదు నయ్యా!
అయ్యా! నీచెంత నిలిచి వేరొకటి దలచక
లింగసుఖము నొందిన వారి సంఘమునందు
నా ఆయువు గడచు నటుల జేయుము
అయ్యా! చెన్నమల్లికార్జు నయ్యా!

౧౫౮

లింగమును పురాతనులను అన్యుల ఇండ్లలో
పొగడుటకు పోవుదురు తమ
ఉదరపోషణ గురించి
లింగము పురాతనులు అచటికి రాగలుగుదురా।
అన్యమును మరిచి నిన్ను తలంచువారి
నొకసారి జూపుము చెన్నమల్లికార్జునా!

౧౫౯

సుఖము ననుభవించిన వారి సంభాషణమువలననా!

దుఃఖమునకు విశ్రామ మయ్యెను
భావమునకు భావము తార్కాణ మగుటవలన
తలపునకు విశ్రామ మయ్యెను
చెదరి కలిసిన మమత లోఁగొనె నయ్యా!
చెన్నమల్లికార్జు నయ్యా! మీ శరణుల సంగమువలన.

౭౫

చూచి పిలిచి మాటలాడిన నొకసుఖము
ఏమి చేయదయ్యా మీశరణుల అనుభావము
చెన్నమల్లికార్జునయ్యా మీశరణుల
సద్గోష్ఠి ఏమి చేయదయ్యా!

౭౬

తెలియనివారితో చెలిమి చేసిన
రాళ్లను గొట్టి మిరుగుళ్లను తీసి నట్టు లయ్యా!
తెలిసినవారితో చెలిమి చేసిన
చల్లను చిలికి వెన్నను దీసి నట్టులయ్యా!
చెన్నమల్లికార్జునా మీశరణులతో చెలిమి
కర్పూరము గిరిని జ్వాలలు మింగి నట్టులయ్యా!

౭౭

సిగవీడి మొగమువాడి తనువుకరిగినదాన
నన్నేల మందలింతు రయ్యా!
ఓ అన్నలారా! నన్నేల మందలింతు రయ్యా!

ఓ తండ్రులారా! నన్నేల మందలింతు రయ్యా।
బల ముడిగి చల ముడిగి భావము నొదలి
భక్తురాలనై చెన్నమల్లికార్జునుని కూడిన దాన.

౭౯

అంగవికార సంగమము ను మరిచి
లింగముతో కూడియుండు వారిని జూపుము
కామవికారమును వదలి
భక్తి ప్రాణమైయుండు వారిని జూపుము
త్రికరణశుద్ధముగ నిన్ను నెర నమ్మిన
సద్భక్తుల జూపుము నాకు ఓ చెన్నమల్లికార్జునా।

౮౦

తొందరపడి ధ్యానించుచు అలసితిని
జ్యోతిర్లింగము గానరాదు
మాటల మాలలో చిక్కు నతడు గాడు
ధాతును చెరిచి మనసును జూచి గారించి చూచును
ఆత్మను దాటి పరమాత్మను దెలిసినవాడే శివయోగి
అతని పాదములకు శరణందు నయ్యా
చెన్నమల్లికార్జు నయ్యా!

౮౧

రత్నపు సంకెళ్ళైనను బంధనము గాదా!
ముత్యాలవల యైనను బంధనము గాదా!

బంగారు ఖడ్గమైనను తలనరికిన చావదా!
లోకభజనయందు చిక్కుకొనిన
జనన మరణములు తప్పునా చెన్నమల్లికార్జునా!

౯౨

అయ్యా! మీ శరణుల రాకకు
గుడి తోరణము కట్టెదను
అయ్యా! మీ శరణుల రాకకు
భుజములకు పట్టము గట్టెదను
అయ్యా! మీ శరణులు ఇంటికి వచ్చిన
వారి శ్రీపాదములను నా హృదయమునకు
అదిమి పెట్టుకొందును
చూచితివా చెన్నమల్లికార్జునా!

౯౩

లింగముఖమున ఉదయించి
అంగము కలిగియున్న పురాతనుల
ఇంగితము నేమని అడిగెద రయ్యా?
వారి ప్రవర్తనమే ఆగమము-వారి నుడువులే వేదము
వారిని లోకపుమానవు లన వచ్చునా అయ్యా?

ఆదెత్తెనిన సాక్షి :

"వృథా భవతి బీజం హి తద్ వృక్షే లీయతే పునః।
రుద్రలోకం పరిత్యక్త్వా శివలోకే భవిష్యతి॥

అనునట్లు- బీజమునుండి పెరిగిన వృక్షము
మరల బీజమునందె ఇముడును
ఆప్రకారమే లింగమునుండియే పురాతను లుద్భవించి
వారు మరల ఆలింగ మందే
ఐక్యమయిరి చూడుడన్నా !
ఇట్టి పురాతనులకు నేను శరణని
జన్మరాహిత్యమును బొందితి నయ్యా!
చెన్నమల్లికార్జునా !

—:o:—

# అక్కమహాదేవి వచనములు

## మాహేశ్వర స్థలము

౬౪

ఆడుట పాడుట అనుట వినుట నడుచుట నుడువుట
సరససమ్మేళనమై యున్న దయ్యా! శరణులతోడ
చెన్నమల్లికార్జునయ్యా నీవిచ్చిన ఆయు వున్నంతవరకు
లింగానుభావుల సంగము నందు దినములు గడిపెద.

౬౫

ఆయత స్వాయతముల అనుభావము
నేనెక్కడ నెరుగుదు నయ్యా!

గురు లింగ జంగమములకు
అర్థ ప్రాణాభిమానముల సమర్పించి
అహంకారము నొదిలినట్టి పురాతనుల ఇంటియందు
భృత్యానుభృత్యురాలనై యుంటి నయ్యా!

ఈ కారణమున
చెన్నమల్లికార్జునయ్య గణములు గాని
అన్యుల నేనెరుగ నయ్యా!

౯౬

శివభక్తుల రోమము నొచ్చిన
శివునకు నొప్పియగును చూడయ్యా!
శివభక్తు డానందించిన
శివు డానంద మొందును చూడయ్యా!
భక్తదేహుడు దేవుండని శ్రుతులు పొగడినందున
శివభక్తుల బాగోగులు శివునకు ముట్టును చూడయ్యా!
తల్లికి నొప్పి గలిగిన గర్భమందలి
శిశువుకు నొప్పియగునటుల
భక్తులకు నొప్పి గలిగిన తాను నొచ్చుకొనును
చూచితివా చెన్నమల్లికార్జునా!

౯౭

భవభవములందు తిరిగి తిరిగి
బడలెను నామనము నే నేమందునయ్యా!
ఆకొని తినిన తినగనే ఆకలి యయ్యెను
నేడు నీవు వలచితివి గాన నాకు
అమృతము ఆప్యాయన మయ్యెను
ఈకారణమున నీవు కల్పించిన మాయతో
నిన్నంటితినేని ఆన నీయాన
చెన్నమల్లికార్జునా!

౯౮

గాలిలో సువాసన యుండగ
పూలచింత ఇంకెందు కయ్యా?
క్షమ దమ శాంతి ఓర్పులున్న
సమాధిచింత ఇంకెందుకయ్యా!
లోకమే తానైన పిదప
ఏకాంతపుచింత ఇంకెందు కయ్యా!
చెన్నమల్లికార్జునయ్యా!

౯౯

కట్టుకొందును నేను లింగమున కని
పెట్టుకొందును నేను లింగమున కని
చేయుదును నేను లింగమున కని
చూచెదను నేను లింగమున కని
నాయంతరంగ బహిరంగములు కూడ లింగమున కని
చేసియు చేయ నటు లుంటిని నేను చూచితివా!
నేనునా చెన్నమల్లికార్జునుని కూడుకొని
పదిలో పదునొకటై యున్నదానను
నే నేమని చెప్పు దునయ్యా!

౧౦౦

పాములకోరలను దీసి పాములనాడించ గలిగిన
పాములచెలిమియే లేసు చూడయ్యా!
కాయపుసంగమ్మును వివరించ గలిగిన

కాయపుసంగమే లేసు చూడయ్యా!
కాయమందలి వికారము తల్లి రక్కసి
యైనటులు చూడయ్యా!
చెన్నమల్లికార్జునయ్యా, నీవు వలచిన వారిని
కాయముతో కూడుకొన్న వారన వలదయ్యా।

౧౦౧

ఇంద్రియమును వదలి కాయ ముండదు
కాయమును వదలి ఇంద్రియ ముండదు
ఎటుల నిష్కామి యందును ?
ఎటుల నిర్దోషి యందును ?
నీవువలచిన నేసుఖినై యుందును ?
నీవు వలువకున్న దుఃఖినై యుందు నయ్యా
చెన్నమల్లికార్జు నయ్యా!

౧౦౨

ఉదయాస్తమానములను కొలమానములతో
ఆయువను రాసిని కొలచి ముగించక మున్నే
శివుని తలచుమోయి శివుని తలచుమోయి
ఈజన్మ ఇక మరల రాదు
చెన్నమల్లికార్జున దేవదేవుని తలచి
పంచమహాపాతకులు ముక్తి జెంది రానాడు

౧౦౭

గురువను హితుడు లింగమను కటారిని
మనోనిష్ఠయను చేతి కం దివ్వగా
పోరితిని గెలిచితిని కాముడను వానిని
క్రోధారులు చెడెను విషయారులు పారిపోయెను
కటారి నాయందు నాటుకొనిన
నేను నశించినందున చెన్నమల్లికార్జునుండను
లింగమును కరమున బట్టితి.

౧౦౮

అష్టదళముయొక్క ఆత్మలో సృష్టిని బుట్టించినవాడు
కూర్మము దిగ్దంతి దిగ్వలయముల మ్రింగి
నిజశూన్యము తానె యైన పిదప
తన్ను తానెరిగిన నిజపదము
భిన్న యోగమునకు వచ్చునా?
కన్నుచూపునందు మనసు సొగసు నందు
కాముని దాడిని గెలిచితి నన్నా
ఎండమావుల జలమునం దడగిన ప్రాణి
వేటకాని వలలో జిక్కునా ?
నాదేవుడు చెన్నమల్లికార్జునుడు కాని
పరపురుషుడు నాకు పనికి రాడన్నా!

౧౦౫

అంగభంగమును లింగముఖమున గెలిచితి
మనోభంగమును జ్ఞానముఖమున గెలిచితి
జీవభంగమును శివానుభావముతో గెలిచితి
కరణముల చీకటిని మీ ప్రకాశము వలన గెలిచితి
యవ్వనమందలి బాహ్యాకాంతి మీకంటి కగుపడు
కాముని గాల్చినబూడిద చూడయ్యా
చెన్నమల్లికార్జునా!
నీవు చంపినకాముడు మనసిజుండై యున్న ఆ
కాముని తలవ్రాతను తుడిచి వేసితి.

౧౦౬

శివునికి తప్పుజేసిన కాలుడు భస్మమైనది తెలియదా!
శివునికి తప్పుజేసిన కాముడుకాలినది తెలియదా
శివునికి తప్పుజేసిన బ్రహ్మ తల తెగినది తెలియదా!
చెన్నమల్లికార్జునుని పాదమునకు తప్పు జేసిన
భవ ఘోరనరక మని తెలియదా।

౧౦౭

ఎవ్వరులేనిదాన నని మోసపోకు చూచితివా
ఏమి జేసిన నేభయపడుదాన గాను
ఎండి రాలిన ఆకుల దిని నుండు దాన
బండరాళ్లపై పరుండి యుండు దాన

చెన్నమల్లికార్జునుడు కడగండ్ల నొడ్డిన
తనువును ప్రాణమును మీకప్పగించి
శుద్ధురాలనై యెందును చూచితివా!

౧౦౮

అయ్యా! నీవు వినిన వినుము వినకున్న మానుము
నిన్ను కీర్తించక నేనుండ లేనయ్యా!
అయ్యా! నీవు చూచిన చూడుము
చూడకున్న మానుము
నిన్ను జూచి ఆనందించిక నేనుండ లేనయ్యా!
అయ్యా! నీవు మెచ్చిన మెచ్చుము!
మెచ్చకున్న మానుము
నిన్ను అప్పికొనక నేనుండ లేనయ్యా!
అయ్యా! నీవు వలచిన వలుపుము వలువకున్న మానుము
నిన్ను పూజించక నేనుండ లేనయ్యా!
చెన్నమల్లికార్జునా!
నిన్ను నేను పూజించి ఆనందించి
ఆనందమునం దోల లాడెద నయ్యా!

౧౦౯

అయ్యా! నీవు నామొరను
వినిన వినుము! వినకున్న మానుము
అయ్యా! నీవు నాదుఃఖమును
చూచిన చూడుము చూడకున్న మానుము

నాకిది విధియా నీవు వొల్లకున్న
నిన్ను వలపించు విధ మెటు లయ్యా!
మనసు గుంజి మరులు జెందిన నన్ను
నీలో జేర్చుకొను విధ మెటు లయ్యా
చెన్నమల్లికార్జునా!

౧౧౦

జ్ఞానము కలిగె నని
గురు లింగ జంగమముల విడువ దగునా ?
సందు సంశయము లుడిగి అఖండజ్ఞాన మయ్యె నని
పరస్త్రీ పరధనముల నాసింప దగునా ?
"యత్రజీవః తత్రశివః"
అను అభిన్నజ్ఞాన మయ్యెనని
శునక సూకర కుక్కుట మార్జాలములతో
కూడి భుజింప దగునా ?
భావమందు తన నిజస్థాన మరయవలయు
సునీతి సుజ్ఞాన సత్క్రియల మార్గ మందు నడువవలయు
ఇట్లుగాక జ్ఞాన మయ్యెనని తలచి
తనకిష్టము వచ్చి నటులు నుడివిన నడిచిన
శ్వానగర్భ మందు పుట్టించక విడుచునా
చెన్న మల్లికార్జునుడు!

౧౧౧

చూచిన కన్నులకు రూప మింపు గానుండిన
మనసున సిగ్గులేక వచ్చితిరన్నా మీరు
విను చెవులకు సొంపుగా నుండిన
మరులు జెంది వచ్చితి రన్నా మీరు
నారియను రూపమును గోరి వచ్చితిరన్నా మీరు
మూత్రబిందువులను వాదులు నాళమని
కన్ను గానక గతిజెడి వచ్చితి రన్నా మీరు
బుద్ధిహీనతచే పరమార్థ సుఖమును
బోగొట్టుకొనుట ఎందుకని తెలియక
నరక హేతువని తెలిసియు
మనసున సిగ్గులేక వచ్చితిరన్నా మీరు
చెన్నమల్లికార్జునుడు గాక తక్కిన పురుషులు
అన్నలురా నాకు పోరా ఛీ మూర్ఖుడా!

౧౧౨

గుండుచన్నులుగల నిండు యవ్వనపు
చెలువమును జూచి వచ్చితి రన్నా!
అన్నా నే నాడుదాన గాను అన్నా నేను లంజను గాను
అన్నా నన్ను జూచి ఎవరని వచ్చితి రన్నా
చెన్నమల్లికార్జునుడు తప్ప తక్కిన
పురుషుల ముఖమును చూడనన్నా!

౧౧౩

ఓరే! అన్నా! నీవు పిచ్చివాడవు కావా
నాకు నీకు అలవి యగునటరా!
పదునాల్గులోకముల మ్రింగిన కాముని గుణము
నాకు నీకు అలవియగు నటరా
గుఱ్ఱము కూలబడిన కళ్లెము గుంజి
పరుగెత్తింప వచ్చు నటరా
నిన్ను నీవే చంపుకొను అస్త్రమును
గైకొంటివి గద అన్నా!
చెన్నమల్లికార్జునుండను వైరికి
వెన్ను జూపకు మన్నా!

౧౧౪

మీస్థితికి మీరు సిగ్గుపడ కూడదా
ఇతరులచే కాదనుపించు కొను ప్రవర్తనయెందులకు
కాదనిపించు కొనుట కన్న అప్పుడే
చచ్చుట మేలు గాదా చెన్నమల్లికార్జునా!

౧౧౫

ధనమునందు విరక్తి కలిగిన నేమయ్యా!
అది ఎట్లు వచ్చినను ముట్టగూడదు
రుచియందు విరక్తి కలిగిన నేమయ్యా!
నాలుక కొన తీపినెరుగ కూడదు

స్త్రీలయందు విరక్తి కలిగిన నేమయ్యా
జాగ్రత్ స్వప్న సుషుప్తులందు తలచ కూడదు
దిగంబరియైన నేమయ్యా
మనసు బత్తల గావలయు
ఇటులీ చతుర్విధమార్గముల నరయక వృధా
చెడిరి కనుమన్నా చెన్నమల్లికార్జునా!

౧౧౬

ఎటుబోయినను భటునకు భయ ముండదు
పందకు సుఖ ముండదు వినుడన్నా!
దానగుణము గలవానికి అవగుణ ముండదు
దయగలవానికి పాప ముండదు
ఇక పరస్త్రీ పరధనముల గోరనివానికి
చెన్నమల్లికార్జునా! అసలే భయ ముండదు.

౧౧౭

పిరికివానికి సుఖ ముండదు ఏమి జేసిన నేమయ్యా
శూరునకు భయ ముండదు ఎందు బోయిన నేమయ్యా
శాంతగుణము గలవానికి అవగుణ ముండదు
కరుణ జూపువానికి శాప ముండదు
నిన్ను నమ్మి పరస్త్రీ పరధనములను వదలిన వానికి
చెన్నమల్లికార్జునా! మరల వచ్చు భయమే లేదు గనుమా

౧౧౮

పిరునకు రంగమెక్కి దిగుట మతముగాదు
శివశరణునకు వెనుకంజ వేయుట పథముగాదు
మనోనాథుడు మనసున నిండుకొని యుండునయ్యా
శ్రీపర్వతము నెక్కకూడదు
ఎక్కి డిగిన వ్రతభంగ మగునయ్యా
రంగమెక్కి అస్త్రమును మరచిన వైరి
చెన్నమల్లికార్జునుడు నిన్ను పొడిచి చంపునయ్యా।

౧౧౯

ఒడలి కలవరమునకు అడవి జొచ్చితి
అడిగితి చెట్టుచెట్టును నాఅంగమున కని
నీడెను అవి తమ లింగమున కని
అడగి నే భవి నైతి నీడి అవి భక్తు లయ్యె
మరల అడిగితినేని చెన్నమల్లికార్జునా! నీయాన.

౧౨౦

కడవరకు జేయని భక్తి ధృఢము లేని సేవ
మృడుని మెచ్చు మనిన ఎటుల మెచ్చు నయ్యా।
చేయరాదు చెడుమనసుతో
చేసిన మనోనాథుడు తెలుసుకొనడా
కొన్నిరత్నములతో మాలకూర్చిన
చెన్నమల్లికార్జును డెట్లు మెచ్చునయ్యా।

౧౨౧

తరువున్న ఫలమేమి నీడ లేకున్న
ధనమున్న ఫలమేమి దయ లేకున్న
పశువున్న ఫలమేమి పాడి లేకున్న
రూపున్న ఫలమేమి గుణము లేకున్న
కంచమున్న ఫలమేమి కూడు లేకున్న
నేనున్న ఫలమేమి చెన్నమల్లికార్జునా !
నీవున్న జ్ఞానము లేకున్న.

౧౨౨

తనువును శుష్కించి మనసును నీయందు నిల్పి
ఘనసుఖ మం దోలలాడు విధమును
జూపు మయ్యా నాకు
భావ మందులేని శూన్యసుఖము
భావించిన నెటుల గలుగును మూఢులకు
శ్రీశైల చెన్నమల్లికార్జున దేవా! వినవయ్యా
నేను వశించి నీవై నిలుచు విధమును
జూపు మయ్యా ఓ ప్రభూ!

౧౨౩

మనసు తికమకలైన ప్రాణము తలక్రిందులగు
తను కరణాదుల ప్రక్కకుంచిన
మనసు సమరస మయ్యెను చూడవే

అన్యము నెరుగను భిన్నము నెరుగను
నాదేవుడు చెన్నమల్లికార్జునునకు నేను
దగ్గరిదానను వినవమ్మా తల్లీ

౧౭౪

ఆకలీ నీవు నిలునిలు దాహమా నీవు నిలునిలు
నిద్రా నీవు నిలునిలు కామమా నీవు నిలునలు
క్రోధమా నీవు నిలునిలు మోహమా నీవు నిలునిలు
లోభమా నీవు నిలునిలు మదమా నీవు నిలునిలు
మచ్చరమా నీవు నిలునిలు సచరాచరమా నీవు నిలునిలు
నేను చెన్నమల్లికార్జునదేవుని అవసరపు
జాబును గొనిపోవుచున్నాను శరణార్థి.

౧౭౫

కణకణమను నిప్పులు రాలిన
నాయాకలి దప్పు లుడిగె నందును
మొగులు చినిగి వాన బడిన
నాస్నానమునకు పడె నందును
గిరులు దొర్లి పై బడిన
నాపై పుష్ప వృష్టి యయ్యె నందును
చెన్నమల్లికార్జునా! శిరము తెగిపడిన
ప్రాణము నీ కర్పిత మందును,

౧౨౭

గూబ కంటితో చూడలేక రవిని దిట్టును
కాకి కంటితో చూడలేక శశిని దిట్టును
అంధుడు కంటితో చూడలేక అద్దమును దిట్టును
వీ రాడినమాట లన్నియు నిజమే!
సంసార నరకమునందు యాతన బొందుచు
శివుడు లేదు ముక్తి లేదు అనుచు కల్లలాడిన
నరక మందుంచక విడుచునా

చెన్నమల్లికార్జునుడు.

౧౨౮

గంధము చెక్కను నరికి కోసి అరుగ దీసిన
నొచ్చితి నని తనసువాసనను వదలునా?
చొక్కపుబంగారమును ముక్కలుగా జేసి కాచిన
నొచ్చితినని నలుపు బట్టునా?
చెరుకును తునకలు తునకలుగా నరికి
గానుగలో నలిపి పాకు జేసిన చెక్కరయై
కనలితినని తన తియ్యదనమును విడుచునా।
నేమున్న జేసిన లోపములను దెచ్చి
నాముందుంచిన హానియా నీకు తండ్రీ!
చెన్నమల్లికార్జున దేవా! నీవు
నన్ను చంపినను శరణనుట మానను.

౧౭౮

జాలరి యొకడు జలమున మునిగి వెదికికొన్ని
జీవుల చంపి సంతసించును గంతులు వేయును
తన ఇంటియందొక చిన్నపాప చచ్చిన
ఏడ్చినటుల ఆజీవుల కేల ఏడ్వడు?

అదెట్లనిన

"స్వాత్మాన మితరంచేతి భిన్నతా నైవ దృశ్యతాం।
సర్వం చిజ్జ్యోతి రేవేతియః పశ్యతి సపశ్యతి".

అనునటులు

జాలరి ఏడ్పు జగమునకు నగుబాటు
కనుక చెన్నమల్లికార్జునుని భక్తులై యుండి
జీవహింసల జేయు మాదిగల నేమందునయ్యా!

౧౭౯

చేయజాలని మాటలు చూపలేని శూరత్వము
చిత్తరు వందలి శృంగారము ఎందుకు ప్రయోజనము
ఆకులులేని మ్రాను జలములేని వాగు
దుర్గుణితో చెలిమి ఎందుకు ప్రయోజనము
దయలేని ధర్మము భయములేని భక్తి
వినయములేని ప్రసంగ మెందుకు ప్రయోజనము
ఓదేవా! చెన్నమల్లికార్జునా!

౧౬౦

తన శిష్యుని తన కొడుకనుట తప్పుగాదా!
ఏల? అతని ధనమునకు తండ్రి యయ్యెనే గాని
అతని మనసునకు తండ్రి యయ్యెనా?
ఏల? అతని మనసు నరయుడు గాన
అతని ధనమునకు తండ్రి యయ్యెను
తనయందున్న భక్తి నమ్ముకొని బ్రదుకువారు
మీ నిజభక్తులు గారయ్యా చెన్నమల్లికార్జునా!

౧౬౧

ధనమున కాశించి వచ్చువారెల్ల
తియ్యని మాటలాడుదురే గాని తప్పుల దెలుపుదురా?
మనసుపై దీసుకొని నిలిచి కోపించి చెప్పి
సన్మార్గమును జూపు నతడే బంధువు;
అటులగాక వారి మాటలనే 'ఔ' నని
తనకడుపు నింపుకొను కపటవాదుల
మెచ్చునా చెన్నమల్లికార్జునుడు.

౧౬౨

నిన్ను చూపగలిగిన నరకమె మోక్షము చూడయ్యా
నిన్ను చూపలేని మోక్షమే నరకము చూడయ్యా
నీవు మెచ్చని సుఖమే దుఃఖము చూడయ్యా

చెన్నమల్లికార్జునా నీవుకట్టి బడవైచిన
బంధనమే నిర్బంధమని యుందును.

౧౩౩

ప్రథమమున కలిగిన మోహము
సాత్వికమైనచో తప్పేందు కయ్యా
పరులు ఒల్లని వేటకు తప్పేందు కయ్యా
చెన్నమల్లికార్జున దేవుని ఎన్నటికిని
విడువని స్నేహామునకు తప్పేందుకయ్యా

౧౩౪

గట్టుపై నొక ఇల్లు గట్టుకొని
మృగములకు భయపడిన నెటులయ్యా!
సముద్రతీరము నందొక ఇల్లు గట్టుకొని
అలల తాకుడుకు భయపడిన నెటులయ్యా!
సంతయందొక ఇల్లు గట్టుకొని
రంతుకు సిగ్గుపడిన నెటులయ్యా!
చెన్నమల్లికార్జున దేవా! వినవయ్యా
లోకమందు పుట్టినందున స్తుతినిందలు వచ్చిన
మనమున చలించక యుండవలయు.

౧౩౫

రేపు రానున్నది మనకు నేడే రాని
నేడు రానున్నది మనకిప్పుడే రాని
అప్పు డిప్పు డనకుమా చెన్నమల్లికార్జునా!

౧౩౬

బంటుతనపు మాటల నెక్కుడుగా పలికిన
కట్టితిని వీరగజ్జెల నప్పుడే
కస్తూరినలది వీర తిలకము దిద్ది
కైదువ చేబూని రణమున దూకిన పిదప
కట్టినకాళ్ళ సడలిన ఆన నీయాన
గనుమా చెన్నమల్లికార్జునా।

౧౩౭

ముంజేతియందు వీరకంకణము కట్టి
ముంగాలియందు వీరగజ్జెలు కట్టితి
మగబట్టలుగట్టి గెలుతునను ఒట్టుదింటి
చెన్నమల్లికార్జునా నీయానకు
కొరతదెత్తునేని నీతొత్తుబిడ్డను గానయ్యా।

౧౩౮

చక్రము తనచే నుండగా
కటారిచింత మరియెందుకు
మాణిక్యపుదీప్తి ప్రకాశించుచుండగా
దీపము చింత మరియెందుకు
పరుసము చేతయుండగా
సిరులచింత మరియెందుకు
కామధేనువు ఇంట నుండగా

లేగచింత మరియెందుకు.
నా దేవుడు చెన్నమల్లికార్జునుడు
నాకరస్థల మందుండిన వేరుచింత మరియెందుకు.

౧౩౯

కన్నులతో చూచెదనని
చీకటిజొచ్చిన ఎటులగునయ్యా?
గట్టుకు మొదటి మెట్టులని
లోయకాల్వలందు దిగిన ఎటు లగునయ్యా?
నీవుబెట్టిన సుభిక్ష నొల్లక
వేరే కోరిన ఎటు లగునయ్యా
చెన్నమల్లికార్జుని ఘనము నరయుటకు
ఉపద్రవమును వెంటబెట్టుకొనిన ఎటు లగునయ్యా.

౧౪౦

భావించి చూచినచో అంగ మయ్యెను
అంగగుణము లుడిగి మిగిలిన పిదప
నేను నీకంగము నైతిని
భిన్నరుచిని వదలి లింగరుచియైన పిదప
చెన్నమల్లికార్జునుని యందైక్యమగు శాస.

౧౪౧

మోహమున్న మెచ్చినటులు జేయుమయ్యా
మోహమున్న కురులను కత్తిరించుమయ్యా

మోహమున్న వ్రేళ్లను కోరుకుమయ్యా!
చెన్నమల్లికార్జున దేవయ్యా
నొచ్చితి ననిన కోపించుమయ్యా!

౧౪౨

సత్యాసత్యములను రెంటినిబట్టి
నడుచు నీ లోకమంత
సత్యాసత్యములను రెంటినిబట్టి
నడువు నీ లోకమంత
సత్యాసత్యమును రెంటినిబట్టి
నడుచునా శరణుండు.
గురులింగ జంగమముల ఎడ కపటముగా వర్తించిన
అతడు త్రివిధములకు ద్రోహి
అఘోరనరకమొందును
తినునదెల్ల కిల్బిషము తినునదెల్ల మాంసము
త్రాగునదెల్ల మద్యము అసత్యమనునదే మలినము
శివభక్తునకు అసత్యమనునది గలదా అయ్యా!
అసత్యమాడి లింగమును పూజించిన
పొట్టు నలికి ఫలము గోరినటులు
గనుమా చెన్నమల్లికార్జునా.

౧౪౩

పండ్లను తిన్నతదుపరి ఆచెట్టు నెవరు నరికిననేమి?
ఆడదాన్ని విడిచిన పిదప ఆమెనెవరు కూడిననేమి?

సార ముడిగిన చేను నెవరు దున్నిననేమి
చెన్నమల్లికార్జునని తెలియకున్న
ఆకాయము నేమి దిన్న నేమి.

౧౪౪

ఆకలియైనచో ఊరియందు భిక్షాన్నము గలదు
దప్పిగలిగినచో బావులు చెరువులు నదులు గలవు
చలిబెట్టినచో పారవేసిన చింపులు గలవు
పరుండుటకు పాడుదేవళములు గలవు
చెన్నమల్లికార్జునయ్యా! ఆత్మసాంగత్యమునకు
నీవుంటివి గదయ్యా చెన్నమల్లికార్జునా!

౧౪౫

మధ్యాహ్నము కన్న పెద్దలు లేరు
అస్తమానము కన్న గొప్ప జితేంద్రియులు లేరు
విధిని మీరునట్టి అమరులు లేరు
క్షుధ వ్యాధి వ్యసనములకు వెరచి నేను
మీ మరుగు జొచ్చి బ్రదికితిని చెన్నమల్లికార్జునా!

౧౪౬

శూన్యమునుండి పుట్టిన ఆదియను తల్లికి
ఐదుగురు బిడ్డలు పుట్టిరి
ఒకడు భావరూపుడు ఒకడు ప్రాణరూపుడు
ఒకడు పంచముఖియై కాయరూపుడయ్యెను

ఇద్దరు ఉత్పత్తి స్థితికి కారణులైరి
ఐదుముఖముల ప్రభువు ఇంట సుఖములేదని
కైలాసము జేరెను మర్త్యము నందదుగిడదు.
చెన్నమల్లికార్జున దేవా! నీవే సాక్షి.

౧౪౭

సాక్షి చచ్చెను పత్రము కాలెను
లెక్కనిండెను బాస తప్పెను
పాడుజీవితపు టాస నిలిచెను దేశ మెరుగును
నాదేవుడు చెన్నమల్లికార్జునుని నమ్మి
అన్ని చింతలు మరిచితినమ్మా.

౧౪౮

చంద్రకాంత శిలను జూచి
ఏనుగు పోరునటులు
తననీడను జూచి తానే పోరుచు చచ్చునట్టి
ఏనుగు గతి ఏనుగు మతి
ఏనుగు ఔను ఏనుగు కాదు దానినేమందును
నీవు నాకరస్థలమందు నిలచితివి గాన
నేను నీవను భ్రాంతి ఇంకెందుకు?
నేను నీవు గాకుండుటకు మార్గమే లేదు.

౧౪౯

వేణుగానమునకు పాము పడగ నాడించిన నేమి
లోపలనున్న విషపుచింత వదలకున్న

పాడిననేమి వినిననేమి తన యందలి
అవగుణమును విడువకున్న
అంతరంగము నెరిగి బహిరంగమును మరిచిన వారిని
జూపవయ్యా చెన్నమల్లికార్జునా.

౧౫౦

ఫలము లోపల పక్వముగానిదె పైన
తోలు ముడుతలు పడదు
కాముని ముద్రను జూచిన మీకు నొప్పియగునను
భావముతో మరుగు పరిచితి
ఇందు కేల బాధ? పీడించకు డన్నా!
చెన్నమల్లికార్జున దేవదేవుని యందు గలిసినదాన.

౧౫౧

పంచేంద్రియ గుణములందు ఒక్కదానికి
ప్రియుడైన చాలదా?
సప్తవ్యసనములందు ఒక్క దానికి
ప్రియుడైన చాలదా?
రత్నపు సంకెళ్లైన నేమి
బంధనము వదలునా చెన్నమల్లికార్జునా!

౧౫౨

కాలిన పీనుగువలె దారము తెగిన బొమ్మవలె
జలమారిన చెరువువలె కాలిన నులుకవలె

మరల మొదటి అంగముందునా అన్నా
చెన్నమల్లికార్జునని అంగమే ఆశ్రయమైన దానికి.

౧౫౩

కాయము కర్రెగ కమిలిననేమి?
కాయము ఎర్రగ మెరిసిననేమి?
అంతరంగము శుద్ధమైన పిదప,
చెన్నమల్లికార్జునయ్యా నీవు వలచిన
కాయమెటులున్న నేమయ్యా।

౧౫౪

కాయమును ముడుపుగట్టి మీ కర్పించితిని
కరణాదుల ముడుపుగట్టి మీ కర్పించితిని
నేనొకటియు నెరుగనయ్యా!
నాగతినీవె నామతినీవె ఐనందుకు
నాప్రాణము నీకర్పితమయ్యెను.
నీవుగాక వేరొకటి దలచిన
ఆన నీయాన చెన్నమల్లికార్జునా!

౧౫౫

చదువ చదువ వేదము వాదమును దెచ్చె
వినగ వినగ శాస్త్రము సందేహమును దెచ్చె
తెలిసె తెలిసెనని ఆగమము సగమైపోయె

పూరించితి పూరించితి నని
పురాణము పూర్వము దారికే బోయె
నేనెక్కడ తానెక్కడ?
బ్రహ్మ శూన్యము చెన్నమల్లికార్జునా।

౧౫౬

ఏవిద్య నేర్చిన నేమి?
చావు బ్రతుకుల విద్య వెన్నొదలదు
అశనమును విడిచిననేమి వ్యసనమును మరిచిననేమి
శ్వాసను నిలిపిననేమి కడుపును కట్టిననేమి
చెన్నమల్లికార్జునయ్యా దేశమే కావలియున్న
దొంగ ఎటు బోవునయ్యా।

౧౫౭

పాలుచేతబట్టి వెన్నకై వెదుకదగునే
లింగమును చేతబట్టి పుణ్యతీర్థములకు బోదగునే
లింగ పాదతీర్థమును ప్రసాదమును గొని
అన్యబోధ అన్యశాస్త్రముల కోరదగునే
ఇష్టలింగమున్నచో స్థావరలింగమునకు శరణంటినేని
అప్పుడే పుట్టించును శ్వానయోని యందు
అదెటు అనగా శివధర్మ పురాణమందు
"ఇష్టలింగ మవిశ్వస్య తీర్థలింగస్య పూజకః
శ్వానయోని శతంగత్వా చాండాలగృహ మాచరేత్"

అనునట్లు దీనిని దెలిపి.

గురు వొసగిన ఇష్టలింగ మందే అన్నితీర్థములు
అన్ని క్షేత్రములు గలవని భావించి ముక్తులు గావలయు

ఇట్లుగాక

గురు వొసగిన లింగమును తక్కువ యని
తీర్థలింగమును ఎక్కువయని పోవు నతనికి
అఘోర నరకము తప్పదు చూడుమా
చెన్నమల్లికార్జునా!

౧౫౭

ఒకని ఇంట దిని ఒకని యింట కట్టి
ఒకని వాకిలి కావలయున్న నా కేమయ్యా?
నీవెవరిని వలచిన నాకేమయ్యా?
చెన్నమల్లికార్జునయ్యా ।
భక్తిని అడిగి నోరు సిగ్గుపడె నయ్యా !

౧౫౮

లోపలివాడు మగడయ్యా వెలుపలి వాడు విటుడయ్యా
రెండును నడిపించ రాదయ్యా!
తాకిక పాగమార్గములను రెంటిని నడిపించ రాదయ్యా!
చెన్నమల్లికార్జునయ్యా ! బిల్వాకపిత్థములు
నొకటిగా నెంచకూడదయ్యా

౧౬౦

పందియును మదగజమును రెండు
ఒకదారియందు ఎదురైనచో
పందికి భయపడి మదగజము ప్రక్కకు జరిగిన ఆ
పంది కేసరి యగునా, చెన్నమల్లికార్జునా!

౧౬౧

అష్టవిధార్చన చేసి వలపింతు నందునా?
అయ్యా! నీవు బహిరంగ వ్యవహారమునకు దూరస్థుడవు
అంతరంగమున ధ్యానించి వలపింతు నందునా?
అయ్యా! నీవు వాఙ్మనముల కతీతుండవు
జప స్తోత్రములతో వలపింతు నందునా?
అయ్యా! నీవు నాదాతీతుండవు.
భావజ్ఞానములతో వలపింతు నందునా?
అయ్యా నీవు మతి కతీతుండవు
హృదయకమల మందు స్థాపించుకొనెద నందునా?
అయ్యా, నీవు సర్వాంగపరిపూర్ణుడవు.
నిన్ను వలపింప నాకలవి యగునా?
చెన్నమల్లికార్జునయ్యా! నీవు వలచుచే
సుఖము చూడయ్యా!

౧౬౨

అఘటిత ఘటితుని వలపుగల శిశువును
కట్టితిని జగమునకు ప్రతిజ్ఞ

కామ క్రోధ లోభ మోహ మదమత్సరముల
కాళ్లను బంధించి వేసితిని
గురుకృప యను సుగంధలేపన మొనర్చి
మహేశరణను తిలకమును బెట్టి
శివశరణను కటారిని చేబట్టి
నిన్ను చంపెదను గెలిచెదను
నిలునిలు కర్మమా? నిన్ను చంపక మానను
నామాట తప్పదు వినుమా!
శివశరణను చెడని కటారిని గొని
నిన్ను చంపుదును గెలుతును నేను
బ్రహ్మపాశమను రణరంగమును సంహరించి,
విష్ణుమాయ యను నీ ఆశ్రయమును తొలగించి
నా యొడయుడు చెన్నమల్లికార్జునుడు
తల యూచి మెచ్చునటుల యుద్ధ మొనర్తును.

౧౬౩

అనుభవించుట కని వచ్చిన సుఖము
అనుభవించనిదే తీరదు!
చూచుటకని వచ్చిన దుఃఖము
చూడకుండనే తరుగదు
తనువునకు వచ్చిన కర్మము
తరుగు కాలమునకే కాని

చెన్నమల్లికార్జునదేవుడు
కటాక్షముతో చూడడు.

౧౬౪

లింగమునకు శరణని పూజించి అర్పించవచ్చునేగాని
జంగమమును పూజించి సర్వసుఖముల నర్పించి
శరణనరాదు ఓ తండ్రీ!
ఆడవచ్చును పాడవచ్చును గాని
నుడిపి నటుల నడువరాదు ఓ తండ్రీ!
చెన్నమల్లికార్జునదేవా!
మాశరణలు నుడివినటుల
నడువగలరు ఓ తండ్రీ!

౧౬౫

గంగతో నాడిన గుండ్లు డొల్లి
చెడిన చెడుపును చూడయ్యా!
అగ్గితో నాడివ మొద్దులు కాలి
చెడిన చెడుపును చూడయ్యా!
జ్యోతితో నాడిన చీకటి చెడిన చెడుపును చూడయ్యా!
జ్ఞానితో నాడిన అజ్ఞాని చెడిన చెడుపును చూడయ్యా!
ఓ పరశివమూర్తి ఓ హరుడా!
మీ జంగమలింగముతో ఆడిన నా

భవాదిభవములు చెడిన చెడుపును
జూడుమా చెన్నమల్లికార్జునా !

౧౬౬

చిన్నవాడగుట ఆశ్చర్యముగాని
పెద్దవాడగుట ఆశ్చర్యము గాదు గనుమా !
భక్తుడగుట ఆశ్చర్యము గనుమా
సాకారమగుట ఆశ్చర్యము గాని,
నిరాకారమగుట ఆశ్చర్యముగాదు
చెన్నమల్లికార్జునయ్యా!

౧౬౭

అయ్యా సర్వమునకు మూలమగు అహంకారమువలన
కులభ్రమ ఛలభ్రమ జాతిభ్రమ
నామ వర్ణ ఆశ్రమ మతశాస్త్రముల భ్రమ
తర్కభ్రమ రాజ్యభ్రమ ధనధాన్యభ్రమ,
పుత్ర, మిత్ర, కళత్రభ్రమ
ఐశ్వర్యభ్రమ, త్యాగ భోగ యోగ భ్రమ
కాయకరణ విషయ భ్రమ
వాయు మన భావ జీవ మోహ భ్రమ
నాహం కోహం సోహంభ్రమ, మాయాభ్రమ
మొదలగుముప్పది రెండు పాశబద్ధులై
కష్టపడు వేషధారులజూచి
శివభక్తి, శివశక్తి, శివప్రసాది, శివశరణ, శివైక్య

శివజంగమమని నుడువజాలక నామనసు సిగ్గుజెంది
నీ పాదముల కభిముఖి నైతినయ్యా
చెన్నమల్లి కార్జునా !

౧౬౮

జంగమము నా ప్రాణము జంగమము నా జీవము
జంగమము నా పుణ్యఫలము
జంగమము నానిధి నిధానము
జంగమము నా హర్ష సీమ చెన్నమల్లి కార్జునా
జంగమ సమూహము నందోల లాడెదను.

౧౬౯

శీలము శీలమని అందురయ్యా
శీలము గురుతు తెలిసిన చెప్పండోయ్!
తెలియకున్న వినండోయ్!
కామము మొదటి భవి క్రోధము రెండవ భవి
లోభము మూడవ భవి, మోహము నాల్గవ భవి
మదము ఐదవ భవి, మత్సరము ఆరవ భవి
ఆమిషము ఏడవ భవి ఇటు లీ
ఏడుగురు భవులను మీలో నుంచుకొని
లింగము లేనివాడిని "భవి, భవి" యందురు?
మీ అంతరంగ మందున్న లింగాంగముల నెరుంగక
అచ్చప్రసాది నిచ్చప్రసాది సమయప్రసాదులని
చెలిమెను తోడి జలమును దెచ్చి

లింగమునకు మజ్జన మొనరించు పగటి
దొంగల మెచ్చునా చెన్నమల్లికార్జునుడు ?

౧౪౦

జాతిశైవులు అజాతిశైవులని రెండు విధములు గలరయ్యా!
జాతిశైవులు శివునకు భోగస్త్రీలవలెనయ్యా
అజాతిశైవులు శివునకు కులస్త్రీలవలెనయ్యా
జాతిశైవులు సర్వభోగములను గోరి చేయుదురు
"ద్వారే యస్య చ మాతంగో వాయువేగ తురంగమః।
పూర్ణేందువదనా నారీ శివపూజావిధేః ఫలం॥" అనునట్లు
ఇవి జాతిశైవుల కొసగిన భోగములయ్యా !
అజాతిశైవులు గురులింగ జంగములకు
తనుమనధనములను నివేదించి
సర్వసూతకరహితులై యుందురయ్యా !
"అహం మహేశ్వర ప్రాణా మమ ప్రాణా మహేశ్వరః ।
తథైకం నిష్క్రియం భూయా దన్యలింగైక్యమేవచ ॥"
కాన,
సర్వేశ్వరుడు, చెన్నమల్లికార్జునయ్య భక్తికాయమను
ఐక్యపథమును అజాతిశైవుల కొసగునయ్యా

౧౪౧

చన్నులు శిగ నున్న నేమి ముక్కులేనిదానికి
తలపై కొంగెంతుకు, సహజ సంకల్పము లేనిదానికి

జలమందు బుట్టిన బుగ్గకు
జాతిస్మరత్వము తెలిసి యుండెను.
దారియందలి కొందరు హారిసురలకు
నీ నెలవు జూపితి శ్రీగిరి మల్లికార్జునా.

౧౬౨

కాముని తలను ద్రుంచి, కాలుని కన్నులు పెరికి
సోమసూర్యుల కాల్చి పొడిజేసి తిను దానికి
పేరుబెట్టు గలవారెవరు చెప్పగలరా!
నీవు వరుడవైన నేను వధువునైన
యమునికూడెదు ఆయువువలె
గనుమా శ్రీగిరి చెన్నమల్లికార్జునా!

౧౬౩

చూపును విడిచి ప్రీతిని మరిచి, కాముని ముక్కుగోసి
భంగమార్గమగు భావమును గెలిచిన దానికి
అంగమెక్కడిదో చెప్పరా!
అంగమే లింగమగు విధిని నాకు చెప్పుమా,
శ్రీగిరి మల్లికార్జునా!

౧౬౪

అన్నము బెట్టువానికి ధాన్యము చల్లును లోకము
అర్థము నిచ్చువానికి రాళ్లను రువ్వును లోకము

భూమి భామ హేమముల మూడింటిని
కన్నులతో జూచి చెవులతో విని
చేతులతో ముట్టి చేయు భక్తి
చిన్నవారి సమారాధన యయ్యెను
తననిచ్చి సంతుష్టి జెందువారిని నాకు
జూపుమా శ్రీగిరి చెన్నమల్లికార్జునా !

౧౭౫

వాడిన పువ్వునందు సువాసన నరయుదురా
పసిపాపయందు దోషము నరయుదురా
ఓ దేవా! స్నేహమున్నచోట ద్రోహమైనచో
మరల సద్గుణము నరయుదురా
ఓ దేవా! కాలినపుండుకు సెగజూపుదురా !
వినవయ్యా ఓ శ్రీశైలమల్లికార్జునా
ప్రవాహము తగ్గిన పిదప నావికున కేముండును.

౧౭౬

అయ్యా! సదాచార, సద్భక్తి,సత్క్రియా, సమ్యక్ జ్ఞాన సద్వర్తన
సగుణ నిర్గుణ నిజగుణ సచ్చరిత్ర సద్భావము
అక్రోధ, సత్యవచన, శమదమ, భవిభక్త భేదము
సత్పాత్ర ద్రవ్యార్పణ, గౌరవబుద్ధి
లింగలీయము జంగమాను భావము
దశవిధ పాదోదకము, ఏకాదశప్రసాదము
షోడశభక్తి - నిర్వాహము
త్రివిధ షడ్విధ, నవవిధ లింగార్చనములు

త్రివిధ షడ్విధ నవవిధ జపము
త్రివిధ షడ్విధ నవవిధ లింగార్పణము
చిద్విభూతిస్నానము ధూళనధారణము
సర్వాంగమందు చిద్రుద్రాక్షీ ధారణము
తా జేయు సత్యకాయకము
తానడుగు సద్భక్తి భిక్షము
తానిచ్చి పుచ్చుకొను భేదము
తానాచరించు సత్యప్రవర్తనము
తానిలిచిన నిర్వాణపదము —
ఇటులీ ముప్పదిరెండు సూత్రములను
సద్గురువుముఖమునుండి తెలుసుకొనిన
బసవన్న మొదలగు సమస్త గణములు
ప్రమథ నిరాభార వీరశైవ సన్మార్గము
ననుసరించి ఆచరించిరి కంటివా!
ఇట్లు ప్రమథ గణములాచరించిన
సత్య సన్మార్గముల నరయని మూఢాధముల నెట్లు
శివశక్తి శివభక్తి శివజంగమ
మనియెదనయ్యా చెన్నమల్లికార్జునా?

౧౨౨

కల్యాణ మనువ దెవ్వరికి పోవశమగును ?
పోరాదు అసాధ్యమయ్యా !

ఆశ ఆమిషము లుడుగనిదే
కల్యాణమువైపు అడుగిడరాదు !
అంతరంగ బహిరంగములు శుద్ధమైన వానికేగాని
కల్యాణమునకు పోరాదు
నేను నీవను భేదము హరించిన వానికే గాని
కల్యాణము లోతు తెలియదు
చెన్నమల్లి కార్జునుని వలచి ఉభయలజ్జల
నొదలితిగాన కల్యాణమును జూచి
నమో నమో యనుచుంటిని.

౧౭౭

అయ్యా మీ అనుభావుల సాంగత్యము వలన
నా తనువు శుద్ధమయ్యె
అయ్యా మీ అనుభావుల సాంగత్యము వలన
నా మనసు శుద్ధమయ్యె
అయ్యా మీ అనుభావుల సాంగత్యము వలన
నా ప్రాణము శుద్ధమయ్యె
అయ్యా మీ అనుభావులు
నన్ను సానలుదీర్చి బాగుచేసినందున
చెన్నమల్లికార్జునా ! నీకు నేను ఆభరణ మైతి.

౧౭౮

అయ్యా! మీ అనుభావుల సాంగత్యము వలన
నా తనువు శుద్ధమయ్యె

అయ్యా మీ అనుభావులు
నాకు సుజ్ఞానము బోధించినందున
నా మనసు శుద్ధమయ్యె
నా సర్వభోగాది భోగములన్నియు
మీశరణు లకర్పితమై
నా ప్రాణము శుద్ధమయ్యెను
నా సర్వేంద్రియములు మీ శరణుల
ప్రసాదము గొనినందున
నా సర్వాంగము శుద్ధమయ్యెను
మీ శరణులు నన్ను శుద్ధపరిచినందున
చెన్నమల్లికార్జునయ్యా నేను మీ
శరణులకు తొడవుల నైతినయ్యా.

—:o:—

# అక్కమహాదేవి వచనములు

## ప్రసాది స్థలము

౧౮౦

లింగమునకు రూప మర్పింతు
జంగమమునకు రుచి నర్పింతు
కాయమునకు శుద్ధ ప్రసాదము గైకొందు
ప్రాణమునకు సిద్ధ ప్రసాదము గైకొందు
మీ ప్రసాదమువలన ధన్యురాలనైతి
గనుమా చెన్నమల్లికార్జునా !

౧౮౧

కన్నులకు శృంగారము గురువుల పెద్దల జూచుట
వీనులకు శృంగారము పురాతనుల సద్గీతములు వినుట
వక్త్రమునకు శృంగారము సత్యము నుడువుట
సంభాషణకు శృంగారము సద్భక్తుల
సద్వచనములు పలుకుటలు
కరములకు శృంగారము సత్పాత్ర దానము చేయుట
జీవనమునకు శృంగారము శివగణముల
సాంగత్య మందుండుట
ఇవిలేని జీవుని పెంపునకు ప్రయోజన మేమయ్యా
చెన్నమల్లికార్జునా?

౧౮౨

సూర్యునివలె నుండును జ్ఞానము
సూర్య కిరణమువలె నుండును భక్తి
సూర్యుని వదలి కిరణము లుండవు
కిరణములను వదలి సూర్యు డుండడు
జ్ఞానములేని భక్తి భక్తి లేని జ్ఞానము
ఎటుల నుండునయ్యా చెన్నమల్లికార్జునా ?

౧౮౩

లింగాంగసంగ సమరస సుఖమందు
మనసు వేద్య మాయెను
మీ శరణుల అనుభావ సంగము వలన
నా తను మన ప్రాణ పదార్థములను
గురు లింగ జంగమముల కర్పించి
శుద్ధ సిద్ధ ప్రసిద్ధ ప్రసాదినై తిని
ఆ మహా ప్రసాదము రూపు రుచి తృప్తులను
ఇష్ట ప్రాణ భావలింగము లందు
సావధానముగ నర్పించి మహాఘనప్రసాదినై తిని
ఇటులీ సర్వాచార సంపత్తు
నా తను మనములకు వేద్యమాయెను
ఇంకెక్కడనయ్యా నేను నీయందు
అవయవరహిత నగుట ఏకమగుట

పరమ సుఖ పరిణామము మితిమీరి మనసునందు
పొందు తావేది చెప్పుమా చెన్నమల్లికార్జునా !

౧౭౪

నేను తినక మును పే జంగమమునకు
అమృతాన్నాదుల నైవేద్య మిడుదు
నేను కట్టుకొనక మునుపే జంగమమునకు
దేవాంగాది వస్త్రముల కట్టింతు
నేను పూసుకొనక మునుపే జంగమమునకు
సుగంధాది పరిమళములు పూయుదు
నేను పూవుల పెట్టుకొనక మునుపే
జంగమమునకు పరిపరివిధముల పూవుల నిత్తు
నేను భూషణముల ధరించుకొనక మునుపే
జంగమమునకు భూషణముల ధరింతు
నే నేయే భోగముల భోగించినను జంగమమునకు
భోగింపజేసి ఆ శేష ప్రసాదమును లింగమునకు
భోగింప జేయనిదే నేను భోగించిన
జనవన్నా నీ యాన యయ్యా చెన్నమల్లికార్జునా!

౧౭౫

అయ్యా నేను స్నానము జేయక మునుపే
జంగమమునకు స్నానము జేయింతును
నేను వస్త్రమును గట్టుకొనక మునుపే
జంగమమునకు పట్టుబట్టల గట్టింతును

నేను పరిమళములను బూసుకొనక మునుపే
జంగమమునకు సుగంధ ద్రవ్యముల పూసెదను
నేను అక్షతలు పెట్టుకొనక మునుపే
జంగమమునకు అక్షతలు ధరింతును
నేను పూవుల ముడుచుకొనక మునుపే
జంగమమునకు పరిమళ పుష్పముల ధరింతును
నేను ధూపవాసన గొనక మునుపే
జంగమమునకు ధూపవాసన గొన నిత్తును
నేను దీపహారతిని జూడక మునుపే
జంగమమునకు హారతిని జూపెదను
నేను పదార్థముల స్వీకరించక మునుపే
జంగమమునకు మృష్టాన్న మిడుదును
నేను పానీయముల ద్రావక మునుపె
జంగమమునకు అమృతపానీయముల నిత్తును
నేను చేయి కడుగుకొనక మునుపే
జంగమమునకు హస్తప్రక్షాళనము జేయింతును
నేను విడియము వేసుకొనక మునుపే
జంగమమునకు తాంబూలము నిచ్చెదను
నేను గద్దెపై కూర్చుండ మునుపే
జంగమమునకు ఉన్నతాసనము వేసెదను
నేను సునాదముల వినక మునుపే
జంగమమునకు సంగీతవాద్యముల వినిపింతును

నేను ఆభరణముల ధరింపక మునుపే
జంగమమునకు ఆభరణముల ధరింపజేసెదను
నేను వాహనముల నెక్కక మునుపే
జంగమమును వాహనములపై నెక్కించెదను
నేను గృహమునందు ప్రవేశింపక మునుపే
జంగమమునకు గృహము నిచ్చెదను
ఇటులీ పదహారు తీరుల భక్తిని చరలింగమున కిచ్చి
ఆ చరలింగమూర్తి భోగించిన పిదప
నేనా ప్రసాదము మొదలగునవి భోగింతునే గాని
జంగమము లేక వీని యం దొకభోగమునైన
నే భోగించినచో నీయాన నీప్రమథులాన.
ఇటులీ క్రమమునం దాచరించు వానికి
గురు వుండును లింగ ముండును జంగమ ముండును
పాదోదక ముండును ప్రసాద ముండును
ఆచార ముండును భక్తి యుండును
ఈ క్రమమునం దాచరించని వానికి
గురు వుండదు లింగ ముండదు జంగమ ముండదు
పాదోదక ముండదు ప్రసాద ముండదు
ఆచార ముండదు భక్తి యుండదు

6)

వాని పెంపు పందిపెంపు, వాని పెంపు కుక్క పెంపు
వాని పెంపు గాడిదపెంపు మధు మాంసభుజకుడు
వాడు సర్వఛాండాలుడయ్యా! చెన్నమల్లికార్జునా!

౧౮౭

జ్ఞానము కారణాంగమే భక్తి
భక్తి మహా కారణాంగమే జ్ఞానము
భక్తి జ్ఞాన మనునది కాకాక్షివలె
భక్తి జ్ఞానమనునది నా మోహంపు
చెన్నమల్లికార్జునా నీవలె!

౧౮౮

తనువు కరగకున్న మజ్జన మొల్లవయ్యానీవు
మనసు కరగకున్న పువ్వుల నొల్లవయ్యానీవు
సుఖి గాకున్న గంధాక్షతల నొల్లవయ్యానీవు
జ్ఞానము గలుగకున్న హారతి నొల్లవయ్యానీవు
భావము శుద్ధి గాకున్న ధూపము నొల్లనయ్యా నీవు
పరిణామము కలుగకున్న నైవేద్యము నొల్లవయ్యానీవు
త్రికరణశుద్ధి గాకున్న తాంబూలము నొల్లవయ్యా నీవు
హృత్కమలము విప్పకున్న ఉండ నొల్లవయ్యా నీవు
నా యందేమి గలదని కరస్థల నివాసివైతివి
చెప్పుమా చెన్నమల్లికార్జునా!

౧౮౮

ఒకనికి ఇహముగలదు ఒకనికి పరము గలదు
ఒకనికి ఇహములేదు ఒకనికి పరములేదు
ఒకనికి ఇహపరములు రెండును లేవు
చెన్నమల్లికార్జున దేవుని శరణునకు
ఇహపరములు రెండును గలవు.

౧౮౯

నడక శుచి నుడువు శుచి
తనువు శుచి మనసు శుచి భావము శుచి
ఇట్టి పంచతీర్థముల కూడుకొని
మర్త్యమందున్న మీ శరణుల జూపి
నన్ను నిలుపుకొనుమా చెన్నమల్లికార్జునా।

౧౯౦

బడయు టరుదు నరజన్మము
బడయు టరుదు శివభక్తి
బడయుటరుదు గురుకారుణ్యము
బడయు టరుదు లింగజంగమ సేవ
బడయుటరుదు సత్యశరణుల అనుభావము
గాన చెన్నమల్లికార్జునుని సత్యశరణుల
అనుభావమునందు ఆనందముతో
పరవశించి నోలలాడుము ఓ మనసా!

౧౯౧

ఓ మనసా అదరకుము బెదరకుము
నిజము నరసి నిశ్చింతవై యుండుము
పండ్లున్న చెట్టుకు రాళ్లురువ్వు వారొక కోటి
ముండ్లున్న చెట్టుకు రువ్వు వారొకరిని గాన
భక్తిగలవారిని దిట్టువారొక కోటి
భక్తిలేనివారిని దిట్టువాని నొకరిని గాన
మీ శరణుల నుడువులే నాకుగతి
సోపానములు చెన్నమల్లికార్జునా।

౧౯౨

అయ్యా, పరాత్పర సత్యసదాచార
గురు లింగజంగమముల శ్రీచరణములను
వెనుకచెప్పిన అచ్చప్రసాదిసోపాదియందు
నిర్వంచకత్వముతో
గురు లింగ జంగమములకు
అర్థప్రాణాభిమానముల సమర్పించి,
అష్టవిధార్చన షోడశోపచారములతో అర్చించి
ఆ పాదోదకప్రసాదమును
తన సర్వాంగమందు నెలకొనియున్న
ఇష్టమహాలింగదేవునికి, ఇచ్చిపుచ్చుకొనునట్టిదే

ఎదుటనున్న జంగమపాదోదక ప్రసాదమును
గైకొను విధి గనుమా
ఆ తర్వాత, సంబంధ ముంచి ఆచరించు విధ మెట్టిదనిన
అయ్యా నీషట్ స్థానములందు నెలకొనియున్న
ఇష్టమహాలింగదేవుని త్రివిధస్థానములందు
ఓం బసవన్న, చెన్నబసవన్న. అల్లమప్రభువను
త్రివిధ నామరూపమగు షోడశాక్షరములే
షోడశవర్ణములై నెలకొన్నారు గనుమా!
ఇట్టి షోడశ కళాస్వరూపమగు చిద్ఘన మహాలింగదేవుని
నిరంజన జంగమ ఉపాధియందు,
సగుణనిర్గుణ పూజ యొనరించి
జంగమ చరణస్పర్శమునవచ్చినగురుపాదోదకమైనను సరి
అది దొరకకున్నచో,
లింగానతితో వచ్చికూడిన పరిణామోదకమైనను సరి
ఒకపాత్రయందు సూక్ష్మముగా నుంచి
ఆ ఉదకము నందు హస్తోదకము
మంత్రోదకము భస్మోదకముల నొనర్చి
ఆ తర్వాత అనాది మూలప్రణవము ప్రసాద ప్రణవములందు
అఖండజ్యోతి ప్రణవము
అఖండ మహాజ్యోతి ప్రణవములను లిఖించి,

శ్రద్ధాదులతో పూర్ణభక్తితో
మహాచిద్ఘన తీర్థమని భావించి,
పంచాక్షర షడక్షర మంత్రధ్యానముచే,
అనిమిషదృష్టితో నిరీక్షించి,
మూడుమారులు ప్రదక్షిణ యొనరించి,
ఆ చిద్ఘన తీర్థమును ద్వాదశదళకమల మధ్యమందు నెలకొన్న
ఇష్టమహాలింగ జంగమమునకు,
అష్టవిధమంత్ర సకీలములతో
ఆచారాది శూన్యాంతమగు అష్టవిధలింగధ్యానముతో
అష్టవిధ బిందువులను సమర్పించువరకు
అష్టవిధో దకమగునయ్యా!
ఆ ఇష్టమహాలింగ జంగమము నెత్తి అష్టాదశమంత్రస్మరణచే
ముగియువరకు నవమోదక మగు నయ్యా!
మిగిలిన ఉదకమును త్రివిధ ప్రణవధ్యానముతో
ముక్తాయ మొనర్చు నప్పుడు
దశవిధోదక మనిపించునయ్యా!
ఇట్లు మహాజ్ఞానలింగ జంగమ స్వరూపమగు
పాదతీర్థము ముగించిన తదుపరి
తలె గిన్నెల యందు ఎడజేయవలసివచ్చిన
గృహమందున్న క్రియాశక్తులకు ధారణ మున్నచో

తా జేసిన పాదోకకము ప్రసాదము నియ్యవలయును.

సాధారణ లింగభక్తు లైనచో

ముఖమార్జనము చేయించి, తాను ధరించు విభూతిని

ధరించి. శివశివా, హరహరా,

బసవలింగా యని భోధించి

ఎడజేయుంచుకొన వలయు నయ్యా.

అనంతరము తాను ప్రసాదిస్థలమైనచో

సంబధము ననుసరించి

పరస్థలమైనచో చిద్ఘన ఇష్ట మహాలింగ జంగమమును

వామ కర స్థలమందు మూర్తీభవింప జేసి ధరించి,

దక్షిణ హస్తమందు గురులింగ జంగమముల సూత్రము

ననుసరించి వచ్చిన భస్మమును లేపనము జేసుకొని,

మూలప్రణవమును ప్రసాదప్రణవమందు

గోళక ప్రణవమును. అఖండగోళక ప్రణవమును,

అఖండ మహాగోళక ప్రణవమును జ్యోతి ప్రణవమును

ధ్యానములచే ద్వాదశ వారములు జపించి

ప్రదక్షిణ మొనరించి

మూలమూర్తిలింగజంగమము మస్తకముపై స్పర్శించి

పళ్లెమును మూడుమారులు స్పర్శించి

అందలి పదార్థము పూర్వాశ్రయము

నొడలిన శుద్ధ ప్రసాదమని భావించి
ఆ ఇష్ట మహాలింగ జంగమమునకు
అష్టావళ ప్రణవమంత్ర స్మరణచే మూడుమారులు
రూపమును సమర్పించి
రెండు మారులు రూపమును జూపి
చిర ప్రాణలింగ మంత్రమును జిహ్వాయందు
అనుచు ఆరవసారి భోజ్య పదార్థమును
ఆ ఇష్ట మహాలింగ మంత్రధ్యానముతో సమర్పించి
షడ్విధ లింగలోలు ప్రీతితో సంతృప్తుండై
ఆచరించు నతడే గురుభక్తుండగు
నిచ్చప్రసాది యందు గనుమా చెన్నమల్లికార్జునా!

౧౫౩

కరణాదుల ప్రక్కనుంచినందున మీకర్పిత మయ్యెను
నేనొకటియు నెరుంగనయ్యా?
నాగతి నీవయ్యా నామతి నీవయ్యా
ప్రాణము నీకర్పిత మయ్యెను
నీవుగాక వేరొండు తలంచిన
ఆన మీయాన చెన్నమల్లికార్జునా!

౧౫౪

ఆశ ఆమిషము లుడిగి అస్థిరవిషయాదులెల్ల అణగి
సంశయ సంబంధము నిస్సంబంధ మయ్యె గనుమా

నా మనమునందు ఘన పరిణామమును చూచి

మనసు లగ్నమయ్యె నయ్యా!

చెన్నమల్లికార్జునా! మీ శరణుడు

ప్రభుదేవుని కరుణచే బ్రతికితి నయ్యా

౧౯౫

తను శుద్ధము మన శ్శుద్ధము భావ శుద్ధము

ఐనవారిని నా కొకసారి జూపుమా

నడత సదాచారమై నుడువులా మమ్ములై

నిత్యశుద్ధు లగువారిని నా కొకసారి జూపుమా

శూన్యమున గలిసి వెరగంది

లో వెలుపల నొకటియై నిలిచిన

మీ శరణుని నాకొకసారి జూపుమా

చెన్నమల్లికారునయ్యా!

౧౯౬

శివభక్తుల ప్రసాదముగొనగ నా తనువు శుద్ధమయ్యె

అసంఖ్యాకుల తలచగ నా మనసు శుద్ధమయ్యె

శివగణముల జూడగ నా చూపులు శుద్ధమయ్యె

శివగణముల కీర్తి వినగ నా చెవులు శుద్ధమయ్యె

ఈ భావమే నాజీవనము లింగయ్య తండ్రీ!

సూటిగా మనసుతో నిన్ను పూజించి నే

భవమును గెలిచితి కనుమా చెన్నమల్లికార్జునా!

౧౯౭

కాయము ప్రసాదమందు జీవము ప్రసాదమందు
ప్రాణము ప్రసాదమందు మనసు ప్రసాదమందు
భావము ప్రసాదమందు ధనము ప్రసాదమందు
జ్ఞానము ప్రసాదమందు భోగము ప్రసాదమందు
చెన్నమల్లికార్జునయ్యా
మీ ప్రసాదమంతయు నేనైతినయ్యా

౧౯౮

అయ్యా! సదాచార సద్భక్తి సత్క్రియ సమ్యక్ జ్ఞాన సద్వర్తన
సద్గుణ నిర్గుణ సచ్చరిత్ర సద్భావ క్రోధ సత్యావ సన
శమ దమ శివ-భక్త భేద సత్పాత్ర ద్రవ్యార్పణ
గౌరవబుద్ధి లింగలీనత్వ జంగమానుభావ
దశవిధపాదోదక ఏకాదశప్రసాద
షోడశభక్తినిర్వాహ త్రివిధ షడ్విధ నవవిధ లింగార్చన
త్రివిధ షడ్విధ నవవిధ జప త్రివిధ
షడ్విధ నవవిధ లింగార్పణ
చిద్విభూతి స్నాన ధూళనధారణ
సర్వాంగ చిరుద్రాక్షధారణ తాజేయు సత్యకాయకము
తా నడుగు సద్భక్తి భిక్ష తా నిచ్చి పుచ్చుకొను భేదము
తా నాచరించు సత్య ప్రవర్తనము

తా నిలిచిన నిర్వాణపదము
ఇటులీ బత్తీసు కళల విధమును
సద్గురు ముఖమున నెరింగిన
బసవన మొదలగు సమస్త ప్రమథగణము లెల్లరు
నిరాభారి వీరశైవ సన్మార్గము ననుసరించి ఆచరించిరి
ఇట్లు ప్రమథగణము లాచరించిన
సత్యసన్మార్గము నరయని
మూఢాధముల నెట్లు శివభక్తి శివశక్తి శివజంగమ
మనెద నయ్యా చెన్నమల్లికార్జునా।

౧౯౯

మడివాళయ్య ప్రసాదమును గొనిన
నా సర్వాంగము శుద్ధమయ్యెనయ్యా!
సిద్ధరామయ్య ప్రసాదమును గొనిన
నా కరణాదులు శుద్ధమయ్యెనయ్యా!
బసవన్న ప్రసాదమును గొని భక్తిసంపన్న నైతినయ్యా
చెన్నబసవన్న ప్రసాదమును గొని
జ్ఞానసంపన్న నైతినయ్యా!
నిజగుణుని ప్రసాదమును గొని
నిశ్చింత నైతినయ్యా
అజగన్న ప్రసాదమును గొని
ఆరూఢ నైతినయ్యా!

ఘట్టివాళయ్య ప్రసాదమును గొని
నిరాకార పరబ్రహ్మ స్వరూపనై తినయ్యా!
ప్రభుదేవుని ప్రసాదమును గొని
చెన్నమల్లికార్జునుని కూడి సుఖినై తినయ్యా!

౨౦౦

నా యంతటి పుణ్యమును బొందిన వారు గలరా!
నా యంతటి భాగ్యమును బొందినవారు గలరా?
కిన్నరయ్య యంతటి సోదరుడు నాకు
ఏడేడు జన్మలందు శివభక్తులే బంధువులు నాకు
చెన్నమల్లికార్జు నంతటి మగడు నాకు చూడోయి!

౨౦౧

అనిమిషుని అల్లమయ్య
మరుళ శంకరయ్య కోలశాంతయ్య
మాచారధూళయ్య మిండమల్లినాథ చెన్నబసవన్న
చేరమరాయ తెలుగుజొమ్మయ్య కిన్నరయ్య
హలాయుధయ్య దాసిమయ్య భండారి బసవరాజయ్య
చెన్నమల్లికార్జునుని ముఖ్యమగు శరణులకు
నమో నమో యందును.

౨౦౨

సిరియాళునకు లింగము దాసిమయ్యకు జాగృతి
బసవన్నకు భక్తిని విడిచి జూద మాడిరే మావారానాడు

ఒకనిని కొడుకును కోరడము ఒకనిని చీరెను కోరడము
ఒకనిని తను మన ధనముల కోరడము
ముగ్గురును ముక్కంటి నెదురించి గెలిచిరి
ఓ దేవా చెన్నమల్లికార్జునా!

౨౦౩

మర్త్యలోకపు భక్తుల మనసును
ప్రకాశింప జేయ శివుడు అవతరించె నయ్యా
చీకటి శిబిరమునందు సూర్యుడు
చూరగొని నటు లాయెనయా
చిత్త ప్రవృత్తిని తగ్గించి ముక్తి పదము జూపెను
అసంఖ్యాత గణములందరికి
తనువెల్ల లింగము మన స్సంత చరలింగము
భావమంతయు మహాఘన ప్రకాశము
చెన్నమల్లికార్జునయ్యా!
మీ శరణుడు సమ్యక్ జ్ఞాని చెన్నబసవన్న
శ్రీ పాదమునకు శరణనిన
భవము నాస్తి యయ్యెనయ్యా ప్రభూ!

౨౦౪

ఆది అనాది యనక బసవన్న
గణములతో మేళవించి యుండగ
అనంతయుగములందు

సకలలోకములందు చుట్టుచు వచ్చుచున్న
సుడి నరయక సకల నిష్కలులందరు
భ్రమగొని పడుచు లేచుచు నుండిరి
వీరందరి ముందు ఆగణముల నే నెరింగి
బ్రతికితిని గనుమా శ్రీశైల చెన్నమల్లికార్జునా!

౨౦౫

శివ శివా
ఆది అనాదియను రెండును లేని నిరవయవ శివా
మీ నిజము నెవరయ్యా తెలిసినవారు?
వేదముల కభేద్యుడవు శాస్త్రముల కసాధ్యుడవు
పురాణములకు పుణ్యుడవు
ఆగమముల కగోచరుడవు
తర్కమునకు అతర్క్యుడవు వాఙ్మనా
తీతుండవగు పరమ శివలింగమవు
కొందరు సకలుండందురు కొందరు నిష్కలుండందురు
కొందరు సూక్ష్ముండందురు కొందరు స్థూలుడందురు
ఈవిధమగు భావమువలన హరి బ్రహ్మ ఇంద్ర
చంద్ర రవి కాల కామ దక్ష దేవ దానవ
మానవులందరును గనజాలక భవ భారులైరి
ఈ విధముగ శూన్య మగుటకు వీలుగాదని మా బసవన్న

జగత్ హితార్థము మర్త్యలోక మందవతరించి
వీరశైవమార్గము దెలియుటకు యేబదిరెండు
వివరముల కూడుకొని చరించిన దెట్లనిన
గురుకారుణ్య వేద్యుడు విభూతి రుద్రాక్షధారుడు
పంచాక్షరీ భాషాసమేతుడు
లింగాంగసంబంధి నిత్యలింగార్చకుడు
అర్పితమందవధానిపాదోదక ప్రసాదగ్రాహకుడు
గురుభక్తిసంపన్నుడు ఏకలింగ నిష్ఠాపరుడు
చరలింగలోలుపుడు సంగమేశుని శరణుడు
త్రివిధముల ఆయతుండు త్రికరణశుద్ధుడు
త్రివిధ లింగాంగ సంబంధుడు
అన్య దైవస్మరణ జేయడు భవి సంగవర్జితుడు
భవిపాకము గైకొనడు పరసతి గోరడు
పరధనము నొల్లడు పరనింద జేయడు
అసత్యము పలుకడు హింస జేయడు
తామసభక్తుల దగ్గర బోడు
గురు లింగ జంగమములకు అర్థప్రాణాభిమానము
మొదలగువాని నెల్లను సమర్పించి
ప్రసాద రూపమున భోగించువాడు
జంగమ నింద సహించడు ప్రసాద నింద వినడు

అన్యుల నాశించడు పాత్రాపాత్రమెరిగి ఒసగును
చతుర్విధముల గోరడు
అరిషడ్వర్గ ములకు జంకడు
కులాదిమదముల నెరుంగ డతడు
ద్వైతాద్వైతముల నుడువడు
సంకల్ప వికల్ప మొనర్పడు
కాలోచిత మెరుంగువాడు సర్వాంగ లింగుడు
క్రమయుక్త షట్ స్థలానుభావుడు
దాసోహ సంపన్నుడు
ఇటులీ పదిరెండు విధములందు నిపుణుడై
ప్రకాశించెను మా బసవన్న గారు
ఆ బసవన్న గారి శ్రీ పాదములకు నేను
రేయింబవళ్లు నమో నమో యనుచు
బ్రతికితిని గనుమా చెన్నమల్లి కార్జునా!

౨౦౬

ఆది అనాదులకు అతీతు డయ్యా బసవన్న
ముగ్గురు మూర్తులకు మూలస్థాన మయ్యా బసవన్న
నాద బిందు కళాతీత నిరంజను డయ్యా బసవన్న
ఆ నాదస్వరూపమే బసవన్న ఐనందున

ఆ బసవన్న శ్రీ పాదములకు నమో నమో
యనుచుందును గనుమా చెన్నమల్లికార్జునా!

౨౦౬

తనువు దాసోహ మొనరించి
గురుప్రసాది యయ్యె బసవన్న
మనసు దాసోహ మొనరించి
లింగప్రసాది యయ్యె బసవన్న
ధనము దాసోహ మొనరించి
జంగమప్రసాది యయ్యె బసవన్న
ఇటు లీ త్రివిధ దాసోహ మొనరించి
సద్గురు చెన్నమల్లికార్జునయ్యా!
మీ శరణుడు బసవన్న
స్వయంప్రసాది యయ్యెనయ్యా!

౨౦౭

దేవలోకము వారికి బసవన్నయే దేవుడు
మర్త్యలోకము వారికి బసవన్నయే దేవుడు
నాగలోకము వారికి బసవన్నయే దేవుడు

మేరుగిరి మందరగిరి మొదలగువాని కెల్ల
బసవన్నయే దేవుడు
చెన్నమల్లికార్జునయ్యా! మీకును నాకును
మీ శరణులకును బసవన్నయే దేవుడు

౨౦౯

వెదికి వేసారిన రాదు ఆశించి శ్రమించిన రాదు
కోరి సాధించిన రాదు తపస్సు జేసిన రాదు
అది తావచ్చు కాలమునకే గాని సాధ్యము కాదు
శివుడు వలువనిదే కైవసము గాదు
చెన్నమల్లికార్జునుడు నన్ను వలచినందున
నేను సంగనబసవన్న శ్రీ పాదముల గాంచి బ్రతికితి.

౨౧౦

అయ్యా మీ సజ్జన సద్భక్తుల గంటి గాన
నా కంటిపై నున్న పటలము హరించె నేడు
అయ్యా మీ సజ్జన సద్భక్తుల శ్రీచరణముల
మ్రొక్కితి గాన నా నొసటి వ్రాలు
తుడుచుకొని పోయె నేడు
చెన్నమల్లికార్జునయ్యా! మీ శరణుడు
సంగనబసవన్న పాదముల గాంచి
మరి మరి నమో నమో యనుచున్నానయ్యా!

౨౧౧

అయ్యా మీ శరణులు కాలిడిన భూమి పావనమయ్యా!
అయ్యా మీశరణు లున్న పురమే కైలాస పురమయ్యా
అయ్యా మీశరణులు నిలిచినదే నిజనివాసమయ్యా!
చెన్నమల్లికార్జునయ్యా! మీ శరణుడు బసవన్న
ఉన్న క్షేత్రము అవిముక్త క్షేత్రము గనుక నేను
సంగనబసవన్న శ్రీ పాదములకు
నమో! నమో! యనుచుందును.

౨౧౨

కాయము కార్పణ్యము తరిగెను
కరణాదుల కలవరము తరిగెను
మనసు తన తర్కమును జూచి చకితమయ్యెను
ఇక నేమందు నేమందు నయ్యా!
మీ శరణుడు బసవన్న శ్రీ పాదము గాంచిన గాని
కోరిక ఫలించదు ఇక నేమందు నేమందు నయ్యా!
చెన్నమల్లికార్జునా!

౨౧౩

కల్యాణము కైలాసమను మాట నిజమాయె
లోపల కల్యాణము వెలుపల కల్యాణము

దీని అంతు నెవరయా యెరింగినది?
మీ సత్యశరణుల రాకపోకలు తెలుపుచున్నవయ్యా?
మీ శరణుడు బసవన్నను చూడవలయునను
కోరిక నా కయ్యెను వినుమా చెన్నమల్లికార్జునా!

౨౧౪

రేయన పగలన ఉదయమన సాయంత్రమన
వెనుకన ముందన నీవుగాక వేరొకండు గలదన
మనసు ఘనమైనది కాదయ్యా!
చీకటిలో అద్దము జూచి ఆశ్చర్య పడితి నయ్యా!
మీ శరణుడు బసవన్న తేజమునందు గాక
నిన్ను నే నెందు జూతును చెప్పుమా
చెన్నమల్లికార్జునా!

౨౧౫

రవిని పోరున గెలిచి నవద్వారముల ద్రుంచి
అష్టసౌధముల గాల్చి పై మేడ నెక్కితి
ఔను కాదు కలదు లేదు వలయు వలదు అను
ఆరింటి నెరింగి నతడే గురుడు వేరు కాదు
ఊర్ధ్వకమల మందుదయించిన
చెన్నమల్లికార్జునా!

మీ శరణుడు సంగనబసవన్న శ్రీ పాదమునకు
నమో నమో యను చుందు నయ్యా!

౨౧౭

బయలును లింగ మందునా
నడచిన జరిగి పోయెను
గట్టును లింగ మందునా
ఎక్కి నిలచిన దిగజారెను
తరు లతాదుల లింగ మందునా
నరికిన విరిగి పోయెను
చెన్న మల్లికార్జునా! లింగ జంగమ
పాదమే గతి యని నమ్మిన
సంగనబసవన్న మాట వినక చెడితి నయ్యా!

౨౧౮

బసవన్నా నా భక్తి మీ ధర్మము
నా జ్ఞానము ప్రభుదేవుని ధర్మము
నా పరిమాణము చెన్నబసవన్న ధర్మము
ఇటు మీముగ్గు రొక్కొక్కటి ఒసగినందున
మూడుభావము లయ్యె నాయందు
ఆ మూడు భావముల మీకర్పించి నందున
నా కే జంఝూటమును లేదు

చెన్నమల్లికార్జునుని స్మరణ కలిగినప్పుడే
నేను మీ కరుణ శిశువును గనుమా
సంగన బసవన్నా!

౨౧౮

నా అంగమందు ఆచారమును జూపెనయ్యా బసవన్న
ఆ ఆచారమె లింగమని తెలిపెనయ్యా బసవన్న
నా ప్రాణమందు జ్ఞానమును జూపెనయ్యా బసవన్న
ఆజ్ఞానమే జంగమమని తెలిపెనయ్యా బసవన్న
చెన్నమల్లికార్జునా నా కన్నతండ్రి సంగనబసవన్న
నాకీ క్రమమును జూపెనయ్యా ప్రభూ!

౨౧౯

బసవన్నా మీ తను వందలి ఆచారము జూడ
నాకు లింగసాంగత్య మయ్యె నయ్యా!
బసవన్నా మీ మనసు నందలి సుజ్ఞానము జూడ
నాకు జంగమ సంబంధ మయ్యె నయ్యా
బసవన్నా మీ సద్భక్తిని తెలుసు కొనగ
నాకు సత్యము సాధ్య మయ్యె నయ్యా
చెన్నమల్లికార్జునయ్య కని పేరు బెట్టిన
గురువువు నీవై నందున మీ శ్రీపాదములకు
నమో నమో యనుచుంటి గనుమా
సంగనబసవన్నా!

౨౨౦

సంగనబసవన్న పాదము గంటి గాన నా
యంగము నాస్తి యయ్యెను
చెన్నబసవన్న పాదము గంటి గాన నా
ప్రాణము బయలయ్యెను హే ప్రభూ
మీ శ్రీ చరణమునకు శరణంటి గాన
జ్ఞానము స్వాయతమయ్యె నాకు
చెన్నమల్లికార్జునయ్యా! మీశరణుల కరుణ
బడసితిగాన ఏ జంఝాటము
లేదయ్యా ప్రభూ!

౨౨౧

క్రియాకూటమందు బసవన్న లేడు
దృష్టికూటమందు ప్రభుదేవుడు లేడు
భావకూటమందు అజగన్న లేడు
స్నేహకూటమందు ఖాచిరాజు లేడు
వీరందరి కూటమందు చెన్నబసవన్న లేడు
నాకు నీ కూట మనునది లేదు
చెన్నమల్లికార్జునా!

౨౨౨

క్రియాకూటము బసవన్న కయ్యెను
దృష్టికూటము ప్రభుదేవున కయ్యెను

భావకూటము అజగన్న కయ్యెను
స్నేహకూటము భాచిరాజున కయ్యెను,
వీరందరికూటము చెన్నబసవన్న కయ్యెను
నాకు నీ యందవిరళ కూటము
చెన్నమల్లికార్జునా

౨౨౩

బసవన్న భక్తి చెన్నబసవన్న జ్ఞానము
మడివాళయ్య నిష్ఠ ప్రభుదేవుని జంగమస్థలము
అజగన్న ఐక్యస్థలము నిజగుణుని ఆరూఢస్థలము
సిద్ధరామయ్య సమాధిస్థలము
ఇట్లు వీరందరి కరుణ ప్రసాదము నాకు
గలిగెనయ్యా చెన్నమల్లికార్జునా!

౨౨౪

బసవన్న ఇంటిబిడ్డనై నందున
భక్తిప్రసాదము నిచ్చెను
చెన్నబసవన్న తొత్తుబిడ్డనై నందున
మిగులుప్రసాదము నిచ్చెను
ప్రభుదేవుని తొత్తుకు తొత్తు మరుతొత్తు
బిడ్డనై నందున జ్ఞానప్రసాదము నిచ్చెను
సిద్ధరామయ్య శిశువుబిడ్డనై నందున

ప్రాణ ప్రసాదమును సాధించి యిచ్చెను
మడివాలయ్య ఇంటిబిడ్డనై నందున
నిర్మల ప్రసాదమును నిశ్చయించి యిచ్చెను
ఇటులీ అసంఖ్యాకగణము లెల్లరును
తమ అనుంగుబిడ్డనని తల సవరి నందున
చెన్నమల్లికార్జునయ్య శ్రీపాదములకు యోగ్యమైతి,

౨౨౪

బసవన్నయే గురువు
ప్రభుదేవుడే లింగము
సిద్ధరామయ్యయే జంగమము
మడివాలయ్యయే నన్ను గన్నతండ్రి
చెన్నబసవన్న నా పరమారాధ్యుడు
ఇక నే సుఖినైతిని గనుమా
చెన్నమల్లికార్జునా !

# అక్కమహాదేవి వచనములు

## ప్రాణలింగిస్థలము

౨౨౭

అపార ఘన గంభీర మగు అంబుధియందు
తారాపథమును చూచి నడుచుచు
నావ ద్వారా ద్వీప ద్వీపాంతరములకు
సకలపదార్థములను గొని పోబడును
నా దేవుడు చెన్నమల్లికార్జునయ్యతో
సమీప సంభాషణ నెరింగినచో
మొదటి చోటునకు గొని పోవబడును

౨౨౮

అంగమును లింగమునకు నివేదించగ
అంగము లింగము నందులిగసె
మనసు లింగమునకు నివేదించగ
మనసు లింగమందు గలిసె
భావమును లింగమునకు నివేదించగ
భావము లింగమందు గలిసె
చెన్నమల్లికార్జునా నీ వలపుసంగ మందుండి
నేను స్వయంలింగమైతి

౨౨౯

కంటితో చూచెదనని
చీకటిలో జొచ్చిన నెటు అగునయ్యా!

గట్టుకు మొదటిమెట్టులని
ఏ కాల్వలందు దిగిన నెట్టు లగునయ్యా
నీవిచ్చిన సుజ్ఞానము నొల్లక
వేరేకోరిన నెటు లగునయ్యా
చెన్నమల్లికార్జునుని ఘనము తెలియుటకని
అల్పజాతికి చెందిన నెటు లగునయ్యా.

౨౨౯

శ్వాసయందే సువాసనయున్న
కుసుమముల వ్యసన మింకెందుకయ్యా!
క్షమ దమ శాంతి సైరింపులున్న
సమాధి వ్యసన మింకెందుకయ్యా!
లోకమే తానైయున్న
ఏకాంతపు వ్యసన మింకెందుకయ్యా
చెన్నమల్లికార్జునా!

౨౩౦

ఆధార స్వాధిష్ఠాన మణిపూరక అనాహత
విశుద్ధి ఆజ్ఞేయము అని నుడివిన నేమి
ఆది అనాది యను నుడువుల విన్న నేమి అన్న నేమి
తనలో నున్న వస్తువును తా తెలియకుండిన
మనసును గాలిలో అతివేగముగ పో నిచ్చిన
చెన్నమల్లికార్జునుని కనుగొన నగునా!

౨౩౧

మన: ను గంటి అణువును గంటి
ఆయత స్వాయత సన్నిహిత సుఖము గంటి
ఎరిగెరిగి మరుపును మరచితి
గురుతు వందలి మోహంపుమరుపును తొలగించి
చెన్నమల్లికార్జునా! నిన్ను కూడి సుఖినైతి.

౨౩౨

తనువు మీరూపైన నే నెవరిని సేవింతు
మనసు మీరూపైన నే నెవరిని తలంతు
ప్రాణము మీరూపైన నే నెవరిని పూజింతు
జ్ఞానము మీరూపైన నే నెవరి నరయుదు
చెన్నమల్లికార్జునా నీనుండి నీవే యైనందున
నిన్నే తెలియుచున్నానయ్యా.

౨౩౩

అందరి ప్రాణము అరచేతియందుగలదు
నా ప్రాణము జంగమమందు గలదు
అందరి ఆయువు నొసట వ్రాసి యున్నది
నా ఆయువు మీయందు కూడి యున్నది
చెన్నమల్లికార్జునా మీ శరణులను
నా ప్రాణ లింగమని ధరించితి.

౬౩౪

తనువును మీరెను మనసును మీరెను
ధనమును మీరెను అటు తర్వాత
భావము లేనందున తర్కము నిలిచెను
చెన్నమల్లికార్జునయ్యను కూడలేక
నిజతత్త్వము నిలిచెను.

౬౩౫

దృష్టితో నెరిగిన మనసునది నెలకొనె అదేమో
ఎవ రసిన దెరుగక భావమందు నాటె నమ్మా
కళమారి అంగము శుష్కించె నమ్మా
ఇక ఎవ్వరేమన్నను విడువను
చెన్నమల్లికార్జునలింగమును

౬౩౬

పృథ్వీని గెలిచిన ఏలేశ్వరుని గంటి
భావభ్రమల గెలిచిన బ్రహ్మేశ్వరుని గంటి
సత్వ రజ తమ త్రిగుణముల
గెలిచిన త్రిపురాంతకుని గంటి
అంతరంగ మందలి ఆత్మజ్ఞానము వలన
జ్యోతిసిద్ధయ్యను గంటి
వీరందరి మధ్యమస్థానము
ప్రాణ లింగ జంగమ మను సుజ్ఞానమును
జూపెను బసవన్న ఆ బసవన్న ప్రసాదమువలన
చెన్నమల్లికార్జునుని గంటి నయ్యా.

౨౩౭

నేడు నా యింటికి ఒడ [illegible] వచ్చిన
తన వను కలశ మం దుదకము నింపి
కన్నీటి బొట్లతో పాదార్చన జేసెద
నిత్యశాంతియను సీతలసుగంధముబూపెద
అక్షయసంపదయను అక్షుతల ధరించెద
హృదయకమలముతో పూజించెద
సద్భావముతో ధూపము వేసెద
శివజ్ఞాన ప్రకాశముతో హారతి నిచ్చెద
నిత్యతృప్తితో నైవేద్యము జూపెద
పంచబ్రహ్మతో పంచ
మహావాద్యము వినిపించెద
హర్షముతో చూచెద ఆనందముతో ఆడెద
పరవశించి పాడెద భక్తితో కూడెద
ఎల్లప్పుడును కూడి ఆడెద
చెన్నమల్లికార్జునా నీ ఉనికిని జూపిన
గురుని చరణములందు లక్కయై కరిగెద.

౨౭౮

ఐదువిధముల వన్నెల తెచ్చిచ్చిన
నాల్గుచన్నుల పశు వయ్యె

పశువు కడుపున దూడ పుట్టె
దూడను విడువక యే పాలు పితుకు కొనిన
బహు రుచికర మయ్యో!
తీపి తలకెక్కగా జీవము ను విడనాడ
ఆ దూడ వెంటబోయిన భవము హరించె
గనుమా చెన్నమల్లికార్జునా

—౨౭—

ప్రాణము కాలముల చాటునందు
ప్రాణము చచ్చినది గంటి
దేవ దానవ మానవు లెల్లరు
కూటి చింత యందుండుట గంటి
జ్ఞాని శిల్పుని విడువకనే
తునకలు జేసుకొని పోవునా
కలియుగ మందు కరస్థలదేవుని
పూజయే ఘనము
మేరువుపై తురంగము ఆడుట అద్భుతము
జారుల గుంపుల జగడము చిత్రము
ఎదురు మాట నగు వాటు వ్యర్థము
క్షీరసాగర మందు దారి తెలియు దయ్యా
భక్తు లెట్లు గలరో నీవ చెప్పవలయు

పంచవర్ణముల బొమ్మ సంతలోని వర్ణమువలె
చెన్నమల్లికార్జునయ్యా ఇల్లోకస్త్రీల
సౌందర్యమును నీటిపాలు జేసెను

౨౪౦

సంసారమును శూన్యము జేసి
మనసును వజ్ర తురంగముగ జేసి
జీవుని రౌతుగ జేసి
పైకి ఎగుర నీయక ముందుకు దూక నీయక
ఈ వారువమును వెనుకకు లాగి నిలిపి
మోహారమున నిలచిన దళముపై బడి
చొచ్చుకొని బోయి నిలుప తెలియక
ఎర్రనిబురదలో గజిబిజిగా త్రొక్కుదురయ్యా
అంగడి రాజవీధియందు మాణిక్యము పడిన
దళధళమని మెరయు ప్రకాశమును గానక
బళబళ ఏడ్చుచు పశ్చాత్తాప మొందుదురయ్యా
ఆధారస్థానము వాయు పాత్రపై
హృదయస్థానమును అగ్నిని బెట్టి
వాయు పవనముల నిలిపిన

ఆ అగ్ని వేడిమి బ్రహ్మరంధ్రమును తాకగా
అచ్చట నున్న అమృతకుంభము పగిలి
క్రింద నున్న హృదయ స్థానముపై బడిన
మరుగుపడిన మాణిక్యము వెల్గును గనవచ్చు
అహంకార ముడిగిన శరణులు గాక
మరెవరయ్యా దీని నెరింగిన వారు
ఇహాపరముల నెరింగిన శరణుడు
పంచేంద్రియముల ఇంగిత మెరింగిన శరణుడు
ఒడలిని విడిచిన శరణుడు గాక మిగిలిన
ప్రాణ ఘాతక పాతకు లెక్కడ
శ్రీ శైల చెన్నమల్లికార్జునయ్యా!
మీ శరణుడు బసవన్నయే గాక.

౨౪౧

ప్రాణము లింగమని తెలిసిన పిదప
ప్రాణము ప్రసాద మయ్యెను
లింగము ప్రాణమని తెలిసిన పిదప
అంగ మందలి ఆశ తగ్గెను
లింగ సాయుజ్య శరణునకు
చూపులే కరువాయె నయ్యా

చెన్నమల్లికార్జునయ్యా తప్పక
అనిమిషుండైన శరణునకు.

౨౪౨

వేద శాస్త్రాగమ పురాణము లెల్లను
వడ్లను దంచిన నూక తౌడు గనుడోయి
వీనిని మరల దంచు టెందులకు చెరుగు టెందులకు
అటు నిటు పారు మనసును నిలుప గలిగిన
అంత బట్ట బయలు చెన్నమల్లికార్జునా!

—:o:—

# అక్కమహాదేవి వచనములు

## శ ర ణ స్థ ల ము

౧౪౩

నిండినది తొణకదు గను డోయి
నమ్మినది సందేహ పడదు కను డోయి
వలచినది వదలదు కను డోయి
పరిచయ మైనది మరువదు కను డోయి
చెన్నమల్లికార్జునయ్యా! నీవు వలచిన
శరణునకు మేరమీరిన సుఖమగు నయ్యా

౧౪౪

అంగమును లింగమున కర్పించగ
అంగ మనంగ మయ్యె
మనసును జ్ఞానమున కర్పించగ
మనసు లయ మయ్యె
భావము తృప్తి కర్పించగ
భావము శూన్య మయ్యె
అంగమన భావము లుడుగగ
కాయ మకాయ మయ్యె
నా అంగ సుఖ భోగములను
లింగమే భోగించును గాన
"శరణసతి-లింగపతినైతి"
ఈ కారణమున చెన్నమల్లికార్జునుండను
మగనితో జేరి కలిసిపోయితి

౨౪౫

భవి సంగ ముడిగి భక్తుండైన పిదప
భక్తునకు భవి సంగ మతిఘోరనరకము
శరణసతి-లింగపతి యైనపిదప
శరణునకు సతిసంగ మతిఘోర నరకము
చెన్నమల్లికార్జునా ప్రాణగుణము
వదలని వాని సంగమే భంగము.

౨౪౬

క్రియ పెండ్లికి పుట్టిల్లు
దానధర్మము సంతయందలి బహుమతి
"సాజుసాజేశ్వరి" వారకాంతల వీధి సొగసు
వ్రత నియమము లనునవి
పంచకుల లుబ్ధ వాణి
భక్తి యను నది వీరుల పోరాటము
అది బసవన్నకే తరము
నే నెరుగక పుట్టితి పుట్టి పుసి కీడైతి
పుసి విషయాదు లం దడిగె
విషయాదులు మసియై మంటగలిసె
నీ దుఃఖము నే నొల్ల పోనయ్యా చెన్నమల్లికార్జునా.

౨౪౯

బసవనభక్తి వడ్లగరిసె
సిరియాళుని భక్తి కటికెవీధి
సింధు బల్లాళుని భక్తి పరదారా ద్రోహము
మిగిలిన వారిది మోసము
ఉదాసీనముతో దాసోహము చేయువారికి
దైన్య మను భూతము సోకెను
మట్టితో ఇల్లు గట్టి మాయా మోహిని యను
మహేంద్ర జాలము తో చేయు చేవ
భక్తునింట దిని ఉద్దండవృత్తితో
తిరుగు నతడు శివుడు గాడు
వీరు దేవలోక మర్త్యలోకములకు దూరులు
శ్రీగిరి చెన్నమల్లికార్జునా! నా భక్తి
నీ యందైక్య మయ్యెను నేను నిర్భయనైతి గనుమా

౨౫౦

నిత్య తృప్తునకు నైవేద్య వ్యసన మేందుకు
సాకార నిరాకారున కభిషేక వ్యసన మెందుకు
స్వయంజ్యోతిర్మయునకు
దీపారాధన వ్యసన మెందుకు
సువాసన సుగంధ కర్పూరగౌరునకు

పుష్పముల వ్యసన మేందుకు
క్రియ యందు మనస్సు నమ్మని అహంకారునకు
భక్తి యను ప్రసారము జూపి మాల మొదలు
పద్దెనిమిది జన్మల బడయుట వలన
అరచేతి రాపిడి యా ముక్తి
మూల శిఖి రంధ్ర మందలి కాముని గాల్చి
శుద్ధ స్పటికపు స్వయంజ్యోతి యను
సు నాళము గుండ
"హాం క్షం" అను రెండక్షరముల
స్వానుభావభక్తితో నిర్వాణమైన వాని నా
కొకసారి జూపవా శ్రీ గిరి చెన్నమల్లికార్జునా.

౩౮౯

నేను నిన్ను వలచితిని నీవు నన్నువలచితిని
నేను నిన్ను వదలకుంటిని
నీవు నన్ను వదలకున్నావయ్యా!
నీకు నాకు వేరొక తావుగలదా
నీవు కరుణాళువనున దెరుంగుదు
నీవుంచిన గతియందుండుదాన
అధి నీ వెరుంగుదువు చెన్నమల్లికార్జునా!

౨౫౧

చావులేని చెడుపులేని రూపులేని
సుందరుని నే వలచితినమ్మా
ఎడలేని కడలేని తెరలేని గురుతులేని
సుందరుని వలచితినో యమ్మలారా!
భవములేని భయములేని నిర్భయ
సుందరుని వలచితి నేను
కులసీమలులేని సుందరుని వలచితి
చెన్నమల్లికార్జునుండను మగని
మరి మరి వలచితినో యమ్మలారా!

౨౫౨

అగ్గి లేని సెగ యందు ఉడికితి నమ్మా
కాటు లేని గాయము వల్ల నొచ్చితి నమ్మా
సుఖములేని శ్రమను పైకొంటి నమ్మా
చెన్నమల్లికార్జునదేవుని వలచి
రాకూడని భవము అందు వచ్చితి నమ్మా.

౨౫౩

వచ్చునని దారి జూచి
రాకున్న చింతించి చిక్కిపోతి నమ్మా

తడవైన బలు బడలితి తల్లీ
చెన్నమల్లికార్జునుని ఒకరేయి వదలిన
కౌగిలి వీడిన చకోరము వలె నొదునమ్మా

౨౫౩

ఒకసారి కాముని కాలుబట్టెద
మరొకసారి చంద్రున కొడిజాపి వేడెద
తగులబడనీ యీ విరహము
నేనెవరికెందుకు భయపడవలె
చెన్నమల్లికార్జునుని కారణమున
నేనందరికి భయపడుదాననైతినమ్మా!

౨౫౪

కలవర పడిన మనసు తలక్రిందు లయ్యెనమ్మా
చల్లగ వీచిన గాలి అగ్నిజ్వాల యయ్యెనమ్మా
చల్లని వెన్నెల తీక్ష్ణముగు ఎండగ మారెనమ్మా
నగరసుంకరివలె తిరుగుచున్నానమ్మా
తగుబుద్ధిని చెప్పి తోడ్తేవమ్మా
చెన్నమల్లికార్జునకు రెండవదన్న కోపమమ్మా

౨౫౫

మెరయు కెంజడపైన బాలచంద్రుడుండును
కర్ణములకు ఫణికుండలాలుండును చూడమ్మా

వై ఖలో రుండమాల యుండు వాడగుపడిన
నొక సా రిటు రమ్మన వమ్మా
గోవిందుని కన్ను అంగుష్టముపై నుండును
చెన్నమల్లికార్జున దేవుని గురుతు లమ్మా ఇవి.

౨౫౬

తాను దండు మండలమునకు పోతి నన్న
నేనూరకుందు గాని
తాను నా కరమున నుండి ఉరమున నిండి
నన్ను కూడకున్న నెట్లు సైరింతు నమ్మా
జ్ఞానశక్తి నా చెన్నమల్లికార్జునుని నాకు
జూపకున్న నే నే మందునే సఖియా.

౨౫౭

దూరమందున్నవని పిలుచుచు బడలుచున్న నయ్యా
అయ్యా వచ్చి నా కరస్థల మందు నిలిచిన
లింగా నా మనస్సంత నీయందు చేరునయ్యా
చెన్నమల్లికార్జునయ్యా! నిన్ను కరస్థలమున
చూచిన చూపే ప్రాణమై యుండు నయ్యా.

౨౫౮

పసుపు పూసుకొని పసిడి సొమ్ముల బెట్టుకొని
పట్టుపట్టల గట్టుకొంటి పురుషా రావయ్యా

పురుష రత్న మా రావయ్యా
నీ రాకడ నా ప్రాణము రాక యగును
చెన్న మల్లికార్జునయ్యా! రావయ్యా
నీ వొచ్చెదవని దారి చూచి చూచి
నోట తడియారి బడలితి నయ్యా!

౨౯౯

ఇంద్రనీలగిరి నెక్కి చంద్రకాంతశిలను త్రొక్కి
కొమ్మూదుచు నెన్న డుందునో శివా
మిమ్ము స్మరించుచు నే నెన్న డుందునో శివా
అంగ మన భంగములు నశించి
చెన్నమల్లికార్జునయ్యా నిన్నెన్న డొకసారి
కలియుదు నయ్యా

౩౦౦

పగటికూటమి కని పోరాడి బెండైతి
రాత్రికూటమి కని చోటెరిగి వచ్చితి
కలలో మనసు కలిసి మైమరచి యుంటి
మనస్సులో మై మరచి కలిసి యుంటి
చెన్నమల్లికార్జునుని చూచి కన్ను దెరిచితి

౩౦౧

చూచుచు చూచుచు కన్నులు మూసితి చూడమ్మా

వినుచు వినుచు మై మరిచి ఒరిగితి చూడమ్మా
పరిచిన ప్రాణ్ము మరిచి పోతి వినవమ్మా
చెన్నమల్లికార్జునదేవుని కూడెడు కూటమి
ఏమని అరయక నే మరిచితి గన వమ్మా

౨౬౨

అక్కయ్యా వినవే నే నొక్క కల గంటి
పోకలు బియ్యము పత్రము టెంకాయల గంటి
చిన్న చిన్న జడలు చక్కని పల్వరుస గల జోగి
ఇంటికి భిక్ష కని వచ్చినది గంటి నమ్మా
మితి మీరిన మోహాముతో వెన్నాడి కై బట్టితి
చెన్నమల్లికార్జునుని జూచి కన్ను దెరచితి నమ్మా

౨౬౩

చెలీ వినవే వినవే నే నొక కల గంటి
నొకజోగి గిరిపై కూర్చున్నది కంటి
చిన్న చిన్న జడలు చక్కని పల్వరుస గల
జోగి వచ్చి నన్ను కూడెను చూడవే
అతని అబ్బుకొని సద మద మైతినే
చెన్నమల్లికార్జునుని గాంచి
కన్ను మూసి తెరచి అచ్చరు వొందితి

౨౩౪

పసిడి పసుపు పసిడి పసుపు
పసిడి పసుపు గొనుడమ్మా
నా ప్రియుని మేనుకు తగినట్టి
పసుపును గొనుడమ్మా
లో నింకని పసుపు నలది
చెన్నమల్లికార్జునుని అప్పు కొనుడమ్మా.

౨౩౫

నేడు నా యింటికి మగ డొచ్చెను చూడమ్మా
మీరు మీరందు సిద్ధము గండ్రు
చెన్నమల్లికార్జును డిప్పుడే వచ్చును
ఎదురుకొందము రండో యమ్మలారా.

౨౩౬

పెంపే పాన్పు చూపే ఆభరణము గౌగిలింపే వస్త్రువు
చుంబనమే ఆరోగణము ప్రీతిపలుకులే తమలము
ఉత్సాహామే అనులేపనము నాకు
చెన్నమల్లికార్జునుని కూటమే పరమసుఖ మమ్మా

౨౩౭

మోహాము స్నేహామై ఒప్పినవిధమును గనుమా

మెలకువయైన వేడిమి లేనటు లుండ వలె
అదుముకొనిన అస్థులు నుగ్గునుగ్గు కావలె
కూడిన కూటమి తెలియ నటులుండ వలె
మోహాము ఒప్పెను చెన్నమల్లికార్జునుని
చనువు నందు ఓ తల్లీ!

౨౬౮

నా మనసు మార్చు కొనె నమ్మా
నా తనువు చేర్చు కొనె నమ్మా
నా సుఖము నొప్పు కొనె నమ్మా
నా ఇరవును ఆశ్రయము జేసు కొనె నమ్మా
చెన్నమల్లికార్జునుని వలపు గలదానను

౨౬౯

బుసకొట్టు పామును కట్టి ఊరి బైట నుంచి
పిలువనంపిన చెలియను కూడెను చూడవే
తుర్యావస్థయందు వూగి వూగి చూచి చూచి
వెరుగొంది నే నిలువలేనే తల్లీ
ఆ యవస్థను చూచి దుఃఖించి కనలితినే
గిరు లుడికి తరులుబడి పొన్నపూలు వూచి
మ్రాలు తునకలుకాగ గొప్పతనము జెరిచి
కూడెదను చెన్నమల్లికార్జునుని,

౨౭౦

గిరులందు వనములందు చెట్టు చెట్టునందున్న
దేవా ఓ దేవా రావయ్యా జూపుమయ్యా
నీకృప యంచు,
వెదకుచు ఏడ్చుచు నిన్ గానక ఉస్సుమని
వచ్చి చూచితి శరణుల సంగమందు
వెదకి దొరికించుగొందునని
నీవు దాగియుండు తావును చెప్పుమా
చెన్నమల్లికార్జునా.

౨౭౧

పగలు నాలుగుజాములు నీ చింత యందుంటి
రాత్రి నాల్గుజాములు లింగవికలావస్థ యందుంటి
రేయింబవళ్ళు నీ కోర్కెతో మై మరిచి ఒరిగియుంటి
చెన్నమల్లికార్జునయ్యా నీ వలపు నాయెద నాటిన
ఆకలి దప్పి నిద్రల వదలితి నయ్యా.

౨౭౨

తెల్లవారగనె లేచి నిన్ను దలచెద నయ్యా
కస్తూరిచాన్పిచల్లి నీ రాక కెదురు చూచెద నయ్యా
పచ్చని పందిరేసి నీ రాక కుంచితి నయ్యా
ఓ దేవా చెన్నమల్లికార్జునయ్యా నీ వెప్పుడొత్తు వయ్యా.

౨౭౩

భ్రమర సమూహమా మామిడివనమా
నిండు వెన్నెలా ఓ కోకిలా!
మిమ్మెల్లరను నే నొక్కటి వేడెద
నా యొడయడు చెన్నమల్లికార్జునదేవుని
మీరు చూచిన పిలిచి చూపరే,

౨౭౪

చిలిమిలి చిలిమిలి యని పలికెడు చిలుక లారా
మీరు కంటిరే మీరు కంటిరే!
స్వరమెత్తి పాడెడు కోకిలలారా
మీరు కంటిరే మీరు కంటిరే!
మధువాని తిరిగెడు తుమ్మెద లారా
మీరు కంటిరే మీరు కంటిరే!
కొలనులందాడెడు కలహంసలారా
మీరు కంటిరే మీరుకంటిరే!
గిరిగహ్వరములం దాడెడు నెమలులారా
మీరు కంటిరే మీరు కంటిరే!
చెన్నమల్లికార్జునుం దెచ్చుట గలదని
మీరు తెలుపరే మీరు తెలుపరే.

౨౭౫

సజ్జిక వీడి నా కరస్థలమునకు దిగివచ్చి
ప్రజ్వలించి థళ థళ మను కాంతిని వెదజల్లు
లింగ మందు నా తను మన దృక్కు లంజేర్చి
ఉప్పొంగు నట్టి శివ సుఖము నందోల లాడుచు
సజ్జన సద్భక్తి ప్రీతితో కూడి యాడి
లజ్జను వీడి నిన్ను కూడెద చెన్నమల్లికార్జునా.

౨౭౬

కామించి కల్పించి కనలి బడలితి నమ్మా
మోహించి ముద్దిచ్చి మరులైతి నమ్మా
తెరదీయక మదివీడక వలచినమ్మితి నమ్మా
నా దేవుడు చెన్నమల్లికార్జునుడు
న న్నొల్లకున్న నే నేమందు నమ్మా.

౨౭౭

కూడి కూడెడు సుఖమున కన్న
కొంత వదలి కూడెడు సుఖము లేసు
సఖియా! ఒకసారి వదలి చూడక నుండ లేనే
నా దేవుడు చెన్నమల్లికార్జునుని
వదలీ వదలని సుఖ మెన్న డబ్బునో

౨౭౮

పట్టుకొందు ననిన పిడికిలిలో రాడమ్మా
    అపుదు ననిన తప్పుకొని పోవు నమ్మా
    కొంత వదలి కలత జెందితి నమ్మా
చెన్నమల్లికార్జునుని గానకున్న
    నే నెవరనున దెరుంగ వినవే తల్లీ!

౨౭౯

కన్నులలో ప్రకాశించి వెలుగుచున్న
    దివ్యరూపము గాంచి మై మరచి తమ్మా
మణిముకుటము ఫణికంకణము నగుమోము
    చక్కని పల్వరుస గల సుందరుని గాంచి
    మనసున మోహించితి నమ్మా
ఇట్టి చెన్నమల్లికార్జునుడు వరుడు నాకు
    నే నతని వధువును విన వమ్మా తల్లీ

౨౮౦

అందరి మగల శృంగారము వలె గాదు
    నా ప్రియుని శృంగార విధమే వేరు
శిరమున కంకణము ఉరమున అందె

చెవులలో పాదుక లుండును
ఉభయ శ్రీమంతుని మోకాలియందు జడబిల్ల
అంగుటము నందు నత్తు ఇది జ్ఞానుల కందరానిది
చెన్నమల్లికార్జునుని శృంగార విధమే వేరు.

౨౮౧

తలపై చింగులు నడుమున పిగ
మోకాలునందు బొపోగుల గంటి
చిన్నవానికి పరవశపు దుస్తులు
ఏకాంతమందు కలిసి ముఖమును చూచి చూడక
చెన్నమల్లికార్జునుని గలియు తీరే వేరు.

౨౮౨

స్త్రీ స్త్రీయైన పురుషునికి సూతకము
పురుషుడు పురుషుడైన, స్త్రీకి సూతకము
మనోసూతకము తగ్గిన
తను సూతకమునకు తెర వుండునా
అయ్యా మొదలులేని సూతకమునకు
మరులాయె జగమెల్ల

నా దేవుడు చెన్నమల్లికార్జునను ఘనునకు
జగమెల్ల స్త్రీలే చూచితివా!

౨౫౩

అత్త మాయ మామ సంసారి
మరదులు ముగ్గురు పులు లంతవారు
తోడికోడండ్లు నల్గురు వినవే సఖీ
బావలైదుగురిని గొనిపోవు దేవుడు లేదు
ఆరుగురు వదినెల మీర జాల
తల్లీ! చెప్పవలెనన్న ఏడు సేవకులు కాపు
కర్మయను మగని నోరు గొట్టి
సరస మాడెద హరునితోడ
మనస్సను సఖి ప్రసాదము వలన
అనుభావము పొందితి శివుతోడ
చూడ సుందరుండగు శ్రీశైల చెన్నమల్లికార్జునను
సజ్జనుని మగనిగా జేసికొందు.

౨౫౪

పోతిని ఊరికి ఉంటిని నే నచట
పోయిన మరల నిటు రా నమ్మా

ఐదుగురు భావలు ఐదుగురు యారండ్రు
ఈ ఐదుగురు కూడి నన్ను పీడింతురు
తిట్టుదురు కొట్టుదురు మరి తూల నాడెదరు
ఐదుగురి బాధలకు నెటులోర్తు, చూడవే
అత్త మామ మరది యారాలు
చిత్తము నొరబట్టి చూచు మగడు
చీకటైయైన పిలిచి బువ్వ బెట్ట వమ్మా
వదినె పద్దెనిమిది నుడువు నమ్మమ్మా తల్లీ
ఉపమాతీతులు రుద్రగణములు
వారు నా బంధు బలగములు
శ్రీశైల చెన్నమల్లికార్జునుడు వలచిన
మరల రానమ్మా తల్లీ!

౨౧౫

గిరులందుగాక కంచెల యందాడునా నెమలి?
కొలను లందు గాక కాల్వల జొచ్చునా కలహంస?
మామిడిచిగురులందు గాని కూయునా కోకిల?
పరిమళములేని పూలపై వ్రాలునా తుమ్మెద?
నా దేవుడు చెన్నమల్లికార్జునుడు గాక

అన్యుల జేరబోవునా నా మనసు
చెప్పరే చెలియలారా!

౨౮౬

సంగమము వలననే గదా అగ్ని రగులుట
సంగమము వలననే గదా విత్తు మొలచుట
సంగమము వలననే గదా పూలు విప్పుట
సంగమము వలననే గదా సుఖముల బడయుట
చెన్నమల్లికార్జునయ్యా
మీ మహానుభావుల సంగమము వలన
నే పరమసుఖి నైతినయ్యా

౨౮౭

చెట్టు చెట్టు రాపిడివలన అగ్ని బుట్టి
చుట్టుముట్టునున్న చెట్లనెల్ల కాల్చెను
ఆత్మ ఆత్మ మంథనము వలన
అనుభావమను అగ్ని బుట్టి
నా యందలి తనుగుణాదుల కాల్చెను
ఇట్టి అనుభావుల అనుభావమును జూపి

నా యొడలిని కాపాడుము
ఓ చెన్నమల్లికార్జునా!

౨౮౭

సుఖసారానుభావుల స్థితి
సుఖసారానుభావులకే తెలియు
నిస్సీములతో నిస్సీములు కూడిన సుఖము
ఆ పరమ సుఖానుభావులకే తెలియు
మద్దేవా! చెన్నమల్లికార్జునా
మీ లింగైక్యుల స్థితి లింగైక్యులకే తెలియు

౨౮౮

అయ్యా మీ శరణులతో కూడిన
సుఖము ఉపమింప రాదయ్యా
అయ్యా మీ మహాంతుల కలసి
వదలు శ్రమ కన్న చచ్చుటే మేలయ్యా
చెన్నమల్లికారునయ్యా మిమ్మెరింగిన
మహాంతుల వదలి నే నిలువ లేనయ్యా

౨౮౯

శవమును మోయు విధి నొదలితి వమ్మా

పొన్ను పొలముల మాయను మీరితి నమ్మా
నా తనువందలి లజ్జ నొదలితి నమ్మా
నా మనస్సందలి చీకటిని పోగొట్టితి నమ్మా
చెన్నమల్లికార్జునుని లోనైన దానను
నన్నేమని మందలించెద రమ్మా

౪౯౧

గొడ్రాలు పురిటి బాధ నెరుంగునా
మారుతల్లికి ముద్దు తెలియునా
నొచ్చిన వారి నొప్పి నోయని వారికి తెలియునా
చెన్నమల్లికార్జునయ్య గ్రుచ్చిన శూలము
ఒడలితో దూరిన కలుగు దుఃఖమును
మీ రెట్లు తెలియుదురే ఓ యమ్మలారా!

౪౯౨

ఇహమున కొకడు పరమున కొకడా
లౌకికమున కొకడు పారమార్థమున కొకడా
నా మగడు చెన్నమల్లికార్జున దేవుడు తప్ప
తక్కిన వారు మొగులు చాటుకున్న బొమ్మల వలె

౨౯౩

తను వసువయ్యేను మన స్సనువయ్యేను
ప్రాణ మనువయ్యేను కోపించి రాని దెందుకు
నా ప్రాణమందు కూడి మనస్సుకు మనసై నిలచిన
నా దేవుడు చెన్నమల్లికార్జునుని జూడక
నే నెట్లు బ్రతుకుదు నయ్యా

౨౯౪

తను మనములు అర్పితమై నందున
భావము అచ్చుగొని యున్న దమ్మా
మెచ్చిన వాని స్నేహము కపటము లేని మెప్పు
బెదరి భయపడిన భావముతో
చెన్నమల్లికార్జునయ్యలో గూడి యుంటి నమ్మా

౨౯౫

తుమ్మ ముండ్లవలె నమ్మా పరమగలు నాకు
ముట్టలేను చుట్టు తిరుగ లేను
నమ్మి మెచ్చి మాటలాడ లేనమ్మా వారితో
చెన్నమల్లికార్జునుడు గాని మగవారల

ఎదయందు ముండ్లుండునని
వారినినే నెదజేర్పనమ్మా

౨౯౬

ఒడలులేని నుడువలేని కడలేని
ప్రియతము నోడ గూడి సుఖి నైతి వినరయ్యా
ఊస పుసికాదు అన్యము గోరను
ఆసించను మరొక సుఖమును
ఆరుచెడి మూడై మూడుచెడి రెండై
రెండుచెడి ఒకటై నిలిచితి నయ్యా
బసవన్న మొదలగు శరణులకు శరణార్థి
ప్రభువు వలననే కృతకృత్యురాల నైతి
మరువ వలదు మీ బిడ్డను నే నని చెన్నమల్లికార్జుని
కూడి యుండు మని దీవింపు డయ్యా!

౨౯౭

కరస్థలమున లింగము స్వాయత మైన పిదప
కాయకనివృత్తి గావలయు
అంగమున కలవడిన లింగము-లింగైక్యునకు
అంగసంగము మల్లెక్కడి దోయి

మహాఘనము నెరింగిన మహాంతునకు
మాయ ఎక్కడిదోయి చెన్నమల్లికార్జునా!

౨౯౮

రాయి తాకిన పెల్ల కొందరిని తాకునట్లు
నే నెరింగితినను నడువు చెల్లదు
లింగము మరుగున దాగియున్న మనసు
బయట బీసర పోవునా
మంట నంటిన కోల గరి జూపునా
వనములపై వీచుగాలి సువాసన గూడినట్లు
చెన్నమల్లికారుననితో ఏకము గావలయు.

౨౯౯

కామారిని గెలిచితి బసవా నీ దయ వలన
సోమధరుని బట్టితి బసవా నీ దయ వలన
పేరుకు ఆడదాన ననిపించుకొన్న నేమి
భావింప మగరూపు బసవా నీ దయ వలన
అతికామి చెన్నమల్లికార్జునుని జతగూడి
రెండుగా తెలియనటు లేక మైత్రి
బసవా నీ దయవలన

౩౦౦

కాముడు బలవంతు డనిన కాల్చి భస్మము జేసె
కాలుడు బలవంతు డనిన కూల్చి త్రొక్కె
ఓ యమ్మా నీవు వినవే తల్లీ
బ్రహ్మ బలవంతు డనిన శిరమును చెండాడె
ఓ యమ్మా నీవు వివవే తల్లీ
విష్ణువు బలవంతు డనిన ఆవుల కాయ బెట్టె
త్రిపురముల కోట బలిమైన దనిన
నొసటికంటిచే గాల్చె నమ్మా
గాన చెన్నమల్లికార్జునుడు మగడు నాకు
జననమరణములకు లోను గాని
ఘనబలాఢ్యు నేమని వర్ణింతు నమ్మా

౩౦౧

చేతి యందలి ధనము దండుగ గొన వచ్చు గాని
ఒడలియందలి ధనము గొన వచ్చునా
కట్టిన బట్టల పెట్టిన సొమ్ముల లాగవచ్చు గాని
మరుగున్న నిర్వాణపదమును లాగ వచ్చునా
చెన్నమల్లికారుని ప్రకాశము మేన ధరించి

లజ్జను వదలిన దానికి కట్టుకొను చింత
మం౹ల నెందుకో మూర్ఖుడా

౩౦౨

అయోనిజుడు గనుక కుల మదము లేదు
అప్రతిముడు గనుక చలమదము లేదు
త్రికరణ శుద్ధుండు గనుక ధనమదము లేదు
అసాధ్యసాధ్యుడు గాన విద్యా మదము లేదు
నీవు పట్టుకొని నం ౹ున మరే మదము లేదు
చెన్న మల్లికార్జునయ్యా మీ శరణుడు
అకాయచరిత్రుడు

౩౦౩

తుమ్మెద తలంపుచే తుమ్మెదయైన పురుగు
తన గూటి యందుండునా అయ్యా!
నేను నిన్ను తలంచుచున్నందున
నా కర మన భావములు తుమ్మెదలై మత్తు లేని
నీ కూటపు మధురస్వప్న మెన్నడుచూతునో
చెన్నమల్లి కార్జునా

౩౦౪

కాయమందలి కలవరమను చెడిపి
మనసునందలి మాయను తుడిచి
ప్రాణమును పైకెత్తి కాపాడితివయ్యా నన్ను
శివ శివా నాభవము తప్పించి మీ సాన్నిధ్యము
జూపిన ఘనత సాటిలేని దయ్యా
రాత్రిళ్లు మరుగుపడు చక్రవాకపక్షివలె
మీ శ్రీ పాదములందు జేరిన సుఖమున నే
నోలలాడెద నయ్యా చెన్నమల్లికార్జునా

౩౦౫

తన అవసరమునకు పగలు కన్నము వేసిన
కన్నము బడలేదు సొమ్ము దొరకలేదు
తుమ్మచెట్టెక్కిన కోతికి
తిన పండులేదు నిలువ తావులేదు
సర్వసంగపరిత్యాగ మొనర్చిన దానగాను
నిన్నుకూడి కులము చెడిన దానగాను
చెన్నమల్లికార్జునా

౩౦౬

గగనపు విస్తీర్ణము చంద్రు డెరుంగునే గాని
గాలిలో నెగురు గ్రద్ద తెలియునా అయ్యా
కొలను గంభీరము కమల మెరుంగునే గాని
దరి యందుండు దర్భ తెలియునా అయ్యా
పువ్వుల సువాసన తుమ్మెద తెరుగునేగాని
చెట్లను తొలుచు పురుగు
తెరుంగునా అయ్యా చెన్నమల్లికార్జునా
మీ శరణులమహిమ మీరెరుంగుదురే గాని
అజ్ఞానమానవు లెట్లెరుగుదు రయ్యా

౩౦౭

నిత్యమను నిజపదవి సమీపించి కనుపించగ
చిత్తము కరిగి మనసు అలరి
హృదయము వికసించెను చూడయ్యా
అటు ఇటను నదెరుంగక చెన్నమల్లికార్జునా,
నీ పాదములందు మరిచి నిదురించితినయ్యా

౩౦౮

మగవాని ఎదుట మాయ

స్త్రీ యను అభిమానమై పీడించె నయ్యా
స్త్రీ ఎదుట మాయ
పురుషుడను అభిమానమై పీడించెనయ్యా
లోకమను మాయకు
శరణుల చరిత్ర పిచ్చిగ తోచునయ్యా
చెన్నమల్లికార్జునుడు వలచిన శరణునకు
మాయ లేదు మరుపులేదు అభిమానము లేదు.

౩౦౯

గట్టునందు తేమ లేదందురు
చెట్టు పుట్టు విధ మెట్టులయ్యా
బొగ్గులందు తైలము లేదందురు
ఇనుము కరుగు విధ మెట్టులయ్యా
నాకు కాయము లేదందురు
చెన్నమల్లికార్జున దేవుడు
వలచిన విధ మెటులయ్యా!

౩౧౦

లింగ సంగ సుఖమందు మనసు వేద్యమయ్యె
ఇం కెక్కడయ్యా నీ యందు నిరవయవ మగుట

ఇంకెక్కడయ్యా నీ యందు కూడుట
పరమసుఖ పరిణామము మనసున మేరెమీరి
నేను నీయందు పొందు తావేది తెలుపుము
చెన్నమల్లికార్జున ప్రభూ

౩౧౧

చచ్చిన పీనుగు కూయుట గద్దు
దాచిన నిధానము పిలుచుట గద్దు
తోడేసిన పాలు గట్టిగై తియ్యనగుట గద్దు
దీని నిశ్చయించి చూడుము
చెన్నమల్లికార్జున దేవుని యందు

౩౧౨

మై మరచి నిదురించి కల గని
చెప్పినపుడు చచ్చిన పీనుగు లేచె
తనకు రాసున్న నిధానము లేచి పిలచె
తోడుబెట్టిన పాలు గట్టి నెయ్యియై తియ్యనయ్యె
దీనిని తప్పని సాధించు టెందులకు
చెన్నమల్లికార్జున దేవదేవుని అన్నలారా!

౩౨౩

కాలిన బూడిదలో కాలని బూడిద కొంత గంటి
ఆ కాలని బూడిద రాసి బోసిన వాని గుట్టు
నెవరు కనుగొనలేరు
నే నతనిని కనుగొని శరణని బ్రదికితి
ఆ గట్టుపై అనేకవస్తువుల జూచి
చరించు చున్నా నయ్యా చెన్నమల్లికార్జునా.

౩౨౪

లోకము బట్టి లోకమును విడిచి నటులుంటి
నిరాకారమును బట్టి సాకారమందు నడిచెద
బైట ఉపయోగించి లోన మరిచినటులుంటి
కాలిన నులుకవలె పురి నొదల కుంటి
ఓ దేవా చెన్నమల్లికార్జునా
పదిలో పదకొండునై జలమందలి
కమలమువలె నున్న నయ్యా.

౩౨౫

కనబడు సూర్యుని ప్రకాశము
ఆకాశము యొక్క విస్తీర్ణము
వాయువు యొక్క చలనము
తరు గుల్మ లతాదుల పత్ర పుష్పాదులు

షడ్వర్ణములెల్ల నీ పగటి ప్రకాశము
చంద్రుని ప్రకాశము నక్షత్ర అగ్ని విద్యుత్తులు
దీప్తి యననిపించునవి నీ రాత్రిపూజ
రేయింబవళ్ళు నీ పూజ యందుండి
నన్ను నే మరిచి యున్నానయ్యా
చెన్నమల్లికార్జునా.

౩౧౬

నాభి క్రిందికి బట్ట జారిన చూచితివా
సిగ్గుపడుదురు ఆడ మగ యను జాతివారు
ప్రాణప్రభువు జగమంత నిండి యుండగా
ప్రభువు ఎదుట సిగ్గుపడు చోటు గలదా
చెన్నమల్లికార్జునుడు జగమంత కన్నై చూచుచున్న
దాయుటకు మూయుటకు తావేది చెప్పుమా

౩౧౭

ఆకారము లేని నిరాకారలింగమును
చేత బట్టి మెడలో కట్టితి మనెద రజ్ఞానులు
హరిబ్రహ్మలు వేద పురాణాగమములు
వెదకి చూడ జాలని లింగము
భక్తికి ఫలమే గాని లింగము గాదు
జ్ఞానానికి పరిక్రమణమే గాని లింగము గాదు

వైరాగ్యానికి ముక్తియే గాని లింగము గాదు
గాన తన్ను తా దెలిసి తానైన చో
చెన్నమల్లికార్జునుడు తానే వేరు గాదు.

౧౧౮

ముదిరిన వెదురు మరల మొలకెత్త గలదా
కాలిన కడువ మరల మన్ను కాగలదా
తొడిమె వీడిన పండు మరల తొడిమె నంటునా
కర్మిష్ఠి మనుజులు కన్నుగానక నుడివిన
నిష్ఠగల శరణులు మరల మర్త్యమునకు
వత్తురా చెన్నమల్లికార్జునా.

౧౧౯

కట్టిన చెరువుకు తూము తప్పదు
పుట్టిన ప్రాణికి చావు తప్పదింకెటు లయ్యా
పెద్దలారుగురు వృధా చెడిరింకెటులయ్యా
చెన్నమల్లికార్జున దేవుని ప్రేమించి
ముట్టిన వారెల్ల నిశ్చింతులైరి.

౧౨౦

అన్ని ఎన్ని దెలిసిన ఫల మేమయ్యా
తన్ను తా దెలియ కున్న

తన యందు జ్ఞానము స్వయమై యుండగ
ఇతరుల నడిగిన నుండునా
చెన్నమల్లికార్జునా
నీవు జ్ఞానమై నా ముందు కనిపించి నందున
నీ వలన నిన్నెరింగితి నయ్యా ।పభూ.

౩౨౧

పుట్టితి (శ్రీ) గురుని హస్తమందు
పెరిగితి అసంఖ్యాకుల కరుణయందు
భావ మను పాలు సుజ్ఞాన మను నెయ్యి
పరమార్థ మను చెక్కర బెట్టిరి కంటివా ఇట్టి
త్రివిధామృతము తనివిదీర పెట్టి పెంచిరి నన్ను
తగిన వరునకిచ్చి పెండ్లి చేసిరి
ఇచ్చిన ఇంటికి పంపుటకని
అసంఖ్యాకులెల్ల కూడివచ్చితిరి
బసవన్న మెచ్చువట్లు సంసారము జేతును
చెన్నమల్లికార్జునుని చై బట్టి
మీ తలకు పూలు దెత్తునే గాని పూరి దేను
అవధరింపుడు మీ పాదములకు
శరణు శరణార్థి తరలి పోందు.

# అక్కమహాదేవి వచనములు

## ఐక్యస్థలము

౩౨౨

ఓ దేవా కరణాదుల ఉపద్రవమునకు
భయమొంది మీ శరణుల మరుగు జొచ్చి
కారుణ్యమును బడసితి
మీ శ్రీ మూర్తిని జూచితి
ఇక నన్ను నీలో జేర్చుకొనుమా చెన్నమల్లికార్జునా.

౩౨౩

ఆత్మ నిర్యాణము కరణముల విశ్రాంతి
అంగలేపనము క్రియాజ్ఞానము
సర్వాచార సహజ సమరసము
నిరహంకార నిష్పత్తిచే ఐక్యుని నిజస్థలము
ఆత్మజ్ఞానములో జ్యోతిర్లింగము గాన రాదు
మాటల మాలకు చిక్కునతడు గాడు
ధాతువును చెడిపి మనసును చూచి పీడించును
ఆత్మ అంతు నెరింగిన యతడే శివయోగి

అతని పాదములకు శరణందును

గనుమా చెన్నమల్లికార్జునా.

౩౨౪

కూడ దలచినచో బిరాన నగు పడు

వెడల గొట్టకు నన్ను బయటికి

మీ కొరకై నన్నర్పించు కున్న దాన

చెన్నమల్లికార్జునయ్యా

నిన్ను నమ్మి నీ వెంటబడి వచ్చితి

నన్ను నీ లో గొనుమయ్యా వేగమే.

౩౨౫

కాయ మందు అకాయ మయ్యె

జీవమందు నిర్జీవ మయ్యె

భావమందు నిర్భావ మయ్యె

నా మనస్సందు ఘనస్మరణ యయ్యె

నా కరణాదుల జూచి గాచినందున

చెన్నమల్లికార్జునయ్యా నేను నీ ధర్మము దాన.

౩౨౬

నచ్చును మనసు మిమ్ము మెచ్చును మనసు మిమ్ము

కూడును మనసు మీతో ఓడును మనసు మీతో

దుఃఖించు మనసు మీకు శ్రమించు మనసు మీకు
కరుగును మనసు మీలో అరుగును మనసు మీలో
కాలిన ఇనుము నీటిని త్రాగినటుల
కలియును నా పంచేంద్రియములు
చెన్న మల్లికార్జునా మీ యందు.

౩౭౨

అయ్యా గట్టినెయ్యి కరిగిననెయ్యికి భేద ముండునా
దీపము దీప్తికి భేద ముండునా
అంగము ఆత్మకు భేద ముండునా
శ్రీగురుడు నా అంగమును
మంత్ర పిండముగా చేసి చూపినందున
సావయవ నిరవయవములకు భేదము లేదయ్యా
చెన్న మల్లికార్జుని యందు గూడి మతి చెడిన దాన
నన్నెందుకు మందలింతు రయ్యా.

౩౭౩

అంగమందు అంగమై
అంగమును లింగైక్య మొనరించితి
మనసునందు మనసై

మనసును లింగైక్య మొనరించితి
భావమందు భావమై
భావమును లింగైక్య మొనరించితి
జ్ఞానమందు జ్ఞానమై
జ్ఞానమును లింగైక్య మొనరించితి
తెలివి యందు తెలివినై
తెలివిని లింగైక్య మొనరించితి
క్రియ లన్నింటి నిలిపి క్రియాతీతనై
నివృత్తిని లింగైక్య మొనరించితి
నే ననుట నిలిపి నీ వనుట చెరిచి
ఉభయమును లింగైక్య మొనరించితి
చెన్నమల్లికార్జునందు లయమైతి గాన
లింగమను ఘనము నాయందు లయమయ్యె
చూచితివా సంగన బసవన్నా.

౩౨౯

అంగ సంగమందు లింగసంగినైతి
లింగ సంగమందు అంగసంగినైతి
ఉభయసంగము నరయక పరిణామినైతి
నుడి గడణము మరచి దారి తెలియకుంటి

నా దేవుడు చెన్నమల్లికార్జునందు కలిసిన
పిదప నన్నునే నేమని నరయ నయ్యా.

౩౩౦

లింగ మనను లింగైక్య మనను
సంగ మనను సమరస మనను
ఐన దనను లేదనను నీ వనను నే నన
చెన్నమల్లికార్జునయ్యా
లింగైక్య మైన పిదప ఏమియు ననను.

౩౩౧

అంగము క్రియాలింగమును వేధించి
అంగము లింగమందు కూడె
మనసు జ్ఞానమందు గలిసి జంగమ సేవజేసి
మనసు జంగమలింగమందు కూడె
భావము గురులింగమందు కూడి
మహాప్రసాదమును భోగించి
భావము గురులింగమందు గూడె
చెన్నమల్లికారునా
నీ వలపువలన భేద ముడిగి
స్వయం లింగమైతి నయ్యా ప్రభూ

౩౩౨

కర్మయను కదళి నాకు కాయమను కదళి నీకు
క్రియ యను కదళి బసవన్నకు
భావమను కదళి చెన్నబసవన్నకు
వచ్చిన భావము లన్నియు చక్కగ కూడెను
చెన్నమల్లికార్జునా నా యంగమున
కవసాన మెప్పుడు తెలుపుమా!

౩౩౩

కదళి యనునది తనువు కదళి యనునది మనసు
కదళి యనునది విషయాదులు
కదళి యనునది భవఘోరారణ్యము
ఈ కదళి యనుదానిని గెలిచి నశించి బ్రదికి వచ్చి
కదళివన మందు భవహరుని గంటి
"భవమును గెలిచి వచ్చిన బిడ్డా" యనుచు
కరుణతో నెత్తి బిగిరేగిట చేర్చగ
చెన్నమల్లికారునుని హృదయ కమల మందడగితి

౩౩౪

ముత్యము నీటియందు బుట్టె
వడగల్లు నీటియం దయ్యె

ఐక్యస్థలము

ఉప్పు నీటి యందయ్యో
ఉప్పు కరిగెను వడగల్లు కరిగెను
ముత్యము కరుగుట నెవరైన జూచిరా!
ఈ సంసారపు మానవులు
లింగమును ముట్టి భవభారులైరి
నేను నిన్ను ముట్టి లయమైతినయ్యా
చెన్నమల్లికారునయ్యా.

౩౩౫

మూలద్వారమను వేరు నెక్కి
భూమండలము నెక్కితి
ఆచారమను వేరును బట్టి
ఐక్యము తుది నెక్కితి
వైరాగ్య సోపానములతో శ్రీగిరి నెక్కితి
చైబట్టి లాగుకొనుమా చెన్నమల్లికారునా.

౩౩౬

వనమంతయు నీవే
వనమందలి తరు లన్నియు నీవే
తరులం దాడెడు

ఖగ మృగము లెల్ల నీవే
చెన్నమల్లికారునా!
సర్వభరితుండవై యయ్యుండి
నా కెందుకు ముఖము జూపవయ్యా.

౩౩౭

వనమంతయు కల్పతరులు
తరులన్నియు సంజీవి కట్టులు
శిలలన్నియు స్పర్శమణులు
నేలయంతయు అవిముక్త క్షేత్రము
జలమంతయు నిర్జరామృతము
తాకు రాళ్ళన్నియు చింతామణులు
చెన్నమల్లికారునయ్య మెచ్చిన గిరిని
చుట్టుచు తిరుగుచు చూచి చూచి వచ్చి
ఇట గంటిని కదళివనమును నేను.

౩౩౮

మెరయు కెంజెడలు మణిముకుటము
కాంతులు వెదజల్లు దంతములు
కాంతిగల కన్నులు నగు మొగము

పదునాల్గు భువనముల ప్రకాశింపజేయు

దివ్య స్వరూపంబు గంటిని నేను

చూచిన నాకన్నుల కోర్కె దీరెను నేడు

మగల మగలందరి మగువనైయె

ఏలెడు గరిమ కంటిని నేను

జగదాది శక్తిని కూడి మాటలాడు

పరమగురు చెన్నమల్లికార్జునుని

ఉనికిని గాంచి బ్రతికితి నేను.

౩౩౯

లింగస్థలము నెరింగితి మను

పరబ్రహ్మలు మీరు వింటిరే

లింగస్థలము నిఃశూన్య మయ్యె

సంగమదేవుని వెన్నునందు

జంగమస్థలము నెరింగితి మను

పరబ్రహ్మలు మీరు వింటిరే

జంగమస్థలము నిఃశూన్య మయ్యె

ప్రభుదేవుని వెన్నునందు.

భక్తస్థలము నెరింగితి మను

పరబ్రహ్మలు మీరు వింటిరే

భక్తస్థలము నిః శూన్య మయ్యె
సంగనబసవన్న వెన్నునందు
ప్రాణలింగిస్థలము నెరింగితి మను
పరబ్రహ్మలు మీరు వింటిరే
ప్రాణలింగస్థలము నిఃశూన్య మయ్యె
సిద్ధరామదేవుని వెన్నునందు.
ప్రసాదిస్థలము నెరింగితి మను
పరబ్రహ్మలు మీరు వింటిరే
ప్రసాదిస్థలము నిఃశూన్య మయ్యె
చెన్నబసవన్న వెన్నునందు.
ఐక్యస్థలము నెరింగితి మను
పరబ్రహ్మలు మీరు వింటిరే
ఐక్యస్థలము నిఃశూన్య మయ్యె
అజగన్న దేవుని వెన్నునందు.
ఇట్టులీ షట్స్థలములు ఒక్కొక్కరి
వెన్నునందు నిఃశూన్యము లయ్యె
నా కింకే కించిత్స్థలము కూడ లేదయ్యా
చెన్నమల్లికారునయ్యా.

౭౪౦

భక్తురాల నే నగుదు నయ్యా
కర్తృత్వ భృత్యత్వము నే నెరుంగ
మాహేశ్వరి నే నగుదు నయ్యా
వ్రత నేమ ఛలముల నే నెరుంగ
ప్రసాది నే నగుదునయ్యా
అర్పితానర్పిత భేదముల నే నెరుంగ
ప్రాణలింగి నే నగుదు నయ్యా
అనుభావ గమనము నే నెరుంగ
శరణురాల నే నగుదు నయ్యా
"శరణసతి - లింగసతి" యను భావము నెరుంగ
ఐక్యురాల నే నగుదు నయ్యా
కూడి వేరగు భేదము నే నెరుంగ
చెన్నమల్లికార్జునయ్యా!
షట్ స్థలము లందు నిఃస్థలమైయుంటి.

———

# అక్కమహాదేవి వచనములు

## సృష్టి వచనము

౩౪౧

ఆదియనాది నిత్యానిత్యము తెలియ జాలక
పేరుకు పరబ్రహ్మ మని పలుకు
వాయు ప్రాణు లెట్లు తెలియుదురోయీ
ఆ పరబ్రహ్మ నిజమగు నిలుపును.
ఆదెట్లు అనిన :
ఆదియే దేహము అనాదియే నిర్దేహము
ఆదియే సకల అనాదియే నిష్కల
ఆదియే జడము అనాదియే అజడము
ఆదియే కాయము అనాదియే ప్రాణము.
ఈ రెండింటి యోగమును భేదించి
తనలో తానే తెలిసి చూచిన
ఆది సంబంధముగల భూతములు నేనుగాను
దశవిధేంద్రియులు నేను గాను
దశవాయువులు నేను గాను

అష్టమదములు సప్తవ్యసనములు
అరిషడ్వర్గములు షడూర్మములు
షడ్భ్రమలు షడ్భావ వికారములు
షట్కర్మలు షడ్ధాతువులు
తనుత్రయములు జీవత్రయములు
మలత్రయములు మనత్రయములు
గుణత్రయములు భావత్రయములు
తాపత్రయములు అంతఃకరణములు
ఇట్లు కనుపించు నవేవియు
నేను గాను నావి గావవి
ఇట్టివన్నియు నా యాధీన మందున్నవి
నేను వీని యాధీన మందున్న దానగాను.

నేను తూర్య తూర్యాతీతనై యున్న
సత్తు చిత్తానంద నిత్య పరిపూర్ణ
వస్తువే తన ఆవాసమని తెలియుదు
అట్లు తెలిసినంతనే అనిత్యపు పొందును విడిచి
ప్రశాంతమందు గల నిజము నరయక
భౌతిక తత్త్వసంబంధియై యుండగా

ఇటు లీతత్త్వము ఆది తా నెట్లనగా
ఆ పరబ్రహ్మముగు నిత్య నిరాళ నిఃశూన్యలింగమే

తన లీలా విలాసముతో తానే
సునాద బిందు ప్రకాశ తేజోమూర్తియై
నిలిచి మహాలింగ మనిపించె
ఆ మహాలింగమే పంచసాదాఖ్య మనిపించె
ఆ పంచసాదాఖ్యమే పంచలింగ ప్రకాశ మనిపించె
ఆ పంచలింగ ప్రకాశమే పంచముఖ మనిపించె
ఆ పంచముఖమునుండియే పంచాక్షరి యుత్పత్తి
ఆ పంచాక్షరి నుండియే పంచకళల ఉత్పత్తి
ఆ పంచకళల నుండియే పంచశక్తుల ఉత్పత్తి
ఆ పంచశక్తుల నుండియే
జ్ఞాన మన బుద్ధి చిత్త అహంకారముల ఉత్పత్తి
ఆ జ్ఞాన మన బుద్ధి అహంకారముల నుండియే
పంచ తన్మాత్రల ఉత్పత్తి
ఆ పంచతన్మాత్రల నుండియే పంచభూతముల ఉత్పత్తి
ఆ పంచభూతములే పంచీకరణమై
ఆత్మకు అంగమయ్యె
ఆ అంగమునకు జ్ఞానేంద్రియములు
కర్మేంద్రియములు ప్రత్యంగమనిపించె
ఇట్లు దేహ సంబంధము
శివుడు తన చిదంశమగు ఆత్మ సంబంధి యైనందున

ఆ సంబంధించిన కాయము పూర్వాశ్రయము
ఎచ్చట నైనదో ఆచ్చటనే నిలిపి
ఆ కాయము పూర్వాశ్రయమును నశింపజేసి
మహా ఘన లింగమును వేధించి
శివుడు తానే గురువై వొచ్చి
మహా ఘనలింగమును ఇచ్చిన విధమెట్టిదనిన
ఆత్మను కూడి పంచభూతములు
షడ్విధ అంగమనిపించి ఆ అంగమునకు
ఆ కళలు షడ్విధ శక్తు లనిపించి
ఆ శక్తులకు షడ్విధ భక్తుల నలవరచి
ఆ భక్తులకు భావ జ్ఞాన మన బుద్ధి చిత్త
అహంకారము షడ్విధ హస్తము లనిపించి
ఆ హస్తములకు మహాలింగము మొదలగు
పంచలింగములనె షడ్విధ లింగము లనిపించి
ఆ లింగములకు షడక్షరములను షడ్విధమంత్రము లనిపించి
ఆ మంత్ర లింగములకు హృదయముతో గూడి
పంచేంద్రియములను షడ్విధ ముఖములనిపించి
ఆ ముఖములకు తన్మాత్రలను
ద్రవ్య పదార్థము లనిపించి
ఆ ద్రవ్య పదార్థములు ఆ యా ముఖ లింగములందు

నిరంతర సావధానముతో
అర్పితమై ముగియగానె
అంగస్థలమందడిగి త్రివిధ
లింగాంగ స్థలములందు మిగిలి
కాయ గురు ప్రాణ లింగ జ్ఞాన జంగమ
గురువునందు శుద్ధ ప్రసాదము
లింగమందు సిద్ధప్రసాదము
జంగమమునందు ప్రసిద్ధ ప్రసాదము
ఇటులీ త్రివిధ ప్రసాదము ఏకార్థమై
మహాఘన పరిపూర్ణ ప్రసాదమును పొందిన శరణుడు
జ్ఞానిగాడు అజ్ఞాని మొదలేగాడు
శూన్యుడుగాడు నిఃశూన్యుడు మొదలేగాడు;
ద్వైతిగాడు అద్వైతి మొదలేగాడు
ఇట్టి ఉభయాత్మకుడు తానే యయ్యెను
ఇందువలన దాని మంచిచెడుల సకీల సంబంధము
చెన్నమల్లికార్జునయ్యా మీ శరణులకే తెలియును,

—0₀0—

# అధికవచనములు

౩౪౧

ఇల్లిల్లు తప్పక చేయి జాపి
అడుగునట్లు జేయుమయ్యా
అడిగిన పెట్టనట్లు జేయుమయ్యా
పెట్టిన నేలపై పడునట్లు జేయుమయ్యా
నేలపై బడిన నే నెత్తుకొనక మున్నే
శునక మెత్తుకొని పోవునటుల
చేయుమయ్యా చెన్నమల్లికార్జునా.

౩౪౨

అయ్యా చిదంగ చిద్ఘన లింగము
శక్తి భక్తి హస్త ముఖ పదార్థ ప్రసాదములు
ఆదిగా గల సమస్త తావుల సకీలముల తావుల కళల నరయక నే
జిహ్వాలంపటమునకు ఆహ్వానించి
గుహ్యాలంపటమునకు విసర్జించి
సకలేంద్రియ సుఖమందు మోహియై
సద్గురు కరుణామృతరసము తాననున దరయక
భక్త మాహేశ ప్రసాది ప్రాణలింగ శరణ ఐక్య
గురుచరపరమని ఊరక బొగడు
శునకముల జూచి నా మనస్సు ఆశ్చర్య
మొందెనయ్యా చెన్నమల్లికార్జునా

శివం — శుభం

# అక్క మహాదేవి వచనముల

# అకారాది క్రమము

## గ—ఘ



## చ

## బ—భ



## మ

# సహాయక గ్రంథములు


మహాదేవి యక్కన వచనగళు : సం॥గొ. ఆర్.సి. హిరెమఠ(రిటైర్డు వైస్ చాన్సలరు) కర్ణాటక యూనివర్సిటీ. ప్ర॥ రిజిస్ట్రారు, కర్ణాటక విశ్వవిద్యాలయ, ధారవాడ-3 ప్రథమ ముద్రణ-1973

అక్కన ప్రవచన : రచన పూజ్య లింగానందస్వాములవారు. ప్ర॥ సుబుధాన గ్రంథమాల, జగన్మాతా అక్కమహాదేవి ఆశ్రమ ధారవాడ-3 ప్రథమ ముద్రణ-1962.

శరణ చరితామృత : రచన, డా. సిద్ధయ్య పురాణిక, ప్ర॥ సంస్థానద వయస్కర శిక్షణ సమితి, మైసూరు. ప్రథమ ముద్రణ-1964.

ప్రభులింగ లీల : పిడుపర్తి సోమనాథుడు. పరిష్కర్త లిం॥ బండారు తమ్మయ్య ప్ర॥ శ్రీమతి చుక్కాకోటి వీరభద్రమ్మ గారు, వల్లూరి పాలెము. ప్రథమ ముద్రణము-1960

అల్లమన వచన చంద్రిక : సం॥ డా. యల్. బసవరాజుగారు. ప్ర॥నళినీ శంకర ప్రకాశన, మైసూరు. ప్రథమ ముద్రణ-1960

బసవణ్ణనవర వచనగళు : సం॥లిం॥ ప్రో॥ శి శి బసవనాళ ప్ర. లింగాయత విద్యాభివృద్ధి సంస్థ, లింగాయతభవన, ధారవాడ ప్రథమ ముద్రణ-1962.

కదళీవన సందర్శన (వరది) : రచన డా. హెచ్. తిప్పేరుద్రస్వామి మరియు శ్రీ మహాదేవ బణకార (కన్నడకవి) గారలు శివానుభవ ప్రవాస సమితి (అణ్ణన బళగ) సిరిగెరె 1961

తత్త్వజ్ఞశిఖామణి అక్కమహాదేవి : కన్నడ మూలము శ్రీ మా. సం. నంజప్పగారు. అనువాదము, శ్రీమతి పురాణంగిరిజమ్మగారు. శివానుభవ గ్రంథమాల తృతీయ బిల్వము. శివానుభవ సమితి, హైద్రాబాదు.

శ్రీశైలస్థల పురాణము (ఆంధ్ర శ్రీశైల ఖండము) రచన శ్రీ పోతుకుచ్చి సుబ్రహ్మణ్య శాస్త్రిగారు, ప్ర॥శ్రీశైల దేవస్థానము, శ్రీశైలము 1973.

శివానుభవ కన్నడ మాసపత్రికలు : సం॥లిం. ఫ. గు హళకట్టి గారు విజాపుర. సం౹ (౭) సంచిక (3,8,9) 1937.

"విభూతి" : ష. బ్ర. శ్రీ సదాశివ శివాచార్యుల షష్ట్యబ్ది మహోత్సవ స్మరణ సంచిక ప్రధాన సం॥ శ్రీ సూర్యసింహాసనాధీశ్వర జ. చ. ని మహా స్వాములవారు, గిరియాపుర. 1961 "బడగనాడు హేమరెడ్డి వీరశైవరు" అను వ్యాసము.

బాలయోగిని మాణికమ్మ, రచన : శ్రీ ఉడుత నారాయణస్వామిగారు సికింద్రాబాద్. ప్ర. శ్రీ యం. సి. అనంత బుచ్చన్నగారు సికింద్రాబాద్.

ఈ గ్రంథముల రచయితులకును, సంపాదకులకును. ప్రకాశకుల కును మరొకసారి నా కృతజ్ఞతా పూర్వక వందనములను తెలుపు చున్నాను.

రేకళిగె మఠం వీరయ్య.
అనువాదకుడు

---

సూచన : ఇతర శివశరణ వచనములు శరణ చరితామృతము. మరియు అక్కన ప్రవచనముల నుండి గ్రహించబడినవి.

# సవరణ

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 9 | వ్యాఘ్రుముంబు | వ్యాఘ్రముంబు |
| 3 | 24 | మల్ల | మల్లి |
| 4 | 9 | పాండిత్యమున | పాండిత్యమును |
| 4 | 23 | జూపినైనను | జూపియైనను |
| 5 | 1 | తల్లింత | తల్లితం |
| 7 | 12 | భవుని | భవిని |
| 7 | 21 | యెదలి | యొదలి |
| 9 | 16 | కిన్నరి | కిన్నెర |
| 10 | 6 | ఆమెను | ఆమెకు |
| 10 | 7 | కిన్నర అక్కమహాదేవి | |
| 10 | 7 | కిన్నరి | కిన్నెర |
| 10 | 10 | కిన్నరయ్య | కిన్నెరయ్య |
| 10 | 20 | కిన్నరి | కిన్నెర |
| 11 | 3 | శకరులకు | శరణులకు |
| 11 | 4 | అప్పన్న | అప్పన్న |
| 11 | 20 | కిన్నరయ్య | కిన్నెరయ్య |
| 13 | 11 | అనుభవ | అనుభవ |
| 13 | 16 | ఆనాది | అనాది |
| 14 | 6 | చక్తి | భక్తి |
| 14 | 9 | శివాను | శివానుభావ |

| | | | |
|---|---|---|---|
| 14 | 13 | ప్రమదుల | ప్రమథుల |
| 14 | 14 | ఇక్యము | ఐక్యము |
| 15 | 11 | యైనుహా | యైమహా |
| 16 | 15 | శిద్ధరామ | సిద్ధరామ |
| 17 | 11 | ఆరూఢ | ఆరూఢ |
| 18 | 10 | నీవలన | మీవలన |
| 19 | 17 | అదుఃఖము | ఆదుఃఖము |
| 21 | 19 | మల్లికార్జుమని | మల్లికార్జునుని |
| 22 | 3 | అధునిక | ఆధునిక |
| 22 | 19 | రాజు | రాజ |
| 23 | 9 | ఆతని | అతని |
| 28 | 12 | అమె | ఆమె |
| 26 | 21 | కిన్నర | కిన్నెర |
| 30 | 13 | లింగనిష్ఠలె | లింగనిష్ఠ |
| 34 | 18 | సత్క్రియా | సత్క్రియా |
| 34 | 21 | వదలి | యందలి |
| 35 | 8 | ఆదృశము | ఆదృశ్యము |
| 35 | 18 | ఆధ్వర్యమున | ఆధ్వర్యమున |
| 35 | 24 | ధార్వాడ | ధార్వాడ |
| 39 | 7 | దురదృష్టకరము | దురదృష్టము |
| 48 | 6 | అష్టావర్ణ | అష్టావరణ |
| 50 | 1 | స్వాయత | స్వాయత్త |
| 50 | 11 | శ్వాన | శ్వాన |
| 51 | 8 | ఆటుల | అటుల |
| 58 | 14 | నరు | నకు |

| | | | |
|---|---|---|---|
| 53 | 14 | వికుద్ధ | విరుద్ధ |
| 55 | 19 | అ | ఆ |
| 58 | 3 | తెలిసి | తెలిపి |
| 3 | 11 | మింగె | మ్రింగె |
| 9 | 8 | ఆందందు | అందందు |
| 11 | 9 | యమనేషము | యనువేషము |
| 16 | 3 | ధవ | భవ |
| 16 | 8 | లింగముమ | అంగమును |
| 16 | 8 | ఆంగమ | అంగము |
| 17 | 14 | నుంచి | నుంచిన |
| 20 | 7 | మందు | మందలి |
| 24 | 9 | అంగమా | లింగమా |
| 30 | 3 | ద్పెడుం | దెప్పుడుం |
| 34 | 21 | వలననా! | వలన, నా |
| 43 | 5 | క్రోధారులు | క్రోధాదులు |
| 43 | 5 | విషయారులు | విషయాదులు |
| 45 | 18 | వలుఫుము | వలువుము |
| 59 | 15 | ఆసత్య | ఆసత్య |
| 70 | 2 | కభిముబి | కభిముఖి |
| 71 | I | లి గము | లింగము |
| 80 | 15 | కదుగు | కడుగు |
| 82 | 18 | హత్కమలము | హృత్కమలము |
| 88 | 11 | ప్రసారి | ప్రసాది |
| 89 | 8 | లామములై | లాగమములై |

| | | | |
|---|---|---|---|
| 92 | 8 | కిన్నరయ్యె | కిన్నెరయ్యె |
| 92 | 15 | కిన్నరయ్యె | కిన్నెరయ్యె |
| 94 | 11 | పుణ్యుడవు | అతీతుడవు |
| 95 | 1 | మందవతరి చి | మందవతరించి |
| 95 | 3 | కూడుకొవి | కూడుకొని |
| 101 | 16 | పరిమాణము | పరిణామము |
| 106 | 5 | తారాపధము | తారాపథము |
| 107 | 2 | ఏ | ఏటు |
| 108 | 2 | ఘన ను | ఘనమును |
| 110 | 5 | బూపెర | బూసెద |
| 112 | 14 | ధళధళమని | ధళధళమని |
| 116 | 13 | పంచకుల | వంచకుల |
| 116 | 19 | పోనయ్యా | పోవయ్యా |
| 130 | 7 | బౌపోగుల | చౌపోగుల |
| 138 | 16 | కారునుని | కార్జునుని |
| 139 | 18 | మల్లికారుని | మల్లికార్జుని |
| 140 | 2 | మూర్జుడా | మూర్ఖుడా |
| 154 | 15 | బిగిరేగిట | బిగికౌగిట |

## మహాపోషకులు

* 12. శ్రీ పి. అమరేంద్ర నాయుడుగారు, చిక్కడపల్లి హైద్రాబాద్.
(Regionl Manager, A.P.S.C.B. Ltd.) 100 00

## పోషకులు

* 6. శ్రీ మునుగాల పార్వతయ్యగారు A.E.
చిక్కడపల్లి, హైధరాబాద్. 50-00

## సహాయకులు

* 16. శ్రీ జి.సి. శ్రీకంఠయ్యగారు, హైద్రాబాద్. 25-00

17. శ్రీ యాలాల శంకర లింగంగారు, మహ్మందు సేన్‌పల్లె (జిల్లా, మహబూబ్‌నగర్.) 25-00

18. శ్రీ లాలుకోట చంద్రప్పగారు, c/o శంకరలింగంగారు 25-00

19. శ్రీ బి. మహాంతయ్యగారు (R. B. I.) హైద్రాబాద్. 25-00

20. శ్రీ బి. ఈశ్వరయ్యగారు, హైద్రాబాద్. 25-00

## సభ్యులు

* 32. శ్రీ టి. ఎస్. సుబ్బరామయ్యగారు, హైద్రాబాద్. 10-00
(ఆంగ్లభాషోపన్యాసకులు అంబేద్కర్ కాలేజి)

33. శ్రీ ఎన్. వేణుగోపాలరావు గారు, హైద్రాబాద్. 10-00

34. శ్రీమతి ఎన్. తాయారమ్మ గారు, హైద్రాబాద్. 10-00

35. శ్రీ చుక్కా వీరప్పగారు, నల్లగొండ. 10-00

---

* ఈ సంఖ్యలు గత ప్రచురణ ఏకాదశ బిల్వమునుండి ముందుకు సాగినవి.

# సంక్షిప్త నిబంధనలు

## సమితి సభ్యులు

మహాపోషకులు రు. 100/- (నూరు రూపాయలు మాత్రమే)
పోషకులు రు. 50/- (యాభై రూపాయలు మాత్రమే)
సహాయకులు రు. 25/- (ఇరువైఐదు రూపాయలు మాత్రమే)
సభ్యులు రు. 10/- (పది రూపాయలు మాత్రమే)

1) వీరందరు సమితియందు శాశ్వత సభ్యులుగా నుందురు,

2) వీరికి గ్రంధమాలయందలి పుస్తకములు ప్రకటింప బడగానే పుస్తకముల తగ్గింపు వెల మొదలు తెలుపబడును. లేక 25% తగ్గింపు ధరతో V P.P. గా పంపబడును.

3) వీరు ఆ V.P.P. తప్పక తీసుకొనవలయును.

4) V.P.P. తిరిగి వచ్చినచో ఆ మొత్తమును తర్వాత పుస్తకము వెలతో కలిపి తెలుపబడును. ఆ మొత్తమును చెల్లించినచో పుస్తకములు పంపబడును.

5) ఐదునుంచి పదిమంది వరకు శాశ్వత సభ్యులు కాదలచినవారు ఒకే చిరునామాతో అందరి మొత్తమును పంపినచో వారందరి పుస్తకములను ఆ ఒకేచిరునామాకు పంపపడును. ఆ ఖర్చులను సమితి భరించుకొనును.

6) గ్రంధమాల యందలి పుస్తకములను తెప్పించుకొనువారు పుస్తకముల వెలమొత్తమును ముందుగా పంపినచో ఆ పుస్తకములు వారికి పంపబడును. ఆ ఖర్చులను సమితి భరించు కొనును.

7) పుస్తకములను సమితి కార్యాలయమునుంచి స్వయముగాగొనిపోవు వారికి 10% తగ్గింపు ఇవ్వబడును.